



---

* అశోకుని ఎఱ్ఱగుడిశాసనము ప్రతిబింబమున ఆ పేరుగల వైపే మొదలు: రెండవవైపే తుద. పొరపాటున పేరు పైని తలక్రిందుగ పడినది.

# చిత్రములు



చెన్నపట్టణము, సెప్టెంబరు ౧౯౨౯

సంపుటము ౭ శుక్ల సంవత్సరము భాద్రపదమాసము సంఖ్య ౯

## గులాబి

వేలూరి శివరామశాస్త్రి గారు

నేను

పాదు చేసితిని నేఁడాది క్రిందటి మెత్తమట్టి పోసితి చూచి మంచి దంటి
కాసారమున నుండి కావడితో నీరు తెచ్చి పోసితిఁ జూచి మెచ్చుకొంటి
నీకుఁ గావలసిన యాకలమ్ములు తెచ్చి యిచ్చితిఁ జాలునం చెంచుకొంటి
నాయెత్తు పెరిఁగిన నీ యొద్ద నిలుచుండి నా రాజ్ఞి వనుచు సంతసము గంటి
నిన్నుఁ గౌఁగిలి గొనియున్న నన్ను విచ్చు-పూలతోఁ గాంచి యవలికిఁ బోపకుండఁ
గొమ్మ గోరులతోఁ బట్టుకొందు వకట!-అంత యను మానమా చెప్పుమా గులాబి!

ఎల్లకడల్ గుబుల్కొనియు నేపగు తావుల నన్ను నల్ల దే
మల్లిక పిల్చునంచు ననుమానము నా పయి! నీ విటుండఁగా

వెళ్లను; లేక యొక్కపరి వెళ్లుదునం-చనుకొమ్మ, దాని మ
త్తిల్లిన తావి నీకడకుఁ ద్రిప్పఁగ నెంతయొ సేపు పట్టునే?.

నీకు ననత్య మెన్నఁడును నే వచియింపను జాది యల్ల దే
నాకడ కొక్కసారి యయినన్ దయచేయుఁ డటంచు నెంతయో
యాకులపాటుతోడ మరుదర్భకుఁ బంచును నేను నొక్క మా
రా కడ కేఁగ దాని రసమంతయు నంతె మగున్ గులాబిరో!.

ఒకటి నీకును నేఁ జెప్పకుండఁ జాల-నల్ల చంపకిఁ జూడ నేఁ బల్లవింతుఁ
గాని నీచేత నేను భృంగంబనైతి-నంచు నది దెప్పుచుండు నన్నప్పుడపుడు.

గులాబి

చెలువుండా! యల మల్లి నీకు వలపుం జెప్పంపు నాజాది నీ
కెలమిం గూర్చెడు చంపకిన్ మఱియు నింకెన్నెన్ని యో యున్నఁటిం
గలయంజూడుము; కాని నీ వవలికిం గాల్వెట్ట లోకుల్ కడున్
బలముం జొన్పి గ్రహించుచున్ నఖములన్ బాధింత్రు దంతంబులన్
నీతో నేమని చెప్పికొందుఁ బ్రియుఁడా! నేఁ జెల్ల! నొక్కండు నన్
మూతిన్ ముక్కును జొన్పి క్రోలు మఱియుం గొండొక్కఁ డౌరా యెదన్
జేతం దాల్చును వేఱొకండును శిరస్సీమంత మందుంచుఁ ద
ర్వాతం జెప్పను నాదునోరు పడినన్ బాగుండి పోవుం బ్రభూ!.

నీ దారి కెందు నడ్డము-కాఁదలఁపను నాత్మహత్య కడుఁ బాతకమౌఁ
గాదా? నీ వావలికిం-బోఁదలఁచిన నన్ను జంపి పొ మ్మోసఖుఁడా!.

నేను

నిన్నే? నేనే? చంపుటె?-కన్నావో లేదో యోపికగ నాదు మదిన్
కన్నె గులాబీ! కాయం-బున్నది యున్నటులు చీల్చియును జూపింతున్.

ఇదె చీల్చితి లోలోపలఁ-బ్రదరంబున నుండి కానవచ్చుం గనుమా
మదిరాక్షీ! యింకను కే-సెదఁ జిలిక చూడు మిపుడు శీలించితివే?.

## గులాబి

ఇది యే మిచ్చట నేఁ బెరింగితి నహో యెన్నేని పుష్పాలతో
నదిరా చూచితిఁ జూచితిం బ్రియము నాథా, నే సనాథం గదా!
హృదయం బంచును నీకు వేతెచటఁ దా నేపారు? నేనేను నీ
హృదయంబైతి క్షమింపవా ప్రియతమా! యీ ప్రౌద్ధునన్ నిన్నేగిన్.

నాదు పూవుల కన్న సన్నమును మృదుపు-చెలువమై తగు నీ మేను చీల్చికొంటి
నాథ, యింకను నన్ను సనాథగాఁగఁ-జేయుదువ యేని నతుకుము చేతమునకు.

పాపాత్మన్ వల పెంత యుండుటకునుం బ్రామాణ్యమో యంతకున్
మోహ ప్రొవ్వలపూని నీమెయికిన్ మోసంబు గావించితిన్
నాపూరేకులు నాదు జీవరసమున్ సంధించి యీగాయమున్
లేపింపంగద వోయి ప్రాణసఖుఁడా! లెమ్మోయి నాకైనన్.

## నేను

వల పింత యుండఁగా వలయు నంచును నొక్క-కొలబద్ద యెందేని గలదె చెలియ!
ఒకతెటుంగని సివ ముందుటే వలపున కొకకొలబద్ద సుమ్మో గులాబి!
నీ సుమనో దళాసీకమ్ము నిటు లిమ్ము కూలార్చు గాయమ్ము కుట్టుకొందు
అందాఁక నీతావి నడరించి నాదు నా సాపుటమ్ముల నూఁదు మాఁపకుండ
పిదప నీవును నేనును ముదిమి లేక-లోక మించుక యెఱుఁగఁగాఁబోక యేక
శయ్యాయందుల నిర్నిమేషంబుగాఁగ-నొక్కటయి పోవుదమురా విన్మఁకో గులాబి!.

---

# రవీంద్రనాథ ఠాకూరుగారి ఇంటా బయటా

పారనంది జగన్నాథస్వామిగారు, యం. ఏ., యల్. టి.

'భారతి' గత కార్తికసంచికలో "విశ్వభారతీ గ్రంథమాల" అనే శీర్షిక క్రింద ఠాకూరు గారి రెండు గ్రంథములను—గృహప్రవేశము-పోస్టుఆఫీసులను—చదువరులకు ఎరుకపరిచేయున్నాను. ఇంటాబయటా ఆ గ్రంథమాలలోనిదే. ఇదొక నవల; ఇదివరకు ప్రచురించినవి చిన్ని నాటకములు. చిన్నచిన్న కథల సంపుటముల రెండింటిని ప్రచురిస్తున్నారు. గ్రంథముయొక్క రూపమేదైనా, నాటకమనండి, కథ అనండి లేదా నవల అనండి, ఏదైనా సరే రవీంద్రుని ఆధిక్యము ప్రతీదానిలోను విశదమవుతూ ఉంటుంది.

బంగాళీలో ఘూరె బహిరె అన్నదానికి ఇది తర్జుమా. దీనిని చాలారోజుల క్రిందట ఇంగ్లీష్ లోనికి తర్జుమా చేసి Home and the world అన్న పేరుతో ప్రచురించేయున్నారు. ఇంగ్లీషు నెరిగిన వారు చాలా మంది యీ గ్రంథమును చదివి ఆనందించి యుంటారు. ఇంగ్లీష్‌నుండి దీనిని తెలుగులోనికి తర్జుమా చేయుటకు చాలామంది సారస్వతాభిమానులూ, ఠాకురుగారిని మెచ్చుకొను వారూ అభిలషించి యుండిరి. కాని అనేక కారణముల చేత ఇప్పటికిగాని కేవలము ఆంధ్రభాషను చదివే వారికి ఈ ఉత్తమగ్రంథము అందినది కాదు. దీనిని తయారుచేయుటలో ఇంగ్లీష్ గాక బంగాళీప్రతే మూలమగుటచేత గ్రంథమునకు చాలా లాభము కలిగినది. తర్జుమాకు బంగాళీ భాష సులువగునట్లు ఇంగ్లీషు కాదు. బంగాళీ నుండి ఇంగ్లీషు తర్జుమా తయారైనపుడు ఎందుచేతనో కాని కొన్ని మూలభాగములు జారిపోయినవి. ఇంగ్లీషు భాషలో ఠాకూరుగారి పుస్తకములను చదివేటప్పుడు ఠాకూరుగారి శిల్పకౌశల్యమునకు సంబంధించిన కొన్ని అంశములు బోధపడవు. అందుచేత ఈ తెలుగు తర్జుమావల్ల కేవలము ఆంధ్రభాషను చదివే వారికే కాకుండా ఆంధ్రుల కందరికీ ఒకవిధమైన మేలు కలిగినది.

ఈ మేలు ముఖ్యముగా భాషకూ శైలికీ సంబంధించినది. ఠాకూరుగారు కేవల వ్యావహారిక భాషను ఉపయోగిస్తారు. ఆ విషయమై వారు చూపే స్వాతంత్ర్యమునకు వారి స్వేచ్ఛ కాక వేరే ఎట్టి నియమము లేదని చెప్పవచ్చును. వారి అభిప్రాయాదులు చాలా ఆధునికములూ నూతనములూ. వారి భావన, భావాదుల ధార మిక్కిలి జోరుగా ఉంటుంది. వీటన్నిటికి అత్తేటట్లు భాషాంతరీకరణశైలి ఉండాలంటే, నిరోధము లేకుండా ఉండేటట్లు ప్రవహించే వ్యావహారికభాషే. సరిపోతుంది

గాని గ్రాంథికభాష ఉపచరించదు. ఈ సూచన బాగా విశదపడినది ఈ తర్జుమాలో. ఎక్కడ చదివినను భావములు సూక్ష్మముగా ఉన్నట్లున్ను, భావన నూతన శక్తిని ఉన్నట్లున్ను తేలికగా బోధపడుతుంది. సందీపుని వాదన ప్రవాహమునకూ, వాదముల సూక్ష్మతకూ, అత్తునట్లు వాక్యముల రచన కలదు. ఏచోటనైనాసరే సందీపుని వాక్యములను తీసి సహజముగావచ్చిన మాటలను గ్రాంథికవ్యాకరణానికి సరిపడే ప్రత్యయములతోనూ, సంధులతోనూ కారకములోనూ వ్రాసినట్లయితే, తర్జుమాలో అవలంబించిన శైలియొక్క యోగ్యత స్పష్టపడుతుంది. భావములు హృదయమందు నాటవలెను; అభిప్రాయములుమనస్సుకు ఎక్కవలెను; తర్కముబుద్ధికి తట్టవలెను; వర్ణనలు చదువరి భావనలో మిళితము కావలెను. ఆయా కార్యములు నెరవేరుటకు భావాదులకు మధ్య సహజముకాని ప్రత్యయాదులు దూరకూడదు. నిత్యవ్యవహారములో ఉండే దీర్ఘాలలోను కారకములోను ఉండే సరళత, ధ్వనిసూచకత్వములు అప్రయత్నపూర్వకముగాను చక్కగాను విశదపడుతవి. ఈవిషయమై ఎంతవ్రాసినా లాభముండదని విమర్శకులు కొందరు ఉంటారు; వారికి నచ్చడానికి ఒకటే మార్గము. సాధ్యమైనంత సానుభూతితో గ్రంథమంతాను చదివి ఆనందించిన తరువాత ఆవిమర్శకులు పర్యాలోచనచేస్తే నా వాదము, ఈ శైలియొక్క యోగ్యతలు నచ్చవచ్చును.



ఇంటా బయటా రెండూ రెండు విధములైన మనోనిర్మాణములకు సూచనలు. ఇంటి నాలుగు గోడలమధ్య ఉన్నదే ప్రపంచమంతా అని తయారైన జనానాస్త్రీ, బయటనున్న దేశవ్యవహారముల గడబిడతో తయారైన వ్యక్తి- ఈ రెండు రీతుల మనస్సులను సూక్ష్మబుద్ధితో విప్పి విభజించి పరీక్షిస్తే విమర్శకునికి వ్యక్తమయేదానిని కథలోనికి గ్రుచ్చి వర్ణించేటప్పుడు ఇంటా బయటా కంటెఅనుకూలమైన పేరు మరొకటి దొరకదుగదా. ఘోషాపద్ధతిలో హిందూసంఘ మర్యాదల ప్రకారము, పెరిగిన స్త్రీలు విమల, ఆమె వొదిన చోటారాణీ, ఇంగ్లీషు చదువుతోపాటు, కొంతప్రపంచమును చూచి, దేశమందు అన్నిమూలల ఆవరించుకొనియున్న సాంఘిక రాజకీయ సమస్యలతో పరిచయము సంపాదించి ఆసమస్యల కొరకు దేశసేవ చేయవలెనని మనోదార్ఢ్యము గల పురుషులు నిఖిల్, సందీప్, మాష్టర్ మొదలైనవారు. ఇట్టి భిన్నవాసనలు గల వ్యక్తులను జతపెట్టి, ఆవాసనల ప్రభావమును వర్ణించేకథ ఇంటాబయటా. ఇంటి సంప్రదాయములలో పెరిగేవారిని బయటసూచించే సంప్రదాయములలోనికి తీసుకోవస్తే ఆవ్యక్తులలో ఆ రెండు సంప్రదాయములసంఘర్షణవల్ల పుట్టే కలవరము, ఉద్రేకము, అందువల్ల సంభవించే ప్రమాదము మొదలైన ఫలితములను సూక్ష్మదృష్ట్యా వర్ణించేది ఇంటాబయటా. పతికంటె వేరగు పురుషుని మొగమెరుగని పతివ్రతను, జనానాకంటె వేరైన ప్రపంచమును కని విని

ఎరగని ముగ్ధను ఒకేసారి బయటకు తీసుకొని వస్తే ఆమె భావప్రపంచమెట్లు కల్లోలమగునో, అదివరకుండే మనఃస్థైర్యమెట్లు భంగమొంది కలవరపెట్టునో వర్ణించేకథ ఇంటాబయటా. తర్కము వాదోపవాదములు, కుశలబుద్ధి, మొదలైన వివేకధర్మములకు అలవాటు పడని నిర్మలహృదయముపై ఒక్కమారు తీవ్రమైన వాటి దెబ్బతగిలితే ఆ హృదయమెట్లు తత్తరపడి సహజమైన ముగ్ధత్వమునకున్నూ, కుశలబుద్ధిచే ఆపాదింపబడ్డ నూతన రుచులకున్నూ మధ్యకాలిబంతివలె కొట్టుకొంటుందో సూక్ష్మముగా ఈ కథలో వర్ణింపబడినది; ఒకప్రభావపరంపర ఇంటిది, మరొకటి బయటిది.

జమీందారు నిఖిల్ విద్యనభ్యసించి దేశసేవాపరాయణుడైనాడు. అన్నివిధముల అతని శీలమునకుభిన్నమైన శీలముకల సందీప్ ఈ దేశసేవలో నిఖిల్ కి సహకారై అతని కోటలోనే పనచేసుకొన్నాడు. స్వదేశి ఇద్దరికీ కట్టుకొన్న కంకణము. కాని వారుపయోగించేవి, ఉపయోగించ దలచుకొన్నవి పద్ధతులు మాత్రము పూర్తిగా విరుద్ధములు. వ్యక్తి స్వాతంత్ర్యమునకు ఎట్టిభంగమూ లేకుండా శీలము, ధర్మము, ఋజుత, ఏవిధాన్న చెడకుండా ఉండే పద్ధతినే అవలంబించాలని నిఖిల్ ఆదర్శము; మంచి చేయడానికి మంచే సాధనము గాని, మంచికానిది సాధనము కానేరదని అతని అభిప్రాయము. సందీప్ ఆదర్శము అదికాదు. కార్యము సాధించుటకు ఏది ఉపచరిస్తే అదే సజ్జనపద్ధతి, మంచి అనగా కార్యసాధనమున కుపచరించేదైతే అది. కాబట్టి నిఖిల్ సందీప్‌లు అవలంబించిన పద్ధతులు విరుద్ధములు. చదువుచెప్పించి, పనిలో నేర్పువచ్చేటట్లుచేసి, ప్రజలకు బోధపరిచి, లాభము ఎంతవరకు వీలుఅవుతుందో చూసి, స్వదేశి నడిపించడము నిఖిల్ పద్ధతి. దోపడి చేయించి, విదేశిదుకాణాలు కాల్పించి, విననివాళ్లను హింసించి, ధనము కోసము దొంగతనాలు చేయించి ఏదోవిధాన్న స్వదేశి నిలపాలని వాదించేవాడు సందీప్. అందుకు ఉపచరించే కుతర్కము, వాగ్ధోరణి, వాదవిజృంభణము సందీప్‌కు కలవు. కాబట్టి నిఖిల్‌కు ఉన్నట్టి విద్యాపరిజ్ఞానములు లేని ముగ్ధస్త్రీలను, అవివేకప్రజను, బుద్ధిలేని యువకులను సందీప్ సులభముగ వశపరచుకోగలిగేవాడు.

ఇట్లు నిఖిల్ రాణీని విమలనుకూడా సందీప్ తాను సృష్టించిన మంటలోనికి లాగేశాడు. దేశమాతపూజ అన్నపేరున విమల వాని వలలో చిక్కుకొని నిఖిల్‌పై గల ఆదరభావమునకు లోపము రానిచ్చింది. పతిభక్తికి విగ్రహము నిఖిల్; దేశభక్తికి విగ్రహము సందీప్. ఈ రెండింటికి విరోధము కలిగినప్పుడు ఇంటిని కూడా ఆక్రమించే బయట ఆమెను వశపరచుకొన్నది. దేశసేవకేగదా నిఖిల్ కూడా ప్రవర్తిస్తున్నాడు. నిఖిల్‌కు గల సంకోచమువలన, మాధ్యమువలన మందుతూఉన్న కాంతి కానరాకున్నది. క్రమముగా పతిభక్తికంటె ఎక్కువైన దేశభక్తి ఆమెను ఆవరించడము చేత,

సందీప్ విగ్రహము ఒక్కటే ఆమె చైతన్యాన్ని అంతని ఆశ్రయించుకొన్నది. కాని ఆమె భక్తి పరాయణత్వము, నిష్కాపట్యము, నిర్మలస్వభావము మనకు ఆమెయెడల ఉండే గౌరవమునకు భంగము రానీయవు. అమూల్యయెడల ఆమె చూపిన భ్రాతృత్వము ఆమె మోహసముద్రములోనుండి పైకి లేచినప్పుడు కనబరచిన సౌహార్దము విమలయొక్క సౌజన్యతను కొనియాడును.

సందీప్ స్వార్థపరాయణు డనిన్ని, కుటిల స్వభావుడనిన్నీ విమల పతంగమును ఆకర్షించ డానికి మాయకాంతిని ప్రజ్వలింప జేస్తున్నా డనిన్నీ నిఖిల్ దెలుసుకొనకపోలేదు. కానినిఖిల్ ఆదర్శము వ్యక్తిస్వాతంత్ర్యము. ఒకరి స్వేచ్ఛకు నిరోధము కల్పించే స్వాతంత్ర్యాభిలాషి దొంగ అని అతని సిద్ధాంతము. విమల స్వేచ్ఛకు ఆటంకము లేనప్పుడే నిఖిల్ కు ఆనందము. చిలుకను పంజరములో ఆడిస్తూ ఆనందించ వలసిన స్వాతంత్ర్యవాది కాడు నిఖిల్. ఇంట నున్న విమలను బయటకు తీసికొనివచ్చినవాడు నిఖిలే. ఆమెకు సందీప్ పరిచయము కలుగ జేసినవాడు నిఖిలే. ఆమె తన అవసరము లేకుండానే సందీప్ తో దేశసేవా వాదములు జరుపుతూ ఉంటే ఆనందించేవాడు. తరువాత సందీప్ తంత్రము తెలిసినా, విమలకు ఎట్లు నచ్చచెప్పడమో నిశ్చయించుకొనలేక పోయి నాడు. సందీప్ శీలము తనకెట్లు తెలిసిపోయి నదో అట్లే విమలకుకూడా కొంచెము ఆల స్యంగా నైనా తెలిసిపోతుందని నమ్మిన వాడు నిఖిల్. ఆమె కనుగొనని దానిని ఆమెయందు బలవంతాన ప్రవేశపెట్టకూడదని భావించి నాడు నిఖిల్. కాబట్టి కథ ఆలాగు నడిచింది.

ఈ ముగ్గురి ముఖ్యపాత్రల మధ్య ఇంకా ఎన్నో చిన్నచిన్న పాత్రలు వస్తవి. అవి చిన్నవే అయినా, కథాభాగములో వాళ్లు చేసిన పనులు అంత పెద్దవి కాకున్నా, వారి శీలము, వారి ఆత్మధర్మము మాత్రము విపుల విస్తృతి కలిగినవే. అమూల్య విమలయెడల కనబరచిన సోదరప్రేమ, శరీరత్యాగము దివ్య సమమైనవి. సందీప్ శిష్యుడైనా విమలపై సందీప్ ప్రయోగిస్తున్న తంత్రమునకు దొరకక విమలకు తగిన తమ్ముడుగా అమూల్య ప్రవర్తి స్తాడు. సుందరమైన స్వభావము. నిఖిల్ కు తగిన వాడే ఆమేష్టర్. నీతివంతమైన స్వేచ్ఛ ఎట్టిదో కార్యరూపమున పంచువిషయమై చూపిన వాడు అతడు. పూర్వ సంప్రదాయములలో పెరిగినా చోటీరాణీ మానవహృదయము నెట్లు వ్యక్తపరుస్తుందో చూస్తే హృదయము చలిస్తుంది; కాబట్టే పూర్తిగ నూతన సంప్ర దాయావలంబుడైన నిఖిల్ ఆమెపై ఎల్లప్పుడూ ఆదరము చూపించే వాడు.

ఇట్లు పాత్రల హృదయమును విశద పరుస్తూ, ఉన్నత భావపరంపరలతో పొంగి పొరుతూ, బుద్ధిసూక్ష్మత, శీలవ్యక్తీకరణము, స్వభావనిరూపణము మొదలైన ఉన్నతశిల్పధర్మ ములకు నిదర్శనప్రాయమవుతూ గ్రంథము ఉం టుంది. ఠాకూరిగారు శిల్పచమత్కారమును

తెలుసుకోవాలన్నా, ఠాకూరు ఆదర్శతత్వమును పరీక్షించాలన్నా, ఈ నవలను చదివి తీరవలసిందే. నవలకు సాధారణముగా కథ ముఖ్యమైనా, దీనికి మాత్రము కథ ప్రధానము కాదు. కథ లేకపోలేదు. కాని కథనము ముఖ్యము కాదన్నట్లు కథను ఒక క్రొత్త ఫక్కీని ఆయన వివరించాడు. నిఖిల్ సందీప్ విమలలు ముగ్గురూ వారివారి కథలను వర్ణిస్తూ మొత్తముకథను చెప్తారు. ఈపద్ధతి బ్రౌనింగ్ 'ది రింగ్ అండ్ ది బుక్కు'ను (Browning: The Ring and the Book) అనుకరిస్తున్నదా అనేది ముఖ్యప్రశ్న కాదు. బ్రౌనింగ్ పుస్తకమువల్ల ఇట్టి పద్ధతి ఠాకూరుగారికి తట్టిందా అనేది మనము పరిష్కరించలేము. కాని రెండింటికి గల సామ్యము కేవల బాహ్యమనిన్నీ చాలా ముఖ్యాంశములలో భేదమున్నదనిన్నీ నొక్కి చెప్పవలసి యున్నది.

ఈ పుస్తకమును జాగ్రత్తగా చదివిన వారికి ఠాకూరిగారు శిల్పము తత్వము ఆదర్శములు - ఇట్టివి చాలా విషయములు చక్కగా బోధపడగలవనే ఉద్దేశముతో దీనిని విశ్వభారతీగ్రంథమాల వారు తెలుగు లోకమునకు అందజేసినట్లు నేను తలుస్తున్నాను.

ఈగ్రంథము వాఙ్మయములోని నవలారూపమునకు నిదర్శనముగ భావిస్తే కొన్ని లోపములు కానవస్తవి. కొసకు రాగానే కథను అంతమొందించుటకు కవి తొందరపడినట్లు తోస్తుంది. నిఖిల్ ఎక్కడాకూడా విమలకు సందీప్ కుట్ర, లేదా, సందీప్ వాదములలోని లోపములు బోధపడేటట్లు చేయడానికి ప్రయత్నించడు. మల్లెపూవు సుగంధము వర్ణించిచెప్పాలా అని కాబోలు నిఖిల్ ఉద్దేశము. అయినా కొంతబోధన ఆధ్యాత్మిక విషయాలలో ఆవశ్యకము కదా. విమలకు చదువు చెప్పించ ప్రయత్నించినంత మాత్రాన ఎంతవిద్య అబ్బిందో, ఆ విద్యవల్ల ఆమె బుద్ధి వికసించిందో లేదో తెలుసుకొనకుండా ఆమెస్వేచ్ఛాప్రాప్తికి ఆమెనే సాధనముగా విడిచిపెట్టట కోతిచేతిలోని కత్తివలె కాదా అని నిఖిల్ వితర్కించినట్లు కానరాదు. ఇట్లు విమర్శించకూడదు ఠాకూరుగారి నవలను; వాటి ఉద్దేశము నవల వ్రాయడము కాదని అంగీకరిస్తే ఈ విమర్శనలకు చోటు ఉండదు.

మానసతత్వమును ప్రతిపాదించే కథలోనికి బెంగాలీదేశమును క్షోభింపజేసిన చీలికను, దానికి ప్రతీకారముగా నాయకులు ప్రతిపాదించిన స్వదేశీవ్రతమును ప్రవేశపెట్టడములో కవికి రాజకీయాదర్శముల సూచన ప్రధానోద్దేశమని కొందరు భ్రమపడవచ్చును. అది ప్రాసంగికముగాని ప్రధానము కాదు. కాబట్టి ఆచీలిక ఆందోళనము చల్లారినా గ్రంథము యొక్క ప్రశస్తి తగ్గలేదు. క్రమముగా ఠాకూరుగారి తత్వము తెలిసినకొలది గ్రంథము యొక్క ప్రాశస్త్యము ఎక్కువ ఆమోదమునకు వస్తూ ఉన్నది.

---

# సంస్కృత వాఙ్మయము - పాశ్చాత్యోపజ్ఞత

కొత్త సత్యనారాయణ చౌదరి గారు, ఉభయభాషాప్రవీణ

వైదిక భారతీయుల విజ్ఞానశేముషికి హేతుభూతమగు సంస్కృతవాఙ్మయము పదునాలు పదునేను శతాబ్ద ప్రాంతములలోఁ బాశ్చాత్యదేశములందుఁ గూడఁ బ్రసరించెనని విద్యాధికులగు విమర్శకులు వాకొనుచున్నారు. నిరపాయములగు నుపాయములచే సునిపుణముగ దేశమంతయు నాక్రమించిన పాశ్చాత్యులు ప్రప్రథమమున భారతీయ రాజ్యకార్య నిర్వహణమునకు సంస్కృతభాషాభ్యాస మావశ్యకమని తలఁచిరి. కావుననే ఆనాఁటి రాజప్రతినిధియగు Warren hastings అనువాఁడు భారతీయులను దదీయ ధర్మానురోధముగఁ బరిపాలించుటయే శ్రేయమని భావించి, ప్రాచీనములును బ్రధానములునగు వ్యావహారిక ధర్మగ్రంథముల నవలోడనము గావించి యందు సారమును గ్రోడీకరించుటకై బ్రాహ్మణుల ననేకులను బ్రేరేపించినట్లు చరిత్ర లుద్ఘోషించుచున్నవి. అట్లు క్రోడీకరింపఁబడిన సారగ్రంథమును పారశీకభాషామూలముగ నాంగ్లేయులు స్వీయభాషలోఁ బరివర్తనముగావించి ౧౭౭౬ వ సంవత్సరమునఁ బ్రకటించిరి. అప్పుడే భారతీయులభాషాసాహిత్య విషయికమగు వాస్తవిక వృత్తాంతము యూరోపీయ దేశములలోఁ బ్రశంసింపఁబడెను.

ప్రప్రథమమునఁ బాశ్చాత్యులలో Charles Wilkins అను నతఁడు సంస్కృతవాఙ్మయమునఁ గృషిసల్పి తద్దేశీయులకు మార్గదర్శకుఁడయ్యెను. ఇతఁడు వారాణసియందధివసించి Warren hastings చేఁ బ్రేరితుఁడయి నైరాణ్యవాణీయం దపమానముగఁ బ్రావీణ్యమును గడించి ౧౭౮౫ వ సంవత్సరమున భగవద్గీతను రెండుసంవత్సరముల తరువాత హితోపదేశమును భాషాంతరీకరించి ప్రకటించెను.

ఇట్లే Sir William Jones అను పండితుఁడు పదునొకండు వత్సరములు భారతవర్షమందు విశ్రాంతమగు కృషిసల్పి బెంగాలీదేశమందు 'ఏష్యాటిక్ సొసైటీ' అనుపేరుతోఁ బరిషత్తునొకదాని నేర్పఱచి ప్రాచీన భారతీయగ్రంథముల పరిశీలనమందుఁ బండితుల కుత్సాహము నుద్భవింపఁజేసెను. ఇతఁడు స్వల్పకాలమందే సంస్కృత సాహిత్యమును గడించి, ఆనాఁటికి Herder, Goethe మున్నగువారిచేఁ బ్రశంసింపఁబడి, ఆర్యుల కల్పనాచాతుర్యమును జాటు 'అభిజ్ఞానశాకుంతలము'ను బరివర్తించి ౧౭౮౯ వ సంవత్సరములోఁ బ్రకటించెను. తరువాతఁ గ్రమక్రమముగా, ధర్మశాస్త్రగ్రంథములకెల్లఁ దలమానికమయి విశ్వవిఖ్యాతమగు మనుస్మృతిని గూడ భాషాంతరముచే ననువదించి ప్రకటించెను. ఇంతియగాక సంస్కృతగ్రంథములను ముద్రింపించుటయందుఁ గూడ నితఁడే మార్గదర్శి. ౧౭౯౨ వ సంవత్సరమున నితఁడు కాళిదాసప్రణీతమగు ఋతుసంహారమను శృంగారరస ప్రధానమగు ఖండకావ్యమును ముద్రింపించెను.

క్రమముగ Henry Thomas Colebrooke మున్నగు పాశ్చాత్య పండితులీ వాఙ్మయమునఁ గృతవ్యవసాయులైరి. ఇతఁడను త్తమమగు ప్రతిభావిభవముచే సంస్కృతభాషను దత్సాహిత్యమును శాస్త్రీయరీత్యా పరీక్షించి, సంస్కృతగ్రంథముల నాత్రమేగాక, తత్సంబంధములగు భాషాంతరానువాదములను, దద్విషయములను గ్రోడీకరించి వివరించిన యుపన్యాసములను, బ్రకటించి, తరువాతివారికి భాషావిషయమై పునాది నేర్పఱచినాఁడు.

ఇంతవఱకుఁ బాశ్చాత్య పండితులీ వాఙ్మయమున విశిష్య సాహిత్య విషయమందు మాత్రము దత్తదృష్టులైరి. ౧౮౦౮ వ సంవత్సరప్రాంతమందు సాదృశ్యచారిత్రవిధుల (Comparative Method, Historical Method) మూలముగ భాషాశాస్త్రవిషయమై

సంస్కారవిశేష మొకటి కలిగినది. దీనినాధారపఱచు
కొనియే ౧౮౧౬ వ సంవత్సరమున Franz Bopp
అనునతఁడు సంస్కృతధాతువిషయక వికరణ వ్యవస్థను
గ్రీక్ లేటిన్ పారసీక జర్మనీభాషలందలి ధాతువికరణ
వ్యవస్థను గల సాదృశ్యవైదృశ్యములను బరిశీలించి
చక్కని విమర్శన గ్రంథ మొక్కదానిని రచించెను.
ఏతద్విమర్శ గ్రంథోదయముచేతనే జర్మనీ దేశీయులు
మున్నగు వారికి సంస్కృతభాషాభ్యాస విషయమై అపా
మహిమికమగు మహోత్సాహమతిశయించినది. ప్రథమమున
భాషాశాస్త్రమునకు Schlegel పండితుఁడే యంకుర
మును వైచెను. క్రమశః దానిని తద్దేశీయులు పోషించిరి.

తొలుత పారస్యతమందే బద్ధదృష్టులై యున్నను
పాశ్చాత్యులు క్రమక్రమముగ వైదిక గ్రంథములందుఁ
గూడ నాదరముగలవారై వానిని గూడ ముద్రించి ప్రక
టింప పనుకట్టిరి. ౧౮౩౮ వ సంవత్సరమున ఋగ్వేద
సంబంధమగు ప్రథమాష్టకము ముద్రించి ప్రకటింపఁబడి
నది. Rudolf Roth అను గొప్పపండితుఁడు వైదిక
భాషావిషయకమగు శాస్త్రమును రచించి పాశ్చాత్యులకు
మఱింత యుత్సాహమును సంపాదించెను. ఇందు వైదిక
సాహిత్యమును దచ్చరిత్రమును విశదీకరించు విమర్శనము
వలనఁ బాశ్చాత్యులలోఁ బందొమ్మిదవశతాబ్దము నుత్తరా
ర్ధమం దొకవిధమగు సంస్కారము మూపకట్టెను.

తరువాత నతిశీఘ్రముగ, వేదకాలికములు తదనం
తరకాలికములు నగు సంస్కృతగ్రంథములనేకములు ప్రచు
రింపఁబడినవి. ప్రచురప్రచారములచే నా గ్రంథము లన్ని
యుఁ జాలవఱకు సుసాధ్యములైనవి.

ఈవాఙ్మయమండలిగ్రంథముల యసంఖ్యాకత్వము
పాశ్చాత్యపండితుల కత్యంతాశ్చర్యమును నాదరాధిక
మును గల్పించెను. గ్రీకుదేశమందలి ప్రాచీనగ్రంథ సము
దాయ మంతయుఁ బరిమాణవిషయమై ఆర్యవాఙ్మయ
మండలి నాలుగువేదములకే సరిపోయినదనుట ఆశ్చర్య
మును గలిగింపదా! విద్యేల! సంస్కృతసాహిత్య
భాండాగారము గ్రీకులయు, రోమకులయు, గ్రంథసము
దాయమునంతను నతిక్రమించి యున్నదని పాశ్చాత్య
పండితులే నిర్ధరించియున్నారు. అట్టి యీ వాఙ్మయ
మంతయు నూఱుసంవత్సరములలోఁ బరామర్శించిన
పాశ్చాత్యుల నిరంతరకృషి శ్లాఘనీయమనుట సత్యేతరము
కాదు.

గ్రంథముల నెన్నింటినో ముద్రింపించిరి. ప్రధాన
గ్రంథముల ననేకములను భాషాంతరీకరించిరి. అదృష్టా
శ్రుతపూర్వమయి సువిశాలమగు సంస్కృత శబ్దార్థకోశ
మును రచించిరి. ఆర్యసంప్రదాయముల ననుసరించిన
పురావృత్తోదంతములను క్రోడీకరించి వివరించు సర్వార్థ
కోశమొకటి ప్రకటించిరి. ఈతీరున శక్తికొలఁది సర్వత్ర
గాలించి పాశ్చాత్యు లిన్నిగ్రంథములను బ్రకటింపుచుండి
నను, శేషించి యప్రకటితములై యసంఖ్యాకములగు
మఱికొన్ని గ్రంథములు భారతీయులయుఁ బాశ్చాత్యు
లయు భాండాగారములలో నివసించుచున్న వనుట
యే తద్వాఙ్మయౌత్కృష్ట్యమును జాటుచున్నది.

క్రమక్రమముగ నన్యదేశీయుల కీ వాఙ్మయ మం
దభిరుచి యతిశయించినది. వైదికగ్రంథాలోడనముచే,
తాదాత్వికమగు భాషాస్వరూపమును, వర్ణాశ్రమధర్మ
ముల ననుసరించిన లోకయాత్రాసరణియుఁ, బ్రతిభా
ప్రభావద్యోతకమగు వైదికగ్రంథములందలి కల్పనారీ
తియు నంతసనుక నవ్యక్తముగా నుండి ప్రస్ఫుటములగు
టచే వానియందుఁ బాశ్చాత్యులకు మఱింత యభిరుచి
కలుగఁజొచ్చినది. భారతీయుల నాగరక పరిష్కార విశే
షము (Civilisation) లన్నియుఁ బాశ్చాత్యులకుఁ
బ్రత్యక్షములైనవి. ప్రాచీనవాఙ్మయపరిగణన మందిదియు
నొక యుత్తమవాఙ్మయమనఁ దగునని వారికి దృఢముగఁ
దోఁచినది కావుననే సంస్కృతభాషోపలబ్ధిచే శబ్దసా
దృశ్య నిబంధనమగు భాషాశాస్త్రమును రచించినట్లు,
వైదికసాహిత్య సముపలబ్ధిచే, Adalbert, Kuhn,
Maxmuller మున్నగు పండితులు దేవతోపాఖ్యాన
సాదృశ్యనిబంధనమగు దేవతాశాస్త్రమును(Mythology)
రచించిరి. ఈ నవీనపంథయే ప్రాచ్యపాశ్చాత్యపండితుల
లోని తారతమ్యము నగ్గడించుచున్నది.

భారతవర్షీయ సంస్కృతగ్రంథములకు సంబంధించిన చరిత్రకాలమును పాశ్చాత్యులు ద్వివిధముగ విభజించి చూపిరి. అందు మొదటిది వైదికకాలము రెండవది లౌకిక సంస్కృతకాలము. వైదికకాలము క్రైస్తవాబ్దారంభమునకుఁ బూర్వమే ఆరంభమయి రెండవ శతాబ్దము వఱకును వ్యాపించి యున్నదని పాశ్చాత్యుల సిద్ధాంతము. అందును వైదికయుగముయొక్క పూర్వార్ధములో, ప్రాపంచికవస్తువర్ణనములం దుద్యుక్తములై పద్యమయములగు వైదికగ్రంథము లుత్పన్నములైన వనియు, నయ్యవి సింధునదిని, దచ్ఛాఖలను నొఱయుచున్న పంజాబ్ దేశములందు జనించిన వనియు నిర్ణయించినారు. తరువాత బ్రహ్మవిద్యోపపాదకములయి గద్యపద్యమయములగు వైదికగ్రంథము లావిర్భవించిన వనియు, వాని యుత్పత్తి దేశము గంగాతీరప్రదేశములనియుఁ బాశ్చాత్యులు విభజించిరి. ఈ తీరున సింధునదీముఖ మారంభించి గంగానదీముఖమువఱకు వ్యాపించి వింధ్యహిమాచలముల మధ్యనున్న ఆర్యావర్తమండలి యార్యుల నాగరకపరిష్కార సముదాయము లన్యదేశీయులను మిఱుమిట్లు గొలుప సాగినవి.

ఇఁక, ద్వితీయమగు లౌకిక సంస్కృతకాలము వైదికకాలపు టంత్యభాగమందుత్పన్నమై మహమ్మదీయాక్రమణమువఱకు నవిచ్ఛిన్నముగ సాగినదని వారి నిర్ణయము. ఈ కాలమందే దక్షిణభారతవర్షమునకుఁ గొంపోవఁబడిన బ్రహ్మవిద్యాంకుర మచటివారి యాదరాతిశయములచే నవనవోన్మేషాభ్యుదయములనంది దిగంతముల నాక్రమించినది.

కాని, శిక్షావ్యాకరణాది సర్వవిషయములందు సర్వతోముఖ ప్రచారమున్న భారతీయులకుఁ జరిత్రాంశయం దొకింత లోటు కలదనియు, నద్దాన సంస్కృతసాహిత్య పరిక్రమణమార్గము గాఢాంధకారబంధురమై కాళిదాసాది కవిపుంగవుల చరిత్రాంశములను గాలగర్భమున విలీనము గావించినదనియుఁ బాశ్చాత్యుల యభిప్రాయ మొకటి కలదు. అట్లభిప్రాయపడి చరిత్రాంశాభావములకు రెండు కారణముల నూహించిరి. గ్రీకులు మున్నగువారికి పారసీకసంగ్రామాదులు సంభవించినట్లు భారతీయులకన్నడును దారుణములగు నితరులతోడి పోరాటములు సంభవింపలేదనియు, నద్దాన భారతీయులకు వీరకర్మములం దవకాశము సుంతైన లేకపోయె ననియు, వీరకర్మములకే యవకాశమున్నచో నా వీరులగు యోధులను స్తుతించు చరిత్రాంశములు కొన్నియైన నుద్భవించియుండు ననియుఁ గారణమొకటి సూచించిరి. మఱియు, వైదికభారతీయు లన్వహ మలౌకికవిషయములందే హెచ్చు అభినివేశము గలవారై గాఢముగ బ్రహ్మవిద్యావాసనచే సంసార మసారమనియు, గాష్ఠప్రాయము శరీరమనియు భావించుచు చరిత్రాంశములను రక్షించుటయందు విముఖులై యుండుటచే దాని కవకాశము లేకపోయెనని ద్వితీయకారణము నుగ్గడించిరి. భారతీయుల చరిత్రాంశాభావ విషయమం దీకారణములు నిర్ణాయకములైనను గాకపోయినను వారీవిషయమం దలప భావము వహించిరనియు నద్దాన నీవాఙ్మయమున కొంతయుఁ దీఱని నష్టము వాటిల్లెననియుఁ జెప్పుట నిర్వివాదాంశము.

ఇట్టి మహదుపకారకమగు చరిత్రభాగము లేకున్నను, ఆంతరములును, బాహ్యములును నగు ప్రమాణములు కొన్నిటి సాహాయ్యముచే నీవాఙ్మయమున కంతకును విభాగమేర్పఱచి, గ్రొత్తలగు తెన్నులం జూపి, నిరంతరకృషిచే నేతద్వాఙ్మయమందలి యుత్కృష్టత్వమును గాంచి నిరూపించి, విశ్వవిఖ్యాతములగు వాఙ్మయములలో దీనికే ప్రాధాన్య మర్పించి భారతీయుల విజ్ఞానమును నాగరకతా వైభవమును వేనోళ్ల నుగ్గడించిన పాశ్చాత్యపండితుల యుత్కృష్టమగు నుపజ్ఞత భారతీయులకు మేలుబంతి కాఁ గూడదా?

---

# ఈ సముద్రము దాటగలనా

తురగా వేంకటరామయ్య గారు

ఈ సముద్రము దాటగలనా
నా విభుం
డీశ్వరుని దర్శింపగలనా

౧
పాదాలపై వ్రాలగలనా
అవశనై
బాష్పాలు వర్షింపగలనా
ఆవేశమున బొంగగలనా
సర్వమ్ము
సతనిలోనే జేర్పగలనా-ఈ.

౨
ఏనాడు నిర్మింపబడెనో
దీనిలో
నెన్ని జీవాలు మున్గెడినో
ఈనాడు నే నీదగలనా
ప్రేమమ్ము
పోనాడుకొని చావగలనా-ఈ.

౩
అంత మెఱుగనిదాయెనేమో
నాపాప
మబ్ధియై చెలరేగెనేమో
ఎన్నియుగముల నీదవలెనో
ఈజీవి
ఇందులోనే మున్గవలెనో-ఈ.

౪
ఆకెరటములు లేచునేమో
పాతాళ
లోకానకే త్రొక్కునేమో
హాలాగ్నిలో బడుదునేమో
నా వలపు
లందులో మాయమౌనేమో-ఈ.

౫
బాణవేగము బొందలేదా
నాప్రేమ
పరుగెత్తదా నీటిమీద
గాలినైనా యెగురలేదా
నా విభుని
కాంతిలోనే కలియలేదా-ఈ.

౬
ఆనందమున బుట్టినాడో
బ్రహ్మాండ
మంతయూ నేలేటివాడో
ప్రణయగీతాప్రియుడు కాడో
ప్రేయసీ
ప్రాణాలు రక్షించుకోడో-ఈ.

---

౧

జమదగ్ని

తెచ్చావా?

రేణుక

ఆ!

జమదగ్ని

ఇక్కడ ఆడుకొందామా? ఆబయలులోకి వెడదామా?

రేణుక

బయలులోకే వెడదాము.

జమదగ్ని

ఇక్కడైతే చెట్లు దట్టముగా ఉన్నవి, నీడలలో చల్లగా ఉంటుందిగాదూ?

రేణుక

ఈచెట్లల్లో, నే పరిగెత్తలేనమ్మా. కాళ్లన్నీ ముళ్లు గుచ్చుగుంటవి. చెట్లవేళ్లుకాళ్లకు తగులుకుంటే పడతాను కూడాను.

జమదగ్ని

అయితే బయలులోకేపద. నాభుజశక్తి చూపడానికి ఇన్నాళ్లూ ఈ వనములో వీలుపడింది కాదు. ఈదినమున చూద్దువుగాని.

రేణుక

మీభుజశక్తికీ నాజవమునకు ఈదినమున పందెమా ఏమిటి?

జమదగ్ని

అన్నమాటే! మన పందెముమాట జ్ఞాపకముందా?

రేణుక

మీరు ఈ బయలులో విడిచిన బాణాలు నేను తెచ్చి ఇవ్వడమే కదా?

జమదగ్ని

నా వింటికి సంధించడానికి బాణము ఒక్కటే. బాణము విడిచీ విడవడంతోనే బాణంతోనే నీవు వెళ్లి త్రుటిలో తీసుకువచ్చి నా కివ్వాలి!

రేణుక

ఇవ్వలేకపోతే?

జమదగ్ని

జమదగ్ని భార్యకు ఇవ్వలేకపోవడమంటూ లేదు.

రేణుక

ఆడదానికి ఇవ్వలేకపోవడమంటూ ఉన్నదా?

జమదగ్ని

సామాన్యస్త్రీల కుండవచ్చు.

రేణుక

నేను అతిమాత్రనా?

జమదగ్ని

నన్ను పెండ్లాడావు కాబట్టి!

రేణుక

గమనమాంద్యము స్త్రీత్వచిహ్నమని లోకులు చెప్పకుంటారేమి?

జమదగ్ని

మందవాయువులే ప్రచండమారుతము లౌతవి.

రేణుక

నన్ను మందవాయువుగా ఉండనీయక ప్రచండ మారుతముగా ఎందుకు మార్చుతారు?

జమదగ్ని

ఒకరహస్యకార్యము నుద్దేశించి.

రేణుక

పతులదగ్గిరకూడా పతులకు రహస్యము లుంటవి కాబోలు!

జమదగ్ని

నిన్ను వీరమాతగా చేయవలెనని!

రేణుక

మీ తపస్సు నన్ను అట్లా చేయలేదా?

జమదగ్ని

నీలోవిలీనమై ఉన్నశక్తివల్లనే నీవు అట్లా కావచ్చునుగదా, ఇంక నా తపస్సును వెచ్చించడ మెందుకు?

రేణుక

ఈశక్తి నాలోనేఉన్నదా? స్త్రీసామాన్యమా?

జమదగ్ని

స్త్రీసామాన్యమే కాని.........

రేణుక

కాని?

జమదగ్ని

సరే, ఆమా టెందుకూ? వింటిని ఎక్కుపెట్టుతా. విల్లూ బాణమూ నాచేతికిచ్చి కాసుకో.

రేణుక

'కాని' అని ఏమో చెప్పబోయి మానివేశారు!

జమదగ్ని

చెప్పాలా?

రేణుక

పోనియ్యండి చెప్పకపోతే!

జమదగ్ని

మనము క్రీడారంగములో ఉన్నామా, లీలా గృహములోనా?

రేణుక

క్రీడారంగము రణరంగము కాదుగదా!

జమదగ్ని

రణరంగములో ఉత్సాహమూ ఆవేశమూ క్రీడారంగములో చూపకపోతే నా ప్రయత్నములు వ్యర్థము కావా?

రేణుక

క్రీడారంగమైనా, రణరంగమైనా, భార్యాభర్తలుండు స్థలము లీలాగృహ సదృశమే.

జమదగ్ని

అందువల్లనే మనము భార్యాభర్తల మనే ఊహ తాత్కాలికముగా మరిచిపోదాము!

రేణుక

అది అపాయకరము కాదా?

జమదగ్ని

ఎట్లు?

రేణుక

ఒకచోట నాహృదయమును మీమీద లగ్నము చేసి ఇంకోచోట దానిని నాలోకి తీసుకొని, మళ్లీ ఇంకోచోట మీమీద లగ్నముచేసి— ఈవిధముగా హృదయమును బాధపెట్టుతూ ఉంటే అది స్వేచ్ఛావృత్తి నవలంబిస్తుందేమో?

జమదగ్ని

దౌర్బల్యలక్షణ మది!

రేణుక

స్త్రీలకు మనోదౌర్బల్య మొక లోపమట గా?

జమదగ్ని

నీకు కాదు.

రేణుక

ఎందువల్ల ?

జమదగ్ని

నీవు నా భార్యవు కాబట్టి.

రేణుక

వెనకటిమాట చెప్పారుకారు ?

జమదగ్ని

చెప్పాలా ?

రేణుక

మీ యిష్టము.

జమదగ్ని

నావంటి తపశ్శాలి సీసజ్జఉండగా నీలో శక్తి వికసించి ధర్మమార్గమున ప్రవర్తిస్తుంది.

రేణుక

అన్యులమాట ?

జమదగ్ని

అగ్ని దేవుడు మనకుపకారి. ఒక్కొక్కప్పుడు అపకారికూడాను. అట్లే స్త్రీశక్తికూడా! పగ్గములు పట్టి నడిపిస్తే రథాశ్వములు ఘంటాపథము నంటి పోలవిగదా.

రేణుక

నాకు స్త్రీపక్షపాతము సహజము. మీ విషయము నేను చెప్పలేను. కాని నాకు భయముగా ఉంది.

జమదగ్ని

ఏమని భయము ?

రేణుక

స్త్రీనని.

జమదగ్ని

స్త్రీ వయితే ?

రేణుక

నాలో శక్తి వికసించి నాకు లొంగకుండా పోతుందేమోనని.

జమదగ్ని

అభయము లేదులే. ఆ శక్తి మనఅపత్యమును సంక్రమిస్తుంది.

రేణుక

నా హృదయమును ఎప్పుడూ మీ మీదనే ఉంచకుండా ఒకిప్పుడు నా లోనికి నేను తీసుకొని కమఠవృత్తి అవలంబించి నట్లయితే—అమ్మయ్యో నాకు భయమౌతూ ఉంది!

జమదగ్ని

నేనుఅట్లా కోరినప్పుడు నీకు భయమెందుకు?

రేణుక

మీరు కోరినారు కాబట్టి అట్లా చెయ్యడానికి ప్రయత్నిస్తాను. కాని ఇది అలవాటు అవుతుందేమో? దానికి శిక్ష ఎవరు అనుభవించడం ?

జమదగ్ని

తప్పు చేసినవారే!

రేణుక

నాకు భయము వేస్తూ ఉంది. నాకు ఈ ఆటా వద్దు, ఈశక్తీవద్దు,-అదేమిటిచెప్మా,-నేను వీర మాతనూ కావద్దు.

జమదగ్ని

వెర్రిపిల్లా! వీరమాత అనే గౌరవము లోక ములో ఎందరు స్త్రీలకు వస్తుంది?

రేణుక

ఏమో.

జమదగ్ని

లోకాలన్నింటినీ గడగడలాడించే వీరశిఖామణి తల్లి అనే ఘనత ఎందరికి రాను!

రేణుక

బ్రాహ్మణికి నాకెందుకా ఘనత?

జమదగ్ని

అవతారపురుషుని కనగలస్త్రీ లెంద రున్నా రీలోకాన?

రేణుక

ఏమిటీ?

జమదగ్ని

లోకకల్యాణాన్ని చేకూర్చే ధన్యమూర్తి, భూభారమును తగ్గించే ధర్మమూర్తి, ధర్మ సంస్థాపనాన్ని చేసే అవతారపురుషుడు నీ గర్భమును జన్మభూమిగా చేసుకో బోతూ ఉంటే వద్దనే నీ వివేకానికి ఏమని సంతోషిం చేది?

రేణుక

నాకు ఏమో భయంగానూ, ఆశగానూ కూడా ఉంది.

జమదగ్ని

భయమును తరిమివెయ్యి.ఆశను వృద్ధిచెయ్యి. మాతృత్వము స్త్రీలకు జీవితమున పరమావధి కాబట్టి ఆస్థితిని అభిలషించే నీకోరికలను లేపు. ఇంక లేద్దామా? విల్లు ఇలా తే.

రేణుక

వింటిని నేను ఎక్కుపెట్టనా?

జమదగ్ని

వద్దు. బాణమును కూడా ఇలా తే.నారిమ్రోత కు భయపడకు. బాణవేగమున పుట్టిన శబ్దము తోకూడా నీ మంజీరనాదమునాచెవులలో పడ వలెను సుమా?

రేణుక

సరే.

జమదగ్ని

వల్కలము వెనుకకు విరిచి కట్టుకో;ఉత్తరీయ మును వక్షమునకు బిగించుకో. కచము నాలత లతో గట్టిగా కట్టుకో. సిద్ధముగా ఉన్నావా?

రేణుక

ఆఁ.

జమదగ్ని

హంసకములు, కంకణములు, తాటంక మేఖ లాద్యాభరణములు భారము కావుగదా నీకు?

రేణుక

ఆభరణములు మాకు అవయవములవంటివే!

జమదగ్ని

ఈ ఉదయమున చల్లని మందవాయువుతో నీకేశములనుంచి రాలినపుష్పముల సువాసన కలిసి నా ఉత్సాహమును ద్విగుణీకృతము చేస్తూ ఉన్నది.

రేణుక

పరస్త్రీని గురించి మీా రటివర్ణనలు చేయ వచ్చునా?

జమదగ్ని

ఎవరు పరస్త్రీ?

రేణుక

క్రీడారంగములో ప్రవేశించిన పిమ్మట మనము భార్యాభర్తల మన్నమాట మరువ మన్నారు కాదూ?

జమదగ్ని

పెంకెపిల్లా!

౨

రేణుక

అమ్మయ్య! ఇదిగో బాణం.

జమదగ్ని

ఎక్కడ పడింది.

రేణుక

మీారు చూస్తూ ఉండలేదూ?

జమదగ్ని

బాణము దృష్టిపథాన్ని దాటిపోయింది కాని నీ విగ్రహము మాత్రము తళుకు తళుక్కున చుక్కలాగ కనిపించింది.

రేణుక

బయలవతల దూరముగా ఉన్న ఆ విషవృక్షమును గుచ్చుకొన్నది పోయి.

జమదగ్ని

బయలుదాటి పోయిందా; పాపం! ఇలా రా, ముఖంమీాద ఆ చెమటబొట్లు ఈ కార్పాసముతో తుడిచివెయ్యనియ్యి. ఈమాటు అంత దూరంగా వెయ్యన ద్దంటావా?

రేణుక

ఏమి? చెయ్యి నొప్పిపట్టుతోందా?

జమదగ్ని

నీకు శ్రమలే దన్నమాట!

రేణుక

నేను వీరమాతను కాబోతున్నా కాదూ!

జమదగ్ని

సరే, అయితే. కాసుకో బాణము వేస్తున్నా. దానిమీాదే దృష్టిఉంచి పరిగెత్తు.

రేణుక

ఉండండి, ఉండండి. ఇప్పటికి ఎన్ని మార్లు అయిందో? లెక్కపెట్టుతున్నారా?

జమదగ్ని

నీవు లెక్కపెట్టుతున్నావుకాదూ. ఎన్నిమార్ల యింది?

రేణుక

పన్నెండుమార్లు.

జమదగ్ని

దీనితో పదమూడు. పరుగెత్తు, పరుగెత్తు!

రేణుక

ఇదిగో బాణం.

జమదగ్ని

ఇంత చప్పన తెచ్చావేమి? నీ గమనవేగాన్ని పరీక్షించవలెనని బాణము నతివేగముతో పంపిస్తినే!

రేణుక

పరీక్ష అయిందా?

జమదగ్ని

ఆ, తెలిసింది. బాణ మార్గకముందే మధ్యమార్గములో దానిని పట్టుకొని తీసుకు వచ్చావు కాదూ?

రేణుక

అవును. పరీక్ష బాగా అయిందా?

జమదగ్ని

ఆ బాణము వెళ్లి ఒక్కచోట కుత్సితమైఉన్న భూభాగాన్ని నశింపజేసి యుండేది. ఇంకెప్పుడూ మధ్యమార్గములో దానిని పట్టకు. దానివల్ల భావికాలాన అరిష్టము మనకు వస్తుంది సుమా!

రేణుక

అయ్యో, మొదటనే నాకెందుకు చెప్పారు కాదూ?

జమదగ్ని

ఇంకెప్పుడూ చెయ్యకు.

రేణుక

దీనివల్ల నా కేమి ప్రమాదము వస్తుందో అని దిగులుగా ఉంది.

జమదగ్ని

భావికాలాన జరుగబోయే కార్యాలికి ఇప్పటినుంచీ ఎందుకు బెంగ? ఇదిగో పదమూడో మారు వేస్తున్నా.

రేణుక

ఇదిగో బాణం తెచ్చాను. ఈ బాణము మీరు చెప్పినట్లు రోగభూయిష్ఠమైన భూభాగాన్ని దగ్ధము చేసింది.

జమదగ్ని

ఇదిగో మళ్లీ. నీవు గరుత్మంతుడిలాగ పరుగెత్తి తీసుకురా.

రేణుక

ఇదిగో బాణం. అయ్యో, ఏమండీ పన్నగకులాన్ని భస్మంచేసిం దీబాణ మాభూమి అంచులవనములో ప్రవేశించి!

జమదగ్ని

రెక్కలుకట్టుకొన్న గువ్వపిట్టలాగ వెళ్లి ఈ బాణాన్ని ఈమారు తే. వేస్తున్నా.

రేణుక

ఇదిగోనండీ బాణం. ఈ మాటు ఈబాణానికి నామీద ఈర్ష్య కలిగినట్లుంది. నన్ను దాటవలెనని అదీ, దానిని దాటవలెనని నేనూ పరుగులెత్తేము. చివరకు దాని ఈర్ష్య అంతా ఆ ముళ్ల అడివిపై చూపించింది.

జమదగ్ని

చూచా, చూచా, ఆబాణముకంటె నీవూ, నీకంటె నా హృదయమూ పరుగులెత్తినవి. ఇలారా, రేణుకా! విష్ణుదేవుడి చేతినుండి తప్పించుకొని పోయేచక్రమువలె ఎంతచక్కగా వచ్చావు. ఈచెమట తుడుస్తా ఉండు. అన్నా, మొగం ఎంత కందింది! కళ్లు ఎఱ్ఱబడ్డవి కూడాను. ఎందుచేత? ఎందుచేత?

రేణుక

వెయ్యరేమి ఇంకో బాణం? చేతులు నొప్పులు పట్టినవేమో! ఒకమారు నాఒళ్లో పండుకోండి చేతులు పట్టుతాను.

# బౌద్ధశిల్ప చిత్రములు*

భోపాలున గల సాంచిస్తూప శిథిలముల నున్నవి



౧



౨



3



౪

* ఆర్టు, ఇండస్ట్రీ జర్నలునుండి.

జమదగ్ని

శ్రమఅయితే చెప్పు రేణుకా,విశ్రాంతి పొందు దువు గాని.

రేణుక

ఆట పూర్తిఅయిన పిమ్మట విశ్రాంతి.

జమదగ్ని

అయితే వేస్తున్నా బాణం, కాసుకో.

రేణుక

పోనీ ప్రతీమాటు ఆబాణాన్ని మీరు వెయ్య డం దానికోసం నేను పరుగెత్తితేవడం ఎందు కూ? ఆబాణముతో బాటునన్నుకూడా నారికి సంధించండి; విడవండి.

జమదగ్ని

మన్మథుడు ఇదివరలో నిన్నుతన వింటిలో పెట్టి నా మీదికి వదిలిపెట్టాడు. నాహృదయ మప్పు డే అపహృతమైనది......

రేణుక

ఇది లీలాగృహము కాదుగదూ!

జమదగ్ని

ఇదిగో బాణం వెళ్లింది. నీవు వెళ్ల వేం.

రేణుక

ఇదిగో వెడుతున్నా. దీనిని పట్టడమెంత సేపు... .........ఇదిగో బాణం.

జమదగ్ని

ఈమారు కొంచె మాలస్యము చేసేవేమి?

రేణుక

ఆలస్యము స్త్రీకి అలంకారము కాదూ?

జమదగ్ని

వేతునా బాణం?

రేణుక

మీ ఇష్టం.

జమదగ్ని

కాంచన శలాకవలె మెరుపులు మెరుస్తూ వెళ్లు............

* * *

ఇంత ఆలస్యం చేసిందెందుకు చెప్మా! బాణము వేసి ఎన్ని త్రుటులైనదప్పుడే! ఎందుకోగదా ఈ ఆలస్యం.

రేణుక

ఇదిగోనండీ బాణం!

జమదగ్ని

ఎందుకైన దీఆలస్యం రేణుకా?

రేణుక

ఏమో!

జమదగ్ని

ఇలాదగ్గిరసా రా, రేణుకా, కచభారముకుల తలు తెగినవి. ముంగురులు చెమటవల్ల మలి నమైనవి. ముఖంనుండి చెమట కాలవలు కట్టు తోంది. చంద్రబింబంవంటి ముఖం ఉదయి స్తూ ఉన్న చంద్రబింబమువలె ఉంది. తల వెచ్చగా ఉంది. ఈదేహానికి ఇంతవేడి ఎందు వల్ల కలిగింది?

రేణుక

ఏమో!

జమదగ్ని

ఎంతకందినవీ నీ అరిచేతులూ? ఏవీ అరికాళ్లు, లత్తుక ఎరుపా కాళ్లఎరుపా ఇది?

రేణుక

లత్తుక కొట్టుకుపోయింది ఈ ఆటలో.

జమదగ్ని

అరికాళ్లల్లో పొక్కులుకూడా పొక్కినవి. ఎందుచేతా, ఎందుచేతా?

రేణుక

ఆట ఉత్సాహములో గ్రహించలేకపోయాను. నాథా!

జమదగ్ని

ఆలస్యానికి కారణం తెలిసింది. ఎవడు నీకు ఈ అపచారం చేసినవాడూ?

రేణుక

సూర్యుడు నడిమింటనుండి నిప్పులు చెరుగుతున్నాడు.

జమదగ్ని

ఏమిటీ. సూర్యునకు బుద్ధిలేదూ? నేనూ నా భార్యా ఆడుకొంటున్నామని ఎరగడూ? ఎవతెగా భావించాడు నా భార్య నతగాడు? ఊ...

రేణుక

ఆడదాన్ని చూస్తే భూతాలకుకూడా లోకువే.

జమదగ్ని

ఏభూతాలు నీకు ఇంకా అపచారము చేసినవి?

రేణుక

మాటవరసకన్నాను. ఈ సూర్యుడివేడికే నా యుప్పు తాళలేక వేడెక్కి దిక్కుతోచకుండా దుమ్ము రేపుకుంటూ పరుగెత్తు తున్నాడు.

జమదగ్ని

జమదగ్ని బాణాగ్ని సూర్యుణ్ణిమాత్రం భస్మం చెయ్యలేదా? ఏదీ, రేణుకా, ఆ బాణం ఇలాతే!

రేణుక

పాపం అతిగాణ్ణి........

జమదగ్ని

నా భార్య కపచారం చేస్తాడా? తపింపజేస్తాడా నా భార్య దేహాన్ని?

రేణుక

ఈ మాటుకు క్షమించండి, పాపం! ఆట సాగిద్దామా?

జమదగ్ని

బాణం ఇలాతే, రేణుకా; నీకు తెలియదు; నీపూరుకో.

రేణుక

ఇదిగో బాణం!

3

జమదగ్ని

నా లక్ష్యమును మరుగుపరుస్తూ అడ్డముగా నిలుచున్న నీ వెవ్వడవురా?

బ్రాహ్మణుడు

రేణుకా ప్రాణనాథా, నమస్కారము. తల్లీ, వందనము. నేను బ్రాహ్మణుడను మహామునీ!

జమదగ్ని

బాణమున కడ్డులే! ఆదిత్యుడు నా కుటుంబిని కపచారం చేశాడు. శిక్ష ననుభవించ బోతున్నాడు. లే, అడ్డంలే.

బ్రాహ్మణుడు

క్షమించండి. నా తల్లిదండ్రులారా క్షమించండి. నా దేవతలారా క్షమించండి. ఎరుగక చేసిన తప్పున కిట్టి శిక్షలా మహాస్వామీ?

జమదగ్ని

నీవు సూర్యుడవా ఏమి?

రేణుక

బ్రహ్మహత్య కొడిగట్టకండి సుమీ, ప్రాణనాథా.

సూర్యుడు

మేఘములు బారులుతీరి నా తల్లికి గొడుగుపట్టుతూనే ఉన్నవి. నా తల్లి దేహము బహు సుకుమారము కావడంవల్ల నావల్ల అపచారం కలిగినట్లు ఊహించ వీలుకలిగింది. నా తల్లికి అపచారం చేసే దుష్టునా నేను, ఋషీ!

జమదగ్ని

నీ వల్ల కాకపోతే ఎవరివల్ల కలిగినవి. ఈకందడము, ఈవేడి, ఈబొబ్బలు, ఈశోష నా ప్రాణనాయికకు?

బ్రాహ్మణుడు

నా తల్లి అదితి ఒక్కటే, నా ఈ తల్లి రేణుక ఒక్కటేనా నాకు నా తండ్రీ.

జమదగ్ని

నీతల్లికికూడా అపచారముచేసే కఠినుడ వన్నమాట, నేనివ్వాళ గ్రహించాను. నాబాణముకు తిరుగులేదు. దాని ఆహారము సదీ వదిలి పెట్టుకోలేదు.

బ్రాహ్మణుడు

అపరాధం ఉంటేగదా శిక్ష, ధర్మమూర్తీ. నా వల్ల అపరాధంలేనిదే నన్ను మీ బోటి వివేకులు శిక్షిస్తారా మహర్షి?

జమదగ్ని

లోకచక్షువనకు కళ్లులేవా నా భార్యకు కలిగిన శ్రమ చిహ్నముల గుర్తించడానికి?

సూర్యుడు

సత్పథమున సంచరిస్తూ నాధర్మాన్ని నేను నిర్వహించడంవల్ల కొందరు తమకు అపచారం కలిగిందని ఊహిస్తే తప్పునాదా? అమ్మా, ఈ కొడుకుపై మీకేనా దయలేదా?

రేణుక

ప్రాణప్రియా!

జమదగ్ని

రేణుకా, నీవు మాట్లాడకు. రవీ! నీవు సత్పథమున సంచరిస్తూ ఉన్నమాట నిజము. సత్పథమున సంచరించే గృధ్రములకు భూమిపై కళేబరముల మీదనే కదా దృష్టి. సత్పథము సహజశీలమును మార్చగలదా? ఇంక నీధర్మమును నీవు నిర్వర్తించేటప్పుడు తన్మూలమున సత్పురుషులకు అపకారము కలుగుతున్నదేమోనని ఊహించవద్దూ. లోకముకు హానిని కలుగజేసే ధర్మమునకు అధర్మస్థితిరాదా?

సూర్యుడు

నాధర్మాన్ని నేను సరిగా నిర్వర్తించడంవల్లనే కదా నాకు లోకబాంధవుడనే పేరు వచ్చింది.

జమదగ్ని

యుక్తాయుక్త వివేకములేని నీ యొక్క నేటి ఈ ధర్మాన్ని ఎవడు ధర్మమనగలడు. జగజ్జనని కాబోవు రేణుకపైనా తిగ్మాంశువులు! పరమ పురుషుని పొత్తిళ్లల్లో పెంచగల నాధర్మపత్ని మీదనా వేడిమయూఖములు! నీవట్టా లోక బాంధవుడవు! నీ అపచారానికి ఇదిగో శిక్ష. అనుభవించు.

బ్రాహ్మణుడు

అమ్మా, నీకునమస్కారము, క్షమించు.తండ్రీ, నీకు నమస్కారము. క్షమించు.

రేణుక

క్షత్రియోచితమగు కోపశీలము బ్రాహ్మణులకు పట్టరాదు. కాబట్టి ప్రాణనాథులకు ఒక్క మాట మనవి చెయ్యబోతున్నాను. ప్రాణనాయికను క్షమించగలరు ప్రాణప్రియులు.

జమదగ్ని

ఏమిటీ రేణుకా?

రేణుక

సూర్యుడు శిక్షింపదగ్గవాడై నప్పటికీ ఒక్క కారణముచేత క్షంతవ్యుడు.

జమదగ్ని

ఏమిటీ? క్షంతవ్యుడా? ఈ సూర్యుడా? ఎందుకు అతనిపై నీ కింత దయ, రేణుకా?

రేణుక

అతన్ని చూడడంతోనే అతనిమీద ప్రసన్న భావం కలిగింది నాకు ఎందువల్లనో?

జమదగ్ని

ఓహో, అతని గర్భములోని నారాయణుడు నీ గర్భమున ప్రవేశించ బోతున్నాడనా?

రేణుక

ఏమో?

జమదగ్ని

ఏమిటీ కారణమన్నావు?

రేణుక

కారణమా! సూర్యుడు అపచారం చేసినట్లు మీరంటున్నారు కాని నేను అనలేదు కాదూ!

జమదగ్ని

నేనంటే నీవన్నట్లు కాదూ?

రేణుక

ఆటలో ఉన్నప్పుడు మీరు మీరే నేను నేనే.

జమదగ్ని

అతడు అపచారం చేసినట్లు ప్రత్యక్షంగా కనిపిస్తూ ఉంటేనే.

రేణుక

ఆట ఉత్సాహములో నా కదేమీ తెలియ లేదుకాదూ?

జమదగ్ని

తెలిసినా తెలియకున్నా అపచార మపచారమే కాబట్టి శిక్ష నతడు పొందవలసిందే.

రేణుక

అయితే శిక్షిద్దురుగాని, కాని ఆబాణ మిలా ఇవ్వండి. అతగాడినే శిక్ష కోరుకొమ్మనండి.

జమదగ్ని

సూర్యుడా, ప్రాణప్రియ ప్రియవాక్యములు నా కోపాగ్నిని చల్లార్చినవి. ఏమి శిక్ష కోరుకుంటావు నీవు.

సూర్యుడు

తండ్రీ, నాతల్లికి కాళ్లుకాలకుండా ఇవిగోపాద రక్షలు; తలకు ఎండతగులకుండా ఇదిగో ఆత పత్రము. నా ధర్మము నేను నిర్వహించుకోనూ వచ్చును. మీఆట మీరాడుకోనూ వచ్చును. క్షమించరా.

జమదగ్ని

రేణుకా, పాదరక్షలూ ఆతపత్రమూ పుచ్చుకో. ఆట సాగిద్దామా?

సూర్యుడు

తల్లిదండ్రులు నాకు సెలవు దయచేస్తారా?

జమదగ్ని

బ్రాహ్మణవేషముతో వచ్చిన ఓ సూర్యుడా; నీ ఎండలోనే నీవుమేము ఆటముగించే వరకూ ఉండు. అదే నీకుశిక్ష.

రేణుక

ఆడవాళ్లు ఇవి ధరించవచ్చునా?

జమదగ్ని

నీకోరకేగదా సూర్యుడిచ్చాడు. అవి స్త్రీల వస్తువులే, పురుషులవి కావు.

రేణుక

అంటారుకాని చివరకు వీటిసదుపాయం చూచి మీరు పుచ్చుకొంటారేమో నని అనుమానంగా ఉంది.

జమదగ్ని

కొంటే!

రేణుక

ఎన్నవదో ఈబాణం తెలుసునా?

జమదగ్ని

ఎన్నవది?

రేణుక

పందొమ్మిదోది. వెయ్యండి బాణం. భూమి చల్లగాను మెత్తగాను ఉన్నది. సూర్యుడు ఎండ కాయడం లేనట్లే ఉన్నది.

జమదగ్ని

వెళ్లు! బాణం తీసుకురా, చెప్పలూ గొడుగూ చూచుకొంటూ నిలబడ బోకు.

రేణుక

ఎందుకు ప్రాణనాథుల కంత తొందర! ఇదిగో బాణం.

జమదగ్ని

కొత్త ఆభరణాలు గమనమున కడ్డురాలేదు గదా?

రేణుక

ఈ ఆతపత్రము విహాగపత్రమైనది నా పట్ల. ఈపాదరక్షలురథచక్రములట్లయినవి. మీ బాణము మలినీభూతవాయువును నిర్మలము చేసీ చెయ్యడంతోనే తీసుకువచ్చాను.

జమదగ్ని

మళ్లీ వేస్తున్నా బాణం, కాసుకో రేణుకా.

రేణుక

వెయ్యండి.

జమదగ్ని

జాజ్వల్యమానముగా పోయే ఈ అస్త్రమేమి చేస్తుందో సరిగా చూచిరా, రేణుకా.

రేణుక

ఇదిగోనండీ బాణం. ఇది లోకంలో ఉండే దారిద్ర్యాన్ని అంతా దహింపజేసినట్లు కనిపించింది. అమ్మయ్య. తీసుకోండి బాణం.

జమదగ్ని

ఇంకోమారు వేతునా బాణం.

రేణుక

ఇరవైయొకటోమారవుతుంది.

జమదగ్ని

జగత్కల్యాణహేతువైన ఈ బాణమునంటి వెళ్ళి తీసుకురా రేణుకా.

రేణుకా

ఇదిగో బాణం. లోకమిప్పుడు సత్యధర్మాదులకు ఆవాసయోగ్యమై ఉన్నది. నేనింక పరుగెత్త లేను కాబోలు. కళ్లుతిరుగుతున్నవి. మీ ఒడిలో పండుకోనియ్యండి ప్రాణనాథా!

జమదగ్ని

రేణుకా, ఇవిగో ఈ నా బాహువులు నీకు శయ్యగా పట్టినాను.

రేణుక

అమ్మయ్య!

సూర్యుడు

మహామునీ, నా తల్లి ఎందువల్లనో మహాతేజముతో ప్రకాశిస్తూ ఉంది. లోకోత్తరమైన ఈమె తేజస్సును నేను చూడలేకుండా ఉన్నాను.

జమదగ్ని

ఆటలో అలసింది నా పత్ని. విశ్రాంతి పొందుతోంది. నీవు వెళ్లు, సూర్యుడా!

రేణుకా, రేణుకా. ఈమె ఇంకా కన్నులు విప్పనే లేదు.

రేణుక

ఏమండీ ఆట అయిందా, ఇంకో బాణం వేస్తారా.

జమదగ్ని

లేచావా, రేణుకా. అయిందాట. నీవు అలసినావు. ఇంకా కొంతసేపు నీవు నా బాహువుల మీద విశ్రమించు.

రేణుక

నేను బాగా పరుగెత్తలేదూ.

జమదగ్ని

జవమునకు నీవే పరమావధి వనిపించుకొన్నావు.

రేణుక

ఈ పందెములో నా జవము గెలిచినదా మీ బాహుబలమా.

జమదగ్ని

నీజవమూ నాబాహుబలమూ ధరించి సవితృమండలోద్భాసితమైన ఒక దివ్యతేజశ్శాలి నీలో ప్రవేశించాడు.

రేణుక

నిజంగా?

జమదగ్ని

నిజముగానే రేణుకా. సూర్యుడు ఇప్పుడే వెళ్లిపోయినాడు. మనబోంట్ల విషయములో అతడు చంద్రుడైనాడు.

రేణుక

నేను వీరమాతను అవతా కాదూ?

జమదగ్ని

వీరపత్ని వీరమాత కాదా మరి.

రేణుక

సూర్యుణ్ణి ఏమీ అనలేదుకదా పాపం?

జమదగ్ని

అనలేదు. చెప్పులూ గొడుగూ ఇచ్చినందుకే ఈ అభిమానం?

రేణుక

సూర్యుడుకూడా నేను వీరమాతను కావడానికి తోడ్పడ్డాడు కాదూ?

జమదగ్ని

అవును.

రేణుక

సూర్యుడంటే మీకు కోపం పోయిందా?

జమదగ్ని

నీమూలాన్నే అతనిమీద నేను కోపించాను. ఇప్పుడు మళ్లీ నీమూలాన్నే అతన్ని అభిమానిస్తున్నాను.

రేణుక

నామాటకూడా మీరు వింటున్నారు ఇప్పుడిప్పుడు!

జమదగ్ని

నీవు వీరమాతవు కాదూ?

రేణుక

ఈబయలిప్పుడు మనకు లీలాగృహమైనట్లున్నది.

జమదగ్ని

ఆట ముగిసిందికాదు మరీ.

---

[ఇది ౨-౨-౧౯౨౫ తేదీని, రాజమండ్రీ ఆర్ట్సు కాలేజీలో దివాన్‌బహద్దర్ దురిసేటి శేషగిరిరావు పంతులుగారి ఆధిపత్యముక్రింద జరిగిన పాతవిద్యార్థి వార్షికోత్సవ సందర్భంలో, భమిడిపాటి కామేశ్వరరావుచే చదువబడినది.]

౧. ప్రకటనలు:

(*a*) త్వరపడుడు, త్వరపడుడు! మోటారు వేగముగల సైకిల్! అతిచౌక, మహాచౌక, చచ్చుచౌక! ఖర్చుతక్కువ, వేగమెక్కువ! కాలకర్మవశమున దీని "పెడల్" కాలుసు వగైరాలు పోయిన నేమాయె, దీనికంటె ఏనుగుబండికి తగ్గదని అనేకమంది భావకవులు లోగడ పాడియున్నారు. దీనివేగము సిద్ధించుటకు దీనిని మోటారుపై నిడి, ప్రక్కను తమరుకూడ దయచేయుడు. ప్రత్యక్షమున తమకే తెలియును. వెల రూ|| ౯౯ మాత్రమే! చిరునామా! రామలక్ష్మణభరతశత్రుఘ్న అండ్ సన్సు, దండక.

(*b*) అయ్యో! మీకేల విరేచనబద్ధముతో బాధపడెదరు? ఏల మీకు కించిత్తు యోచన లేదు? మీ కోరిక సఫలమగుట ఈజన్మలోనే ఎందుకు పడదు?

తక్షణమే, మా వైద్యశాస్త్రీయ పెసరట్టు హోటలుకు రండు. ఒకమండలములో మీరనుకొన్నది జరుగును. మా పంచశైలముల పెసరట్టును సేవింపుడు. అనుపానం: ఇప్పుడనే మెడలిస్టులచే తయారుచేయబడు కప్పున్నర కాఫీ. ఏతత్పూర్వము సాంబారులో నిండా స్నానము చేసిన జోడాఇడ్లీ.

చిరునామా: Anti-constipation Pesarette Hotel, *Rjy*.

మరా:

అభిప్రాయ పరంపరగలవారయ్యు భాషాబద్ధముతో తంటాలు పడువారికింకూడ సదరు పెసరట్లు కడుంగడు పనిచేయును. మాకు, కోరకుండావచ్చిన అభిప్రాయములు.

"The pesarettes of A C. P. Hotel are a Specific to the usual constipations of the body and of thought and of the soul. They are a boon to Speakers and Lecturers. (Sd) An Ex-Minister.

(*c*) Do you want to become a leader of men? Say so!

Then use our attractive scent "Sammohanam". Thousands will unconsciously follow you even if you walk with our scented handkerchief hidden in your inner pocket.

*N. B.* By the way, without your knowing it, this will make you a leader of women. Bottle Rs. 6—0—0.

Same name Co., Tokio.

Telegraphic address: SAMMOHAM.

(*d*) మామూలుగా మీ నగలు దొంగలుగాని మరియితరులుగాని దోచుకొనగానే మీరు పోలీసువారి చుట్టూతిరుగుట ఇకపైన మానుడు! ఇకపైన లంచములు గుమ్మరింపకుడు! ఇకపైన అబద్ధపుసాక్ష్యములు తయారు చేయకుడు! వెంటనే పోయిన నగయొక్క సైజు బరువు, మాదిరి వగైరా మాకు తెలుపుడు. అతిచౌకధరలలో మీకు నచ్చునగలను మేము పంపెదము. పోస్టుఖర్చు మీది.

Jewellry mart. 10/51, China Bazaar, G.T.

(*e*) *Why don't you dye before it is too late?* Procrastination is the thief of time! Dying is neither harmful nor useless. In any case, don't dye without using our hair-dye.

A treasure to grey-haired widows; specially to old husbands running their nth wife in particular and to both or all sexes in general.

For further details, Apply:

White Firm, Bombay.

౨. వేడుకలు, విలాసములు.

గమనింపుడు!                    గమనింపుడు!!

'హరిశ్చంద్ర' ముఖ్యముగ ఆంధ్రుల కే!

క్రొత్త దుస్తులు - క్రొత్త పాటలు - క్రొత్త ఆటలు
క్రొత్త మాటలు

బళ్లారి ఘస్టున్నర కంపెనివారు అతి చాక
చక్యముగా ప్రదర్శింతురు

ఇందలి కథాభాగ మెల్లరకును, తెలిసినదగుటచే విస్తరించి వ్రాయ లేదు.

హరిశ్చంద్రుడు:—ఆంధ్ర నాటక రంగ బ్రహ్మ, విష్ణు, మహేశ్వర: T. S. R. Rao, గారు: వీరు పెండ్లిష్టు వంశమున ఉద్భవించినవారు. వీరి చుట్టుపట్లనుండు వారికిని పెడల్సు కురియుచుండును. వీరిది నారద గాన మర్యాద, వీరు రంగముమీద దానిని ప్రకటింపరు. వీరు "యాక్షన్"లో నిమగ్నులైనపుడు, ఉచ్చారణకు కూడ ఏమియు ప్రాముఖ్యము నొసంగరు. వీరి వాగ్ధోరణి బట్టి వీరికి భాషాజ్ఞానము లేదనుకొంట అజ్ఞానము. వీరు లోగడ ఒక కేసులో తప్పుడు సాక్ష్యము ఇచ్చియున్నమాట బహుశ మీరు ఎరిగియున్ననూ, అంతమాత్రమున హరిశ్చంద్రుని సత్యసంధతను అనుమానించుట తమబోంట్లకు పాడిగాదు.

చంద్రమతి:—నటకురంగి, నటమయూరి వగైరా బిరుదులు కొట్టిన M. N. S. శ్రీ. గారు. వీరు "Born female actor" అని చెప్ప నొప్పు. ఏలయన, వీరు పుట్టిననాటి నేటివరకు వీరికి మీసము పేరు చెప్పి ఒక్క కేశరాజమైనను మొలవలేదు. పెడత్రిప్పుట వీరికి స్వాభావికము. వేయేల! గొప్పవైద్యులు వీరిని పరీక్షించి "More of a female than of a male" అని వ్రాతపూర్వకముగ సెలవిచ్చియున్నారు.

నక్షత్రకుడు:—వీరు సింహతలాటకంకణ. విరుదాంకితులునూ, సుప్రసిద్ధనటకులునూ, గానకళాపూర్ణ చంద్రోదయం గారునూ అయిన V. P. Chary గారి యొక్క ప్రియస్నేహితులు: చీకటిలో నక్షత్రమువంటి వారగుటను, స్వానుభవముచే అప్పులబాధ గ్రహించిన వారగుటను, నక్షత్రపాత్రధారణ వీరికి కొట్టిన పిండి.

విశ్వామిత్రుడు:—వీరిని చూచి తీరవలెను.

తక్కినవారు:—పై అందరికంటె పేరు గాంచిన వారు.

మరా. ౧. చాలాగొప్పవారు ఈ నాటకమునకు వేంచేయుచున్నారు: వారిలో ముఖ్యులు:—౧. ప్రేక్షక మహారత్నభయంకర B. N. V. రావు గారు, ప్రేక్ష కోద్దండ మండలేశ్వర R. S. T. రావు గారు, ప్రేక్షకాచార్య చండశాసన Master J. S. N. S. శ్రీ గారు, వగైరాలు.

మరా. ౨. నాటకానంతరము పట్టి ప్రేక్షకులకు బిరుదు లొసంగబడును, ఈ తరుణములో తమరు రాని యెడల సంస్కృత సమాసములలో మంచిదకము అఖర గును. తరువాత అందరును కూడ తెల్లపోవలసివచ్చును. కాబట్టి రండు.

మరా. ౩. నాటకము ప్రారంభించిన మొదటి అరగంటలోనే వెళ్లిపోయెడువారికి ఆటంకము లేదు. సొమ్ముమాత్రము వాపసుచేయబడదు. కంపెనీ రూల్సు మీరకూడదు.

రేట్లు:—౩-౮-౦, ౨-౩-౦, ౧-౨-౦, ౦-౯-౦.

మేనేజింగు కమిటీ.

౩. (a) Wanted!

కావలెను! కావలెను! రాబోవుమార్చి లోపున కావలెను!

చెన్నపురి విశ్వవిద్యాలయంలో (ఆంధ్రవిశ్వవిద్యాలయం అక్కరలేదు) రసాయనశాస్త్రమందు పట్ట

పరీక్షయందు పట్టాపుచ్చుకొన్న ఇరువురు—ఒకరు మా కాఫీహోటలులలో శ్రీ పి ప ర వ తయారు చేయుటకు, (Non-Brahmin preferred), మరియొకరు కారపు పనులు చేయుటకు (దీనికి Brahmins only need apply).

For details address:

Tanjore Brahmin-NonBrahmin Coffee Hotel, Bobbarlanka Lock.

(b) For Sale

Sincerity Pills త్రికరణ శుద్ధిమాత్రలు.

రాజకీయోద్యోగులకును, రాజకీయ నిరుద్యోగులకును కూడ అత్యంత అవసరమైనటువంటి Sincerity అనే అమూల్యపదార్థము చవక ధరలలో S. B. Mathi ఆశ్రమములో దొరకును. దీనికి పథ్యము విధి లేదుగాని, పానము నిషేధము. పూటకి రెండేసిమాత్రలు చొప్పున పక్షము వాడిన చాలు. కాని వ్యక్తులనుబట్టి తత్వభేదముండును గావున, ఒక్కొక్క డిగ్రీ of latitude దక్షిణమునకు దిగినకొద్దీ రెండేసిమాత్రలు పూటకు హెచ్చుగా పుచ్చుకొనినగాని పనిజరుగదు. Equator వద్ద డబ్బీ ఫళంగా ఒకేసారి అన్నీ మింగివేయవలెను.

48 మాత్రలు గల చక్కని డబ్బీతో సహా 0-2-0 పోస్టు ఖర్చు మీద. మఠీ ఆశ్రమం, West India.

(c) WANTED an M. A. a Master of the art of Smoking cigarettes to enlighten the world about smoke. Salary according to qualifications plus special allowance viz. Infinity of cigarettes.

Apply: World league of Smokers,
South Pole.

(d) WANTED: Applications from Research Scholars in Science.

Two years ago Mr. N. Girisa Iyer, M.A, M. Sc., after careful research, came to the conclusion that two of the dark spots of the sun are not at all spots but two coffee hotels instituted by one of his own great grand fathers. To day we are surprired to hear from Mr. P. V. N. Sastry, B.A. M. Sc. that is were muisance and that one of the spots is a Meals Hotel and the other a coffee hotel of a Tamilian of a gothra different from that of N. Girisa Iyer. To ascertain truth we want to encourage more research.

For details, apply sharp:

Research Institute, Bommur.

ర. స్పోర్టింగ్ న్యూస్.

(a) బొంతాపుర కాపురస్థులు M. K. Rao గారి ద్వితీయ పుత్రునికి, మొన్నటి క్రిష్టమసు సెలవులలో ఉపోసన కార్యమునకు ఇబ్బంది కలుగలేదు. శీతోష్ణస్థితి విఘ్నమింపలేదు.

(b) సింహపురులో V. A. J. Neya, బి. ఏ. గారు మొన్న చదరంగాయత్తచిత్తులై, కోర్టుకు వెళ్లుట మరచి, తమ తృతీయ కళత్రముతో చదరంగమాడగా, ఆడిన మూడాటలలోనూ మూడు చెరువుల నీళ్లు త్రాగిరి. తరువాత తరువాత కాబోలు, మాకు దురవచ్చి తంత్రికితో ద్వశేన సిరప, తిల్లి ఆట కట్టైను.

(c) మొన్న రాత్రి విజయపాలెంలో, రాత్రి పన్నెండువేళ, G. S. M. Hari, M. A. గారు, 8 అడుగులగోడ అతిసామర్థ్యముతో High Jump దూకిరనియు, దూకునప్పుడు వారు పరోడీపాట్ల సమేతులును, సిల్కు కండువా ధారియు, ద్రవ్యవాసనాభూయిష్ఠులును అయియుండిరనియు, సినిమా చూచి ఇంటికేగుచుండి ప్రత్యేకసాక్షి కావలసివచ్చిన మా విలేఖరి వ్రాయుచున్నాడు.

(d) ఇటీవల జరిగిన దోమల కుస్తీలలో, ఇతరరాష్ట్రదోమలు అనేకము మధ్యవర్తిత్వము చేయగా, విశాఖపట్నపు దోమ రాజమండ్రి వగైరా దోమలను పిండి కిందకొట్టి నెగ్గెను.

### ౫. ౧౯౩౯ వ సంవత్సర ఫలము

ఈసంవత్సరము చాకలివాళ్లు వాళ్లకి పడ్డ బట్టలలో కొన్నిటిని చింపకుండా ఉంచి, ఈ సంవత్సరమే యజమానులకు ఇచ్చివేయుటకు యత్నించినను పారబడి వారికే వాటిని అద్దెకు ఇచ్చుచుందురు. సెలవులు హెచ్చుగుటంజేసి ఈసంవత్సరము స్కూలుపిల్లలకు జట్టీలును, స్కూలు మేష్టర్లకు సంతానమును పెండగును. ఈయేడు జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు, లెజిస్లేచర్లూ, స్వలాభాపేక్షతోనూ పార్టీవైషమ్యములతోనూ కూర్చొక, సన్నిహిత బంధువర్గములో మాత్రం కాస్త ఉన్నతోద్యోగ ప్రయత్నాలుచేసినా, స్వార్థత్యాగము చూపుచూ, దేశసేవ చేయుచుందురు. కేవల నిరుద్యోగసమస్యమూలమున, ఈ సాలున పిత్రార్జితం వగైరా లేని పెళ్లికుమార్లు చకచకేటులో కుదిరిపోవుదురు ఈసంవత్సరము గౌరవోద్యోగములు చాలా Paying గా ఉండును ఈయేడు ఫస్టు విద్యార్థులలోనూ, కొత్త బారు ప్లీడర్లలోను స్వంత క్షౌరం బలిసినందున, మంగలవాళ్ల రాబడి నూటికి ౩౦ క్రుంగిపోయి, వారికి ఆగ్రహమువచ్చి, ఇళ్లిల్లుతిరుగుట మాని వారే కేశఖండనాగారములు (Saloons) దండిగా స్థాపింతురు. ఈయేడు కాలేజి హాస్టెల్సులో సిగరెట్టు కాల్చనివారిసంఖ్య చప్పగా క్షీణించినను, Strong tea త్రాగెడివారి సంఖ్య ద్విగుణమగును. Bus service ధర్మమా అని మెయిన్‌రోడ్డుమీద బయలుదేరు దుమ్ము తుపాను తమకంలో, క్లయంట్లకి మెయిన్‌రోడ్డు ప్లీడర్ల బల్లలు వగైరాలు ఆనవాలు అందక, వారి ప్రాక్టీస్ నూటికి ౭౫ తగ్గును. ఈయేడు నిరుద్యోగసమస్యవల్ల జ్యోతిష్కులకు, డబ్బుదక్కకపోయినా, రద్దీ ఎక్కువగును. ఈసంవత్సరము శుక్రుడు ఉచ్చదశలో ఉండడం వల్ల వంటలక్కల గిరాకీ ఎక్కువై వంటబ్రాహ్మణులు ఎంతతక్కువకైనను చేరుదురు. చాలమంది బ్రాహ్మణులు కోడిగుడ్లు Vegetable పదార్థములక్రింద స్వీకరించుట వలన, ఈయేడు వాటిధర చురుకుగానుండును. ఈసంవత్సరము చాలదేశములలో, ఖండాంతరములలో కార్యమే కావలెగాని పెళ్లి వద్దనుటయూ, మగవాడు కావలెగాని మగడు వద్దనుటయూ, పిల్లలు కావలెనుగాని గర్భిణీ దుర్భరమనుటయూ, స్త్రీలు బయలుదేరకపోరు. ఈసంవత్సరము అన్నిమతములలోను శ్రోత్రియులు విస్తారముగా అల్లకల్లోలము చేయుదురు. ఈయేడు రాజులు వృద్ధిలోనుందురు. ఈసంవత్సరము హిందూదేశములో మనుష్యుల సంఖ్యకంటె పార్టీలసంఖ్య కొన్ని రెట్లుండును. ఒకనిలోనే చాలాపార్టీ లుండును. అధికారవర్గము, ఈయేడు, మాటమార్దవమునందు మరింత ఆరితేరుదురు. ఈయేడు ఎలెక్షన్సులో ఆశాభంగము నూటికి రెండువందలు పెరుగును.

### ౬. ఖాళీపురమున మీసముల మీటింగు

నిన్న సాయంత్రమున, ఖాళీపురములో మీసములుంచుట దేశమొత్తమునకు క్షేమమా అక్షేమమా అనువిషయమునుగురించి చర్చచేయుటకు మహాజనసభ జరిగినది. విషయముయొక్క ఉత్కృష్టతను బట్టి జనులు తండోపతండములుగా అరుదెంచి, మీటింగు ఆరింటికని ప్రచురించినను, సీటు దొరకదేమో అను భయమున, ఏ పాటిపెతుకులో కొరికె ఎండ ఉండగానే హాలు క్రిక్కిరిసిపోవునట్లు మూగిరి. వేళకాగానే ప్రధానిలేచి, బుగ్గమీసముల కేశారాంగారిని అధ్యక్షపదవికి ఉపపాదింపగా మరియొకరు బలపరచిరి. ఈలోపుగా మరియొకరులేచి, కేశారాంగారు శ్మశ్రుపక్షము వాదించుటచే వాదనకు పక్షపాతము జరుగునని చెప్పగా, ప్రధానిగారు అందుకొని, రాంగారు బుగ్గమీసముల వాదనుటంజేసి Technical గా వాదనలోనున్న రెండుపక్షములలో దేనికినీ చెందరనిన్నీ, వారే అర్హులనిన్నీ, చెప్పగా, వారు వెళ్లి కుర్చీనలంకరించి ముందు "మీసములు అక్షేమమే" అనువారిని మాట్లాడనిచ్చిరి. ఆపార్టీవారు చెప్పినదానికి సారాంశమిది:—

కాఫీ మొదలగు ద్రవపదార్థములు త్రాగునప్పుడు మీసములే ఫస్టు ఒకఆరకప్పు లాగివేయుటవల్ల, మానవుని ఖర్చులో సగము వాటివల్లనే. మీసముంచినయెడల వాటి పోషణార్థము బ్రష్షు, కత్తెర, వాసెలైన్, Hair oil, Cosmatic, ప్రత్యేకసాకరూ అవసరం కాబట్టి అపరిమిత వ్యయకారణమైన మీసమును పరిత్యజింపవ

లేను. మీసమున్నయెడల, చేతిలో ఏపనియున్నను సరే, నిముషమునకొకసారి వాటిని తిన్నపరిచి కాలము పాడు చేసుకొనవలెను. కొండొకచో సూదిమొనలు గలిగిన మనమీసములు మనకే మెలిపెట్టుచుకొను నప్పుడు గ్రుచ్చుకొనుచే, తక్కినవాళ్లకు? ఏది! పౌరుషచిహ్నమైన మీసము స్వరాజ్యములేని హిందూస్థానీయులకు తగదు. మీసమున్నచో పరాక్రమమున్నదని పొరబడి గవర్నమెంటు వంటివారు, ఏదేని యుద్ధము వచ్చినప్పుడు "నడవండి మీసాలవాళ్లు యుద్ధానికి!" అంటే చావాలి. గనక మీసములేనివారికి యుద్ధభయములేదు. ఆంధ్రులలో మిక్కిలి గొప్పఉద్యోగములకు ఎగిరినవారు మీసములు లేనివారు కాబట్టి మీసములుంచరాదు. మాటాడుట అవసరములేనివారు పెదవులకు అలంకారముగ మీసముంతురు గాని, మాటాడవలసిన ప్రతివాడును వాటిని విసర్జించినగాని అవి మాటకు అడ్డువచ్చును.

ఇక తక్కినవారివాదము:—దేవుడు, మానవునకు వీటి పరమార్థపరం ఏదో ఆలోచించి, "ఇది నీదగ్గర ఉంచుకోరా అబ్బాయీ," అని యిచ్చినపదార్థాన్ని తునియలు తునియలుగా, ప్రతిరోజు పరగడుపునే నరకడం ఉంటే, అది దేవతాప్రసాదాన్ని అగౌరవించుటయును, దేవునితో అనవసరంగా పేచీ పెట్టుకోవడమున్నూ అగును కాబట్టి సహజంగా ఉద్భవించిన స్వరూపములను నిర్మూలింపనూ వలదు; దేవదేవునితో వైరమూ వలదు. తరువాత, రోడ్డుదుమ్ములాంటి అపవిత్రవస్తువులు మనము గ్రహింపకుండనే నోటిలోనికి జొరబడకు సందర్భమున ఈ మీసములు Filter bed లాగ పని చేయును కాబట్టి మీసముండవలె. మీసములకు దోహము చేసి పెంచినయెడల అడ్డదిడ్డపు పళ్లవారి అవకరమును, పెక్కువరసల ఎత్తుపళ్లవారి లోటును, బోసినోటివారి వెలితిని అవి కప్పివేసి, వేళాకోళమునకు వాగాయివ్వక కాపాడును. సరిగాలేని పెదవులకు అవి శ్రీరామరక్ష. పురుషుడు మీసము తీసివేసినయెడల, తమరిని అనుకరించి వెక్కిరించుచున్నాడని స్త్రీ కినియవచ్చును. అదియుగాక మీసము తీసివేయుట పురుషుడు తనకు పౌరుషము లేదని పబ్లికుగా ఒప్పుకొనుటయగును కాన, స్త్రీకి పురుషుడు కొంత తేలికయగును. విశేషించి, అనేక కాలమునుండి, మంత్రివర్గములో మీసములవారే యుండుట ఎల్లరకును విదితము. వారు అట్లు ఉండుచు వచ్చుటకు మీసములే కారణము" ఈస్థితిలో, మెడికల్ కాలేజి విద్యార్థి ఒకతను సభలో అమాంతంగా నిలబడి,

'సోదర సోదరీమణులారా, క్షమించాలి; సోదరులారా! నామాట వినుడు. ఉన్నదంతా ఉంచమనే Co-operator ని కాను నేను. ఉన్నది యావత్తు నిర్మూలించమనే Extremist ని కాను. ఇటూ అటూ కూడా ఉంచీ ఉంచక ఉభయతారకం చెయ్యాలనే Moderate ని. నే చెప్పేది ఏమంటే, మీసములను, తూర్పుపడమరలలో, చెరి అరంగుళమూ సున్నా కత్తితో ఊడ్చివేసి, అటుపిమ్మట, అన్నీ ఒకేపొడుగున కన్పించుటకు క్రోటన్ మొక్కలను కత్తిరించెడి భాతి ఒకసన్నకత్తెరతో శేషించినవానిని తివాసీకత్తిరింపు చేసినయెడల, మీ కొట్లాట తగ్గి మీకు రాజీయగును' అని లెక్చరు దబాయించాడు.

తరువాత ప్రెసిడెంటుగారు లేచి, గంభీరోపన్యాసము గావించి, మీసముల క్లిష్టసమస్య ఎవరిఇష్టము వారు పరిష్కరించుకొనవలసినదిగా తీర్మానము చెప్పిన పిదప, అధ్యక్షునకు వందనములతో సభ ముగిసెను.

Editor's note:—

ఇట్టి మహత్తర సమస్యలగూర్చి దేశమందెచ్చటను చర్చరాలేదు. కొందరుమాత్రమే ఇట్టి గొప్పవిషయములను పైకితెచ్చి దేశక్షేమమునకై పాటుపడుచున్నారు. ఇది కాకీపురవాసు లెల్లరును గర్వించి ఉప్పొంగవలసిన సందర్భము. ఆంధ్రదేశ నగరములలోనెల్ల ఈ కాకీపురమే ముందంజవేసినదని చెప్పుట అతిశయోక్తి కానేరదు. సకలవిషయములలోను ఈపురము ఇట్టి ఔన్నత్యమును ప్రకటించినను, గవర్నమెంటువారు ఆంధ్ర విశ్వవిద్యాలయపు Headquarters కాకీపురమున పెట్టకపోవుట కడుంగడు శోచనీయము. ఏది ఎట్లున్నను, ఇట్టి మహద్విషయములను ఇతర నగరములలోకూడ చర్చకుదెచ్చి, దేశోన్నతికొరకు పాటుపడుచుండుటకై

భగవంతుడు మనకు తగినశక్తిని, ధైర్యసాహసములను, వీలును, తీరుబడిని, వాక్కును ప్రసాదించుగాక! అని ప్రార్థించుచున్నాము.

౭. రాకపోకలు.

V form క్లాసులో ఆరేండ్లుండుటవలన కార్యశూరత్వమునను, పట్టుదలలోను అభినవ Robert Bruce అని బిరుదుగాంచిన P. P. R. మణిగారు, ఈ ఉదయముననే, స్కూలు ఫైనలు సంగతి కనుగొనుటకు, స్వగ్రామమునుండి రాజమండ్రి వచ్చిరి.

A. N. S. Ham గారు "good manners" నేర్చుకొనుటకు (అనగా పెద్దమనిషి తరహాగా ఉన్నట్లు నటించడం నేర్చుకొనుటకు) ఇంగ్లాండునకుబోవ నిన్నటి దినమున బొంబాయిలో "రాజపుటానా" అను ఓడ ఎక్కిరి.

Y. S. N. Ana గారు, రకరకముల పొట్లములు_అనగా, పొడుము పొట్లం మొదలు, gentlemen అని అనుకుంటూన్న కొందరు చాకలివాని ఇంటికిగాని లాండ్రీకిగాని మాసినబట్టలు న్యూసు పేపరులో చుట్టపెట్టుకుని వెళ్లే పొట్లములవరకూ—కట్టుట నేర్చుకొనుటకు ఈ రోజుననే జర్మనీ పోవుచున్నారు.

ది ౧౮వ ఆగస్టు ౧౯౨౭ సం॥ తారీఖున పోలవరంలో బయలుదేరిన Ch. R. కొరగారు, తనయొక్క పెద్ది వెదురుగడల తెప్పతో రాజమండ్రి బ్రిడ్జి ౧౮వ స్తంభముకడ ఈరోజుననే ౧౧ గం. ౩౯ నిమిషములకు క్షేమముగా చేరినారు. ఈ విధంలోనే వీరు ఏదో మరియొక రేవు చేరెడి సూచనలు కన్పించుచున్నవి.

ఇటీవల కొంతకాలమునుండి మన ఊరనే తయారు చేయబడిన ఒక కాగితపు బుట్టగారు, డ్రైవరైన దీపంగారితో సహా ఎంతో దిగ్విజయముగ నిన్నరాత్రి ౧౦ గంటల ౨౧ నిమిషములకు పైకి లేచిపోవుటకు బయలుదేరినారు. డ్రైవరుగారు కోపముతో మండిపడుటవల్ల వీరి ఆకాశగమనము మిక్కిలి త్వరగా ముగిసెనని జనులు చెప్పుకొనుచున్నారు

K. C. మణిగారు గోదావరిలో ఈదుటకై కూడా పూనుకొని, నేటి ఉదయం ౮ గం॥ ౧౨ నిమిషములకు బయలుదేరినారు. వారు సురక్షితముగ వెనుకకురాగలరని కూడా నమ్ముచున్నది.

M. V. Rayan గారు, రేపటిదినము నిడదవోలునుండి భీమవరం వెళ్లెదరు. ఏమియు పనిలేక, రేవు రైలుమార్గము తెరచెదరుగదా చూతమను ఉద్దేశముతోనే ఆయన వెళ్లుచున్నారని బయలుదేరిన వదంతికి ఆధారములు కన్పింపవు.

౮. స్థానికవార్తలు.

రాజమండ్రి—ఇప్పటనే Ice తయారగుచుండుటచే వేసంగిలో చల్లదనమునకు ఎవ్వరునూ ఊటీ వెళ్లరని తెలియుచున్నది. ఇప్పట ఎలెక్ట్రీ గురించి జనుల కోర్కె ఇంకను తీగ సాగుచున్నది. పాలక సంఘానుగ్రహమున, విశ్వవిద్యాలయం లేనప్పటికిని, ఈ పురము త్వరలోనే ఒక వెలుగు వెలుగవచ్చు.

ఏలూరు— ఇక్కడి అగ్నిప్రమాదములు ఏటేటా, జమాబందీలాగ రివాజై 1926 సం॥లో 1000 కొంపలు, 1927 లో 900 కొంపలు, 1928 లో 800 కొంపలున్నూ పరశురామప్రీతి కాగా, మునిసిపాలిటీవారు సమావేశమై తగులబడుచున్న కొంపలసంఖ్య దానంతట అదే క్షీణించుచున్నది, క్రమేపి ౭ ఏళ్ల అనంతరము సున్న కొంపలు దహనమగును. ఈలోపున Fire engine కొనడం అనవసరం అని తీర్మానించిరి.

గుంటూరు— ఈ వేసవికాలపు ఎండలకు, వేడిమికి ప్రజలు ఓర్వలేరని, సర్వజనోపకారార్థం, గవర్నమెంటువారు, పార్టు ఫర్ ది హోల్ అనగా సినక్‌డోకి అనే ఇంగ్లీషు అలంకారప్రకారం కలెక్టరుగారింటికి మాత్రం నాలుగు వైపులా తాటాకు పందిళ్లు వేయుదురు.

కాకినాడ—Honarary ఉద్యోగంలో అర్జన కూడా Honarary అను గ్రహింపులేక మూడేళ్లపాటు బోర్డు అధ్యక్షత చేసియు దమ్మిడీయైనను వెనుక వేసుకొనలేకపోయిన Y. M. అయ్యా, M. I. C. E

గారి గౌరవార్థం, కాకినాడ పురవాసులు సమావేశమై, తమ హృదయ పూర్వక Condolences అయ్యగారికిని, వారి మీద ఆశలు పెట్టుకొన్న వారికిని ఇచ్చుచు విషాదాంత తీర్మానమును వెలిబుచ్చిరి.

బాపట్ల—సీసలుగా ౧౦ యేళ్లనుండి తనకు "రావు సాహేబు" అనే బిరుదు వచ్చితీరుతుందని మురిసి కుళ్లిపోతున్న శ్రీ శ్రీ M. R. S. Rao garu, తనఅల్లుడు Inter ఫేలయినందుకు విచారముగా నుండియు, తన తోడల్లుడిగారి అల్లుడు బి. యల్. ఫేలయినందున తమ సంతోషమును ప్రకటించుటకు పాటి ప్లీడర్లకు 'at-home' ఉన్నట్టు తెలియుచున్నది.

నెల్లూరు—కూర్ల అన్నేశ్వరయ్యగారి ఇంట్లోకి, మొన్నటిరోజున, పట్టపగలు, ఒక పెద్ద మండ్రగబ్బ ప్రవేశించెను. అన్నేశ్వరుడు మండ్రగబ్బను చూడగానే జడుసుకొని "ఒసేయ్! మొగాళ్లని కేకెయ్యవే" అని భార్యను హెచ్చరించగా, ఆవిడ పోలీసువారికి కబురు చేసిన మీదట, ఒక సబ్ ఇన్స్పెక్టరూ ఎనిమిదిమంది కనిష్టేబులులున్నూ ఆయుధహస్తులై వేంచేయుసరికి అది ఏదో కన్నములోకి పోగా, పోలీసులు ఆశోపహతులై కన్నమునకు బారెట్టి మండ్రగబ్బ ఎప్పుడు తలచూపునా యని నిరీక్షించు చున్నారు. నేటివరకూ పోలీసుఘాటు కన్నము వదలలేదు. వీలయినంత త్వరలో దానిని సజీవముగ పట్టుకొని రాజమండ్రీ Central jail కి పంపగల ధైర్యము ఇనస్పెక్టరుగారికి కలిగినది. పురజనులు పోలీసు వారి అప్రమత్తతకు ఆనందించిపోయిరి.

కడప—ఇచట సబ్ జడ్జీగా నుంటూన్న S. K. Y. Iyer గారు (ఆయనను కొందరు అవర్ గళ్ అనియు వేరొక కొందరు మినిట్ గళ్ అనియు అందురు) తమ చాకలి వాడు బట్టలు తేనందున ఈరోజున కోర్టునకు రాలేదు.

చెన్నపట్నం—ఒక తెనుగు బోర్డునకు (విద్యాశాఖ మాట!) దొరతనము వారిచే ప్రెసిడెంటుగా నియమింపబడిన దొరగారు, నియమింపబడిన తేదీ లగాయతు ఆంధ్రభాష మిక్కిలి శ్రద్ధతో నేర్చుకొనుచున్నారు. ప్రస్తుతము వారు తమ పేరులోని మొదటి రెండు అక్షరములను, స్వహస్తముతో, మొనాకులలోకూడా ఆనవాలు తెలియునటుల వ్రాయగలుగుచున్నారు. ఇది విని ఈ చెన్నపట్నమునగల "ఆంధ్రభాషాభివర్ధనీ సమాజం" వారు తెగ సంతోషించి, ఒక మీటింగులో దొరగారి ఆంధ్రప్రజ్ఞావిశేషమును శ్లాఘించి, వారికి "Doctor of 2 letters" అనే బిరుదును కటాక్షించి, దొరతనమువారు వీరినే ఆపదవికి నియమించినందుకు దొరతనమువారిని అభినందించుచూ, జోరుగా తీర్మానించిరి.

విజయనగరం—అధికమాసములతో అరవైయేళ్లనిండిన M. R. ధర గారు, ఈ మధ్య తమ నాల్గవ భార్యామణిగారు తమమనస్సునకు కష్టమైన కార్యములలో పాల్గొనినందున, నిర్భరసంతాపమునకులోనై, తనకు ఎటులో సమాధానము తెచ్చుకొని, కోపములో ౫వ పెళ్లి చేసికొనవలయునని పుట్టిన తలంపు మానుకొని, బంధుకోటిముందర మనఃపూర్వకముగ చేసిన ప్రతిజ్ఞ!

'నేనే, నిత్యమూ, ప్రాతఃకాలమున లేచి కాలకృత్యములు నిర్వర్తింపకయే ఇడ్డెన్లు తినుచుండెడివాడనేని, నేనే తక్షణం కాఫీపుచ్చుకొని కాఫ్యానంతరం అగ్నిసాక్షిగా కిల్లీనమిలెడి వాడనేని, నేనే సాయంకాలము Refreshment నకు వీగువాడనేని, నేనే పిచ్చివమ్మకములేని Civilised being ని అయితినేని, నేడు లగాయతు ఆరునెలలలోపుగా, అయిదవ పెళ్లి సంగతి స్మరింపకుందునుగాక' అని తననేతాను శపించుకొనెను.

మహాపూల్ నగరము—హిందూ మహమ్మదీయ సమస్యను గురించి ఈనగరమున మహాజనసభ జరిగి ఒక గొప్ప రాశీ తీర్మానము అమిత సంఖ్యాకులచే ఆమోదింపబడెను. హిందువులు ఆరంగుళముల గడ్డములు, మహమ్మదీయులు ఆరంగుళముల పిలకను ఉంచిపెంచుకొనుటయే ఈ తీర్మానముయొక్క ముఖ్యోద్దేశము. ఇట్టి యుద్దేశముగాని దేశము బాగుపడదని నాయకులును, వినాయకులునుగూడ తలచుచున్నారు. ఈ తీర్మానమును ఆచరణలో తక్షణమే పెట్టుటకు కేశరాజములవసరము కాబట్టి అవి కొనుటవలసిన ధనమునకై దేశా

భిమాను లెల్లరును తోడ్పడి చందాలు వసూలుచేయ ప్రార్థితులు. చందాలు ఈచిరునామాకు పంపవచ్చు:

మహమ్మద్ హాబీబుల్లాశాస్త్రి అవర్గళ్.

Treasurer,
All India Pilaka Geddem Fund,
Ramabad, India.

౯. ఉద్యోగములు.

Revenue

డిస్ట్రిక్టుకలెక్టర్ మహారాజశ్రీ Simham Iyer B. A. B. L. వారిని, వారికుమారుని వివాహసందర్భములో వారు ఒకరి దగ్గరనుండి అపకారపూర్వము ౫౦౦. రూపాయిలు బహుమానము స్వీకరించినందున, ఉద్యోగమునుండి పూర్తిగా తొలగించి, ఇంటికి Transfer చేయడమైనది.

వారిస్థానే, Acting Tahsildar B. M. L. V. Swami B. A. గారిని, సదరు సింహం అయ్యరు గారికన్న రెట్టింపు లంచం పుచ్చుకొనే వారని మాకు తెలిసినను, పుచ్చుకొన్నదానిలో ముప్పాతిక పైవారికి కట్నముగా అర్పించి ధర్మబుద్ధితోను త్యాగము మూపెట్టినందుకు, నియమించడమైనది,

Judicial

M. R. Ry. D. T. M. R. Pathi M. A. M. L, Addl. District Munsiff, Bellary గారిని, ఏలూరు Principal District Munsiff గా transfer చేస్తూ, వారికి పరిపడ్డ కుర్చీ ఏలూరులో దొరకదేమో అను భీతిచే, లోగడ వారు బళ్ళారిలో మామూలుగా వాడుకునే కుర్చీరాజమును కూడా, transfer చేయడమైనది.

Excise

L. V. Nathan B. A, Asst. Commissioner, Waltair గారికి, వారి స్నేహితుని పరిచితయు, విద్యాశాఖలో పనికలిగినట్టియు X. Y. ధర్మం M. A. గారు Vizag నుండి Madras transfe అయిన సందర్భమున, ఉన్నమతి సైతము పోగా, Medical certificate మీద వారికి, 3 వ జనవరి మొదలు ౨౨ రోజులు సెలవు జారీ చేయడమైనది.

Police

T. M. R. ఆప్. S S. L. C. circular Inspector of Police, Narsapur గారిని, వారు తమ ఇంట్లో తమరు ఉండగానే దొంగలు ౮ వేల రూపాయలు దోచుకొనిపోగా ఏమియు చేయలేక, అసమర్థులై సిగ్గుపడుచు నుండ, వారి కోరిక మీదనే, వారిని గుడిసెలపాలెం transfer చేయడమైనది. To join duty at once.

౧౦. సంభాషణలు

(*a*) అన్నదమ్ముల పంపకాలమీద లెక్కయిచ్చి, కొంతసేపు చూసి, ఎవ్వరూ చెయ్యలేకపోగా,

మేష్టరు—సీరయ్యా! లే! అన్నగారికి ఎన్నివంతులని ఉంది, లెక్కలో?

సీ—పదిహేనండి.

మే—ఎన్నింటికి పదిహేను, కళ్లులేవు?

సీ—నూటికండి.

మే—నూటికి పదిహేనైతే, ఒకటికి?

సీ—నాకు రాదండి.

మే—ఏం తెగులు? రాక?

సీ—ఇప్పుడే జొరొచ్చావండి.

(*b*) ఒకసత్రంగదుల్లో ఒకదాన్లో కూర్చుని రాసుకుంటూన్న ఒకపెద్దమనిషితో

ఒకబాటసారి—తమదేవూరండి?

పెద్ద—కాకినాడ. ఏం?

బా—ఊరికేనే బాబు! తమపేరు?

పె—దోసపాటి నాగారావు.

బా—చిత్రం. మనకేమన్నా ఉద్యోగమా అండి?

పె—(ప్రక్కగదిలో భార్యాసమేతులై యున్న కలెక్టరు గారికి ఖంగున వినపడేటట్టు) ఈప్రక్కగదిలో దిగారేం? ఆ కలెక్టరు గారి పర్సనలు సుమాస్తాని.

బా—తమకేమన్నా సంతానమా?

పె.— నేను ఈ ఉద్యోగంలో జేరినప్పుడు నా భార్యకి గర్భిణీవచ్చి మూడో నెలని పోయింది. ఈ పనిలో జేరింతరవాత అల్లాంటి అనుమాన మేనా ఎప్పుడూ కలగ లేదు.

(c) రైల్లో యాచకుడు బ్రాహ్మడు — అయ్యా! శుభోజ్జయం. ఈవేళ అమావాస్యండి. సర్వేషాం. ఆడ వాళ్లకీ మొగాళ్లకీ కూడా!

అప్పుడొక షాహుకారు—ఆడవాళ్లకీ మొగాళ్లకీ సరి! వెధవముండలమాట ఏంటి సెలవిచ్చావు బాప నయ్యా?

బ్రా—వెధవవాళ్లకీ మీసు కూడా అంతేనండి. సర్వేషాం అని మొదట్లోనే అన్నా కాదండీ.

---

# ప్ర వా సి

సహదేవ సూర్యప్రకాశరావు గారు

ప్రియరుంతుడ వేదనా హృదయమునకు
నిలువ, రోదించ, నిట్టూర్చ నీడ లేదు,
కాలుకదపిన యేని యఖాతకతిన
శూన్యనైరాశ్యగర్భాన సుఖులు వడును.

ఇంతకన్నీటి తడిజీర యేని ఈయ-
నంతలోకాన కటికిశూన్యమయిపోయె
శ్రావణశ్యామ లాంభోధరములకొనల
మినుకులీనదే సాంధ్యకిమ్మీర రక్తి.

తుహిన రేఖామనోజ్ఞ మాధుర్యలేశ
మేని నాలోననే మధురించుకొనగ
హస్తముల సాచి నాహృదయమ్ముసాచి
ప్రేమవాసనాపాశాల వెదకుచుంటి.

సంశయచ్ఛాయ లలమ నాశ్రయము వీడి
రగులు హృదయాన ఆశలు రాపువెట్ట
మరిమరీ గవేషించుచు తిరుగుచుంటి
నది మహీభవణ నిశీథమైన సరియె.

నాపిపాసార్తి వాయక నవసి నవసి
తెలియగారాని బాధ త్రొక్కిళుల నలగి
నను వలపుకోసమేకాగ్రతను వహించి
కాంతుల నలంది యూహల కలలగాంతు.

నా బ్రదుకుదారికొకటి ఆనందబాష్ప
రేఖ, వాసింపమది తెలారిలుదుగాని
కాలయాపన బ్రదుకుతో కలయదిరుగ
భృంగడింభకువోలె పరిభ్రమింప.

ఏమి జీర్ణించు కొన్నాను ఏను మున్న
అదిమొ జీవిక రక్తఛాయల రగిల్చె
ఇన్నికల్పాలు గడచిపోయినను; మరల
చివురువెట్టదు వలపుల నివముకొనక.

ఎపుడు నాలోని ప్రేమ నశించు నపుడె
నేను, పావురా కంఠాల నిలచి కలసి
పొంగిపడుగు బాళింపులపొరలుకవిత
నీరసిలి రాలిపడి మరణించిపోవు.

---

# ఆకస్మికచ్ఛాయాచిత్రములు
## (SNAP SHOTS)



౧. మా కిటికీలోంచి
(ప్రథమ బహుమానము)



౨. మైసూరు ఎడ్లు

శ్రీ అంకాల వెంకటసుబ్బారామగారి [illegible]



3. పిలుపుగంట
(రెండవ బహుమానము)



౪. చిట్టిసోదరులు
శ్రీ హరి శేషగిరిరావుగారి చిత్రములు.



౫. 'శ్రీమద్రమారమణ గోవిందో హరి'
శ్రీ అంకాల వెంకటసుబ్బారావుగారి చిత్రము.



౬. 'బజారులో'
శ్రీ బి. బాపిరాజుగారి చిత్రము.




## (రాఘవుఁడు)

కవికొండల వేంకటరావుగారు, బి. ఏ., బి. యల్.

"మా నాన్నగారే కనుక బ్రదికియుండెనా, నేనిప్పు డెంత స్వేచ్ఛగ, నెంత విచ్చలవిడిగ, నెంత యిష్టమువచ్చిన ట్లెంత సౌఖ్యముగ నా జీవనమును గడిపియుందు"నని యొక మధ్యాహ్నము పదకొండుఘంటల యెండలో నడచి వచ్చుచు రాఘవుఁడనుకొనెను. అప్పుడే నేను



వానిని మార్గమధ్యమున 'ఘాటీ'వద్ద ప్రవహించు చిన్ని యూటకాలువ నొప్పవంతెన కడఁ గలసికొంటిని.

రాఘవుని తొల్లింటిశరీరచ్ఛాయ పచ్చని దబ్బపండు. రాఘవుని తొల్లింటిముస్తాబు, పోకు, నడక, నీటు 'పైలాపచ్చీసు'మీద నుండెడివి. రాఘవుని తొల్లింటిమోము పుష్టిగ నుండెడిది.

కాని నేను గలసికొన్నప్పుడో యాతని యొడలెల్ల ఎండ్రకిమ్మట నలుపెక్కినది. గడ్డము పెఱిగి భయవికృతుల గొల్పినది. కనులు లోతునకు పోయినవి.

"ఏమి టా మార్పు? సోదరా!" అంటిని.

"మా తోట! మా తోట! నీ వెప్పుడును చూడలేదా?"

అని యాతఁడు నాకుఁ బ్రత్యుత్తరమిచ్చుచు—తన భోజన మింక నప్పటికి కాకపోయినను—ఇంటికిఁ బోవుట మాని ప్రక్కన నతి దూరమున

నన్న తన తోటలోనికి నన్నుం గొని పోయెను. "నీవు భోజనమునకు వెళ్ళవా" అని నేనడుగ "ఉదయమున నొకపూరీ, అరటిపండు తీసికొంటి. ఒక్కపూట భోజనము లేకున్న నేమి? చూచితివా యీతోట ఇది పెద్దదగు నెడ మనము భోజనమున కింటికిఁ బోనవసర ముండదు. ఈ కొబ్బరిచెట్లకాయలు తినుచు-- ఈ మామిడిచెట్ల పండ్ల మెక్కుచు చిలుకల వోలె గోరువంకలువోలె మహానందముగ కాలము వెళ్లబుచ్చమా? నీ యభిప్రాయ మేమి?" అని నన్ను మాఅడిగెను.

'భేషైన ఆలోచన' యని యతని నభినందించుచు నేనును ఆ తోటనున్న అంటుమామిడిచెట్ల, బత్తాయిచెట్ల, నిమ్మచెట్ల, కొబ్బరిచెట్ల, పనసచెట్ల, పూలచెట్ల, ఆచెట్లకై కట్టిన కాలువల, బోదెల, పాదుల, నడుమనడుమ నిర్మించినపందిరుల, పొదరిండ్ల, బావు , కొలకులఁ గనుఁగొనుచు

"ఇంత మంచితోట నెప్పుడు కొంటి రీ వఱకు నే నెఱుఁగనే" యని యచ్చెరుపాటు వెలిఁబుచ్చితి.

అంత రాఘవుఁడు "ఈతోట మా నాన్నగారు కొన్నారు. ఆయనకియ్యది ప్రాణపదము. ఇది మొదలింటఁ గొన్నప్పుడు దీనినిండ తాడిచెట్లు, బ్రహ్మదండి, బ్రహ్మమేడి, ఈతరుప్ప తప్ప వేఱొండు లేదు. నాలుగుతట్టులు కలయఁజూడ రమారమి ఇరవై యకరము లుండును. రాత్రి యనక పగలనక ఆయన యిచ్చటకువచ్చి పని చేయించి అద్దమువలె నున్నగఁ జెక్కించి, దున్నించి, పెద్ద యుద్యానవనము నాటించు తలంపుతో నప్పుడొక మొక్క, నప్పుడొక మొక్కవేయించి యవి కాయకముందే, వాని ఫల మనుభవించక ముందే, కాలము చేసిరి. ఆయన పుత్రుఁడ నగుట నేనిప్పుడు తదాశయమును గొనసాగింప నిట్లు పాటుపడుచుంటి. చూచితివా యీ తీవ. ఇది మల్లియ. ముందు వేసంగిని ముమ్మరముగ మొగ్గఁ దొడుగు. చూచితివా యీ అంటు—నిమ్మంటు—ఎంత చల్లగనున్నదో దీనిప్రక్క గూరుచున్న—" అనుచు రాఘవుఁడు తన కెక్కడలేనిబలమును తెచ్చుకొని నాకుఁ జూపబెట్టెను.

అతనిదగు నప్పటి యా సముత్సుకతలో, ఒక అనంతమైన మహదాశయము దల చూపెను. మట్టమధ్యాహ్నము పండ్రెండు గంటలవేళ నాతఁడు నాకొకపూర్తికాసి స్ఫటిక శిలావేదిక నగపఱిచెను. 'ఆ వేది కెందు' కంటి. 'వెన్నెల రేయినిహాయిగ దంపతులుగూరుచుండి ముచ్చటలాడుకొనుట' కన్నాడు. నీళ్లురాని యొక కేళాకూళి నాతఁడుఁ ద్రిప్పఁజొచ్చె. 'నీళ్లు లేవే'యంటి. నే నొక యంత్రమునకై యమెరికా వ్రాసితి. నదివారమునాళ్లలో రాగలదు. అది వచ్చునంత దీన నమర్చి త్రిప్పితినా దీని వెంబడి బుస్సున నీరు పొంగివచ్చు. ఆనీటిక్రింద జలకేళి నవరింప వానజల్లు పైబడునట్లుండు. చూతుగాని' యని యనియె. ఇట్లే వేత్వేఱ నాతఁ డన్నియునాకుఁ జూపించు నాతనిచూపు

లలో ఒక అనంతమైన మహదాశయము బొడగట్టెను.

సాయంకాలము మూడుగంట లగువఱకట్లే తోటను దిరుగాడితిమి. అంతలో రెండు గుఱ్ఱపుబండ్లపై పదిపండ్రెండుగురు మగవాండ్రు ఆడువాండ్రు, పిల్లలు, పెద్దలు, వానివెనుక నాలుగుత్రొక్కుడుబండ్లపైనలుగురు యువకులు తోటలోనికి వచ్చి దిగిరి. వారిలో కొందఱు ముందు గబగబ రాఘవుని డాసి "రాఘవా! నీవు ప్రొద్దున్న యింటికి రాకపోవుటకు గారణమేమి. అమ్మప్రాణము తల్లడించి పోయినది. ఇదిగో యీగోధుమరొట్టెలను పుచ్చుకొని యీ పాలుత్రాగుము. నీ యాకలి నీవెఱుగకున్నావు, అదిగో మన బావగార్లు వచ్చినారు చూచితివా ?" అని యిరువురు యువకులను వానికిఁ జూపుచు వ్రేళ్లఁ జూపించిరి. రాఘవుఁడంతట ఆ గోధుమరొట్టెలను పాలనుఁ బుచ్చుకొనకుండఁగనే బావగార్ల కెదురుపోవుచు 'స్వాగతము! స్వాగతము! బావగార్లకు స్వాగతము!' అనితోటలోనికి వారినిఁ గొనివచ్చెను.

వారందఱిని జూచువెనుక రాఘవున కొక నూతనపుటూహ నెమ్మది నీరికెత్తె. అతఁడు తనలో నిట్లనుకొను. "ఎప్పుడీ తోటలోనికి వేసవేలుగ నా మిత్రులు విచ్చేతురు. ఎప్పటికీ తోట పూర్తియగు. ఎన్నటికి తోటలో దివ్యభవనము వినిర్మింపఁబడి పెద్ద 'జమీందారిపామేదా'గా నిది యెల్ల నిర్వహింపనగు." తిరిగి వితర్కించి పరిక్రమించి "ఆనాఁడు వచ్చిన చూచుకొందము. ఇప్పుడేల యున్నదనుభవింపరాదు" అని మఱిమఱి యోజించియిట్లు పిలుచు "మిత్రులారా! బావలారా! అక్కలారా! సోదరసోదరీమణులారా! అందఱికంటె మునుముందుగ సంబోధింపనగునో నాప్రియురాలా? మీ రందఱు తలఁపని తలంపుగ నొక్కమారు వచ్చుట నాకు పరమసంతోషముగ నున్నది. ఈరాత్రి నిక్కడ హాయిగ గడుపుదము.

ఒక్క నిమేసములో పట్టణమునకుఁ బంపి బంగాళాదుంపలు, ఉల్లిపాయలు, పచ్చిమిఱపకాయలు, సెనగపప్పు, గోధుమపిండి,ఏలకులు, పాలు, పంచదార, బియ్యము, కూరలు తెప్పించెద. ఈరాత్రి మన మిక్కడుండిపోయి విందారగింతము. ఈనేళ పున్నమి. సాయంకాలము మొదలు తెల్లవాఱువఱకు పుచ్చపువ్వులు లాగు వెన్నెల కాయగలదు. మన కిక్కడ చల్లనిగాలి వీచును." అని బిగ్గఱగా వారికందఱికి నచ్చజెప్పి వారి నందఱి నందుల కియ్యకొల్పెను.

రాఘవునిభార్య వంట సేయుటయం దతి నేర్పరి. ఆమెయు నామె యాడుపడుచులును కలిసి నిమేసములో వలసిన వంటనంతను వండి వడ్డించిరి. రాత్రి తొమ్మిదిగంటలకు మేమందఱమును భోజనములు చేసితిమి. వెల్లడియైన పండువెన్నెల నాఁటి రేసమ్మహోత్సవము మహానందమును బొట పాడించినది. వారి కందఱికి నేనొకింత క్రొత్తవాఁడనయ్యు భోజన మగుసరికి ప్రాఁతచుట్టమనైతి.

రాఘవుఁ డాకాలమంతయు మాతోడనే యాడుచుఁ బాడుచు కుడుచుచు నడుచుచు వెళ్లుచుచున్నను లోలో నిట్లనియులివు నధిగమించు "ఈతోటలో నేననుకొన్న బంగాళా తయారైనవెనుక యీ విందు జరిగియున్న యేమిసొంపుగ నుండియుండెడిది. ఈ తోటలో నేను మేలేర్చితెచ్చిన మామిడిచెట్లు కాసిన వెనుక నీవిందుజరిగియున్న నెంత బాగుండెడిది" అని చర్చించు. నడుమలో సగము సగము తయారగుచున్న కాలువగట్టు పచ్చిపాలగచ్చు కాలికి తగులునంత తనకాలు నొచ్చుముందు, ఆకాలువకట్టున కేమి మోసము వాటిల్లెనో యని మనఁబు నొవ్వనఁ జివుక్కు మను. తక్కుంగల మేమందఱమును పెఱచింత లేక యెవరిమట్టుకు వారము హాయిగఁ గడపితిమి. 'సోదరా! వచ్చి మాతోఁ గూరుచుందూ' అన్న అతఁ డేమిచేసె. "ఈతోట వెన్నెలరాత్రి నిదివఱకు జూచియుండలేదు. ఎన్ని పర్యాయము లీవఱకు జూచినను, పట్టపగలు చూడడమే యైనది. రాత్రివేళమన మీతోటకే పైనివచ్చుచో, మనమీతోట నెట్లుంచవలయునో, ఏచెట్లెక్కడున్న బాగుండునో, అవన్నియుఁ జూడవలెననుచు రాఘవుడు తోట యంతర్భాగమునకుఁ జొఱుచుకొని వెళ్లెను.

ఆతని వెనువెంట నాతని ప్రియురాలు మెల్లమెల్లనఁ జనియె.

రాఘవుడు—రావద్దు నీవు.

ఆమె—ఏమి?

రాఘవుడు—చీఁకటి.

ఆమె—చీఁకటి కనుక నే వచ్చుచుంటి.

రాఘవుఁడు— నే నొంటరిగ నాలోచించుకొనవలెను.

ఆమె— మీరొక్క రాలోచించరాదనియే.

ఆమె రాఘవునితో అట్లేచర్చించుచుఁ దఱిమికొని వెన్నడిగ్గ జనియె. తోటలోపలి భాగమునకుఁ జనిచని యచ్చోనొక్క వర్షపు



జాలున నేర్పడ్డ రమ్యసికతాతలంబుపై వారిరువురును సుఖాసీనులైరి.

మేమందఱమును నెవరిమట్టుకు వారలము హాయిగ నిదురబోయి యుదయముననే మేలుకొంటిమి. మేలుకొని తిరిగి రాఘవుని కలసికొని యింటికి వచ్చుచు "మీ తోటలో

మిక్కిలిహాయిగా రాత్రి నిద్రపట్టింది సుమా" అని నేనంటి. రాఘవుఁడు దానికి "నాకు కునుకు పట్టలేదు. నాప్రియురాలునన్ను నిదుర పొందని పురికొల్పినను ఆమెవాక్యములు నాకు రుచించినవికావు. ప్రకాశమానమైన చంద్రుని గప్పివైచి నడికిరేయి పెద్దమేఘ మొకటి క్రమ్ము కొనివచ్చినది. మిమ్ములను లేపవలెనని గమ కించితి కాని యూఱకొంటి. నాకు మనంబు పరిపరివిధముల పోయినది. మేము మాతల్లితో రాత్రి ఇక్కడుండిపోదు మని చెప్పియుండలేదు. ఆమె మనంబు మాకై యెంత తల్లడిల్లి యుం డునో. ఆమె నింట నొంటరిగ విడిచి వచ్చితిమి." అని బొమ్మకలికాతరళాయత లోచనుండగుచు నాతో నింకను నుడివె. "చూచితివా! మిత్ర మా! మానాన్నగారె కనుక బ్రతికియుండెనా, నేనిప్ప డెంత స్వేచ్ఛగ, నెంతవిచ్చలవిడిగ, నెంత యిష్టమువచ్చిన ట్లెంతసౌఖ్యముగ నా జీవన మును గడపియుందు"నని—ఆహా టనునప్పటి కెక్క డుంటిమి? మార్గమధ్యమున "ఘాటీ" వద్ద ప్రవహించు చిన్ని యూటకాలువ నొప్పా వం తెనకడ.

---

# కవితా కళ్యాణము

కొడాలి ఆంజనేయులుగారు

౧

పూప జాబిలి రేక బొట్టుబెట్టితిని
    మెఱుఁగు తీగెలదండ లఱుతవైచితిని
లేతవెన్నల మేనపూత బూసితిని
చిఱుమంచు పన్నీరు చిలుకరించితిని

౨

తొలకరి మబ్బుల చలువ పందిళ్ల
నెమ్మికన్నెలు జేరి నృత్యముల్ చేసె
తొలిసంజ యిగురుల తోరణమ్ములకు
పరభృతాంగన వచ్చి పాటలు పాడె.

౩

కడుపార నమృతమ్ము కన్నట్టి తండ్రి
ఆకాశపథముల నంటు హస్తముల
ముత్యాల యక్షతల్ పోసి దీవించె
కవితాకుమారికి కల్యాణమయ్యె.

---

# 'ఈ యపరాధము నీదికాదు'

౧

"నాన్నా! అమ్మ యింకా రావట్లేదేమిటి?" అని కమల యడుగు పరికి వెంకటప్పయ్యగారికి గన్నుల నీరు గిఱ్ఱున దిరిగెను. అప్పటికి రెండునెలలైనను కమలకు దల్లి యింకను మఱపునకు రాలేదు. కాని తల్లి లేనికొఱత కనబడకుండ పార్వతమ్మ మేనకోడలిని సంరక్షించుచు వెంకటప్పయ్యగారి యింటిలో నే యుండెను.

భర్త గతించినను దన యేకపుత్రుని మీదనె పంచప్రాణములుంచుకొని పార్వతమ్మ తన యత్తగారితో గూడ కమలాపురమునందే తన స్వగృహమున నుండెను. కాని దైవవశమున విషజ్వరపీడితులై ముదుసలియైన యత్తయు నైదేండ్లయీడు గల కుమారుడును గూడ మృత్యువాత బడుటంజేసి పార్వతమ్మ గత్యంతరము లేక సోదరుడైన వెంకటప్పయ్యగారి యిలు సేరి మాతృహీనయైన కమలను దన సర్వస్వముగా భావించి పోషించుచుండెను.

వెంకటప్పయ్యగారికి, భార్యవియోగమునకు దోడు, లేక లేక తన వయఃపరిణతికాలమున జనించిన కమలా పోషణభారము దుర్భరమయ్యెడిది. కాని పార్వతమ్మ యాదరణము వెంకటప్పయ్యగారికి కమూల్యసాహాయ్య కారిగనుండెను. మఱియు వెంకటప్పయ్యగారి కామె యందు ప్రథమమునుండియు భక్తివిశ్వాసములు గలవు. కావున పార్వతమ్మను వారు దెక్కుడనురాగముతోనే చూచుచుండెను. తల్లి లేని బిడ్డయైన కమలను సాకుట పార్వతమ్మకును విధియగుటయుగాక యాసహజదయార్ద్రహృదయమున మఱింత వాత్సల్య మొదవించెను.

వెంకటప్పయ్యగారికి స్వగ్రామమైన తెనాలి తాలూకా శ్రీరామపురమునందు సాలునకై దాఱువందల రూప్యముల యాదాయము వచ్చు భూవసతి గలదు. ఒక మంచి భవనము, గొడ్డు గోద కలదు. కాని యిటీవల భార్యావియోగము దటస్థమైనను మఱల ద్వితీయ వివాహము చేసికొన దలపెట్టలేదు. యిప్పటికే యేబదియైదేండ్లు వచ్చెను. మఱల వివాహమాడి యాపిల్ల కాపురమునకు వచ్చుపరికి దనకు షష్టిపూర్తి మహోత్సవకాల మించుమించుగా సమీపింప గలదనియు, వట్టివార్ధకమున దటస్థమగు క్రొత్తకాపురమువలన నెవరికిని సౌఖ్యము సేకూఱజాలదనియు భావించి వివాహమాడ నిశ్చయింపలేదు. తన యక్కగారి సాహాయ్యము లభింపకున్నచో నింత గంజికాచిపోయుట కైన నుపకరించునని పెండ్లాడెడివాడేమో కాని పార్వతమ్మ సంసారము చితికి వీని పాలిటనే పడుటచేత నట్టితలంపే లేకుండెను.

౨

కమలమ్మ చాలచురుకైన తెలివిగల పిల్ల. ఎనిమిదవయేడు సరిగా వచ్చినదో లేదో యప్పటికే యాఱవతరగతి చదువుచుండెను. ఉపాధ్యాయుడు ప్రశ్నయడుగుటయే తడవుగా నందరికంటె ముందుగా కమలయే సమాధానము చెప్పుచుండును. తోడిబాలికలు కమలమ్మ స్నేహము కాంక్షించి తమకు దెలియని పాఠములను కమలచేత జెప్పించుకొందురు. మఱికొందఱు బాలికల కసూయగా నుండుటచేత కమలను మాఱుపేరుతో నపహసించుచుందురు. 'కమలాఫల' మన్న కమల యుడుకుచుండును. ఒకనాడు పంతులుగారికి 'రిపోర్టు' కూడ జేసెనుగాని పంతులుగారు వారిని శిక్షింపక "కమలాఫల" మన్న దప్పేమి? యని వారు గూడ హాస్యమొనరించిరి. నాటినుండి తోడిబాలికలే గాక పంతులుగారు గూడ 'కమలాఫలమా! పాఠము వచ్చినదా?' యని యడుగ సాగిరి. కమలయనిన పంతులుగారికిని మిగుల ప్రేమ యగుటచేత నొకప్పుడు కోపమును మఱియొకప్పుడు నవ్వును దెప్పించి ముసియుచుందురు.

'అష్టవర్షా భవేత్కన్యా' యను శ్లోకానుసార
ముగ కన్యాదానఫల మబ్బవలెనని వెంకటప్పయ్యగారు
వచిన సంబంధములు విచారింప నారంభించిరి. తల్లిలేని
పిల్లయని యొక్కడు గారాబముతో పెంచుచు, వెంకట
ప్పయ్యగారు దనసర్వస్వమిమ్మరైన నింతగొప్ప కట్న
మిచ్చి మంచిసంబంధమును దేవలెనని యాపార్శ్వికులు
చెవుకుచుండిరి. ఒకటిరెండు సంబంధములు వెంకటప్ప
య్యగారికి నచ్చినవికాని పార్వతమ్మకు మాత్రము వరు
డు నల్లనివాడనియో, గొప్పసంపదలు లేవనియో మనస్సు
కుదిరెడిది కాదు. ఎనిమిదవయేడు గడచక పూర్వమే
వివాహ మొనరింపగలయు నని వెంకటప్పయ్యగారు శత
విధముల ప్రయత్నములు సలుపుచున్నారు. గాని దైవ
ఘటనమింకను దెలియనయ్యెను.

వార్తాపత్రికలలో దఱచుగ "వధువుకావలెను"
"వరుడు కావలెను" అను ప్రకటనలు ప్రచురింపబడు
చున్నవి కుగ్రామవాసియైన వెంకటప్పయ్యగారి దృష్టిప
థమున కివి రావయ్యెను. శ్రీరామపురమున నొకపఠనా
లయము గలదు. అందు దేశోద్ధారక నాగేశ్వరరావు
పంతులుగా రుదారచిత్తులై యుచితముగ బంపుచున్న
దినపత్రికయు, భారతియు, కృష్ణాపత్రిక, సమదర్శిని,
మున్నగు మఱికొన్ని పత్రికలును వచ్చుచుండును. పత్రి
కాపఠనాభ్యాసములేని వెంకటప్పయ్యగారికి మాత్ర
మేమియు ప్రయోజనము లేకుండెను.

## 3

సాయంకాల మైదుగంటలగుసరికి రాజమహేంద్ర
వరములోని యున్నతపాఠశాలా విద్యార్థులు గొందఱు
టకటక శబ్దములతో మేడమెట్లను దిగుచు గుం
పులు గుంపులుగా వచ్చుచుండిరి. వారిలో గొందఱు
'టెన్నిస్, క్రికెట్' మొదలగు ఖేలనముల కుత్సాహ
ముతో నేగుచుండిరి. మఱికొందఱు గృహోన్ముఖులై
వెడలుచుండిరి. వారిలో స్ఫురద్రూపియు, వినయమూ
ర్తియు నగు రామారావు పుస్తకములను జేబూని యొం
టరిగ బోవుచు దన్నెవరో పలుకరింప సమీపించుచు
న్నట్లు గ్రహించి గమనవేగమును దగ్గించెను. అంత నా
పెద్దమనుష్యుడు:—

"అబ్బాయీ! మీదేయూరు?"

"మాది ధవళేశ్వరమునకు గొంచెముదూరమున గల
సీతానగరము."

"మీయింటిపేరు?"

"విస్సాప్రగడవారు."

"ఇచ్చట మీ తలిదండ్రులతో గూడ వచ్చి చదు
వుకొనుచున్నారా?"

"లేదు. మా తలిదండ్రులు సీతానగరములోనే
యున్నారు. నేనుమాత్రము వచ్చి యిచ్చట 'స్కూల్
ఫైనలు' చదువుకొనుచున్నాను."

"మీకు వివాహమైనదా?"

"కాలేదండి"

అని రామారావు గుండువారి వీధినుండి పోవుచుం
డెను. వెంకటప్పయ్యగారు వెనుకకు దిగిరి. మఱునాడు
పదిగంటలకే యశోదమ్మబస (హోటలు)లో భోజనము
చేసి వెంకటప్పయ్యగారొక గుఱ్ఱపుబండిమీద ధవళేశ్వ
రమునకు వచ్చి యచట నొకపడవమీదనెక్కి మూడుపా
వలాలిచ్చి తెల్లవారుజాము 4½ గంటలకు సీతానగరము
రేవులో దిగిరి. అప్పటికింకను జీకటిగా నుండుటచేత
గట్టుమీద దైయుత్తరీయమును బఱచుకొని తలక్రింద
దిండుగా రైలుసంచి నమర్చుకొని కొంత విశ్రమించిరి.
నల్లులబాధచే దెల్లవారులు పడవలో నిదురలేకపోయి
నను మనస్సులో నాందోళన మెక్కుడగుటచే గాబోలు
వెంకటప్పయ్య గారి కిప్పుడును నిదురబట్టినదికాదు. అం
తలో దూర్పురేఖలు గనబడుటచే వెంటనేలేచి కాల
కృత్యములు దీర్చుకొని, నదిలో స్నానముజేసి యూర్ధ్వ
శార్థకేదిక సంధ్యాద్యుపాసనములతోపాటు తనయిష్ట
దేవప్రార్థనము గావించుకొని రైలుసంచిలోని నేలం
పట్టంచుధోవతిని ధరించి యట్టిదే మఱియొక యుత్తరీయ
మును పేటేలుదీర్చి పైనవేసికొని, చెట్టుకొమ్మల కార
గట్టిన యంగవస్త్రము పొడిగానున్నను దీసి సంచిలో

రోపి ప్రయాణముసాగించి ౪ గంటలకు సీతానగరము చేరిరి.

## ౪

“ఘోరుఘోరములో నున్నపుడే మావానికి నాలుగు వేలు కట్నమిచ్చెదమని చాలసంబంధములు వచ్చిన వంకి. ఇప్పుడు స్కూలుఫైనలు చదువుచున్నాడు” అని లక్ష్మీనారాయణగారనిరి. వెంకటప్పయ్యగారికి నాల్గు వేలు కట్నమైనచో నెట్లయిన నంగీకరింపవలెనని యున్నది. కాని లక్ష్మీనారాయణగారు సందిచ్చుటలేదు. లక్ష్మీనారాయణగారికి రామారావొక్కడే కుమారుడు. కొబ్బరితోటలమీదను, పనసతోటమీదను లక్ష్మీనారాయణగారికి సాలున కేడెనిమిదివేలు వచ్చుచుండును. ఈయాస్తియంతయు వీరి స్వార్జితమె. లక్ష్మీనారాయణగారు ప్రతిసంవత్సరమును దప్పక కాశీ, గయ, ప్రయాగ, మున్నగు పుణ్యక్షేత్రములకు బోవుచు మూడునాలుగు నెలలందేయుండి మరల నింటికి వచ్చుచుందురు. యాత్రలవలన ధనవ్యయమగుటయు మరియు లక్ష్మీనారాయణగారికి ధనసంపాదన మధికమయ్యెను. స్థిరమైనవసతి యేర్పడుటచేతను, నేత్రములకు గొంచెము జబ్బుగలిగి దృష్టిలోప మొదవుటచేతను రెండుమూడు సంవత్సరములనుండి యిల్లువిడుచుట మానిరి.

“అక్కయ్యగారూ! బావగారు సెలవిచ్చినట్లు నాలుగువేల కట్నమిచ్చెదను. కన్యాదానఫలము దక్కునట్లు రాగల మాఘమాసములో వివాహము జరిగింపవలెనని యున్నది. నాకు కుమారుడయినను కుమార్తెయైనను మా కమలమ్మ యొక్కతియే. దయచేసి యంగీకరింప గోరుచున్నా”నని వెంకటప్పయ్యగారు దీనముగా మనవి చేసిరి. మహాలక్ష్మమ్మ తలయూచునట్లే యున్నది కాని లక్ష్మీనారాయణ యందుకొని—“అబ్బో! ఆడవాళ్ల నడిగి యీయదలచుకొంటె మీ రీయనే లేరు. వేయి మాటలెందుకు గాని కట్నమైదువేలు. వెండిచెంబులు పట్టుపంచెలుమున్నగు లాంఛనములు, రానుపోను ప్రయాణవ్యయములు మున్నగువాని కొకవేయి యీయగలిగిన మాతో మాట్లాడుడు. లేకున్న నొక నమస్కార” మని లక్ష్మీనారాయణగారు లేచి పనియున్నట్లు ముంగిటగల పనసతోటలోనికి వెళ్లిరి.

## ౫

వెంకటప్పయ్యగారికి యైదువేలన్నా, వివాహవ్యయములకు గనీసము మరినాలుగువేలను మొత్తము పదివేలెట్లు దెత్తునా యని గుండెలలో రాయిపడెను. వరుని ముఖవర్చస్సు, తెలివితేటలు గలచిన సంబంధము వదులుకొనుట కిష్టము లేదు. ఫాల్గుణమాసముతో నెని మిదవయేడు దాటును. గనుక కన్యాదానఫలము దక్కించుకొనుటకై కాలహరణమొనరింప వీలులేదు. కావున యోచించియోచించి తుదకు సమ్మతించిరి. ఆమరునాడే లక్ష్మీనారాయణగారు ‘ప్రధానము’నకై వెంకటప్పయ్యగారితో గూడ బైలుదేరి గోదావరిస్టేషనులో రైలెక్కి తెనాలిలోదిగి శ్రీరామపురము వచ్చిరి. ఆ సాయంకాలమె ‘ప్రధానము’ జరిగెను, సుమూహూర్తము నిశ్చయింపబడెను.

వెంకటప్పయ్యగారు గొప్పసంబంధము లభించెనని, బిడ్డకు వేడుకలు జరుగవలయునని మిక్కిలియుత్సాహముతో వివాహము చేయుచుండిరి. గాని నైదువందలరూప్యముల నగలుమాత్రమే తెచ్చిరని పార్వతమ్మకు కసుపుగా నుండెను. కన్యాదానము చేయువారు నగలగురించి నిష్కర్ష చేయగూడదని వెంకటప్పయ్యగారు మాట్లాడకుండిరి. పెండ్లి జరుగుచున్నది. ముత్తైదువలు, వరుసపాటలు, తలుపుదగ్గఱ పాటలు, బంతులాటలు, బూజముబంతులు మున్నగు వేడుకలు జరిగించుచుండిరి. రెండవదినమున గాబోలు పేరంటాండ్రు వధూవరుల పేర్లు చెప్పింపవలెనని పట్టుబట్టిరి. కమలమ్మ పెండ్లియని తోడి బడిబాలిక లుత్సాహముతో వచ్చి కొందఱు పెండ్లికూతురు పక్షమునను, మఱికొందఱు పెండ్లికొడుకు పక్షమునను నిలిచి వాదింపసాగిరి. “కమలా” యనుటకు వరుడును, “రామారావుగారూ” అనుటకు వధువును సిగ్గుపడుచు మిన్నకుండిరి. “కమలమ్మ” యనలేనిచో “గములాఫల” మని యైన ననరాదా యని యొక కొంటె పిల్ల చాటునుండి బిగ్గరగ ననెను. వెంటనే మఱియొక

# కామినియా నూనె

వేనకు వేల కుటుంబములయందు ఉపయోగింపబడుచున్నది

## ఎందుకు?




కామినియా నూనె

వెండ్రుకలు ఊడిపోవుటను ఆటంకపరచును.

కామినియా నూనె

తలను చుండు లేక నుంచును.

కామినియా నూనె

తలకు చల్లదనమును గలిగించును.

కామినియా నూనె

తలకు సంబంధించిన వ్యాధు లన్నిటిని కుదుర్చును. ఉష్ణముగా నున్న ప్రకృతికి చల్లదనమును గలిగించును.

కామినియా నూనె

యందు వెండ్రుకలు పెరుగుట కవసరమైన వస్తువులు, మెదడుకు కావలసిన అమూల్యవస్తువులు గలవు.

కామినియా నూనె మనోహరమైనట్టియు ఆహ్లాదకరమైన సువాసనగలది.

కామినియా నూనె శిరోజములకు ప్రాణము. ఇట్టి సుగుణము లుండుటవలననే వేలకొలది కుటుంబము లందు కామినియా నూనె ఎక్కువగా వాడబడుచున్నది.

కామినియా నూనెను ఉపయోగించునట్టివారు గనుకనే దీనిని "శిరోజములకు ప్రాణ మని" దీని యందు గల లాభకారియైన సుగుణములను బట్టి తెలుపుచున్నారు.

బుడ్డి 1 కి ధర రు. 1. వి. పి. ఖర్చులు అ. 6. ప్రత్యేకము.

బుడ్లు 3 కి ధర రు. 2-10-0. వి. పి. ఖర్చులు 0-12-0. ప్రత్యేకము.

అత్తరులకు రాజైన

## ఓటో దిల్ బహార్ (రిజిష్టరుబడి)



హిందూదేశమం దంతటను దీనికి గల ఎడతెగని అత్యధిక అమ్మకమే దీనికి గల అసాధారణమైన శ్రేష్ఠత్వమును రుజువుచేయుచున్నది. కొన్ని బొట్లు చేతి రుమాలపైన చల్లిన సీమపువ్వులు, మల్లెపువ్వుల వాసనవలె మనోహరమైన దీర్ఘ సువాసనను గలిగించుచున్నది.

$\frac{1}{2}$ ఔ. బుడ్డి 1 కి రు. 2. $\frac{1}{4}$ ఔ. రు. 1-4-0. 1 డ్రా. 0-12-0.

వి. పి. ఖర్చులు అణాలు 6 ప్రత్యేకము.

2 అణాలు తపాలబిళ్ళలు పంపిన శాంపిల్ బుడ్డి పంపబడును.

కామినియానూనె ఓటోదిల్ బహారు సుప్రసిద్ధమైన స్టోరు లన్నిటియందును దొరకును.

## ఆంగ్లో ఇండియన్ డ్రగ్ అండ్ కెమికల్ కంపెనీ.

తపాలపెట్టె నెం. 2)32. బొంబాయి నెం. 2.

పిల్ల—"కమలాఫలమంటే రామాఫలమవలేరూ?" అని యెత్తిపాడెను. తక్కింగల ముత్తైదువుల కిది మొదట బోధపడినదికాదు. కాని తరువాత కమలాఫలమంటె కమల యొడుకనని తెలిసినది. ఈమాట పెండ్లికొడుకునకును దెలిసినది. వెంటనే యతడు 'కమలాఫల' మని పేరుచెప్పెను. కమలకు కోపముగలిగి 'రామాఫల' మని మాఱుపలికెను. ఆనాడు వధూవరులపేర్లిట్లు చెప్పబడినవి.

మూడవదినమున 'పదస్యకట్న' మని లక్ష్మీనారాయణగారు కొంత గుంజుకొనిరి. నాలుగవ దినమునందు మఱల కొంత 'యలకకట్నము' రావలెనని పట్టుబట్టిరి. వెంకటప్పయ్యగారనేకవిధముల జెప్పిరి. పెద్దమనుష్యులచే జెప్పించిరి. కాని లక్ష్మీనారాయణగారు పట్టిన పట్టు విడువరైరి. మొదటి కట్నములో సగమువఱకైన నీ యలకకట్నము క్రింద రావలెనని భీష్మించుకొని కూర్చుండిరి. వెంకటప్పయ్యగారికి గర్తవ్యము తోపకుండెను. అంత పెండ్లికివచ్చిన పెద్ద లేదో యొకవిధముగ గొంత సమర్పింప జేసిరి. కాని, లక్ష్మీనారాయణగారికి మాత్రము తృప్తి గలుగలేదు. ఎడమొగములు పెడమొగములతోనే మిగిలిన కార్యక్రమము జరిగిపోయెను.

౬

రామారావు క్రమముగ స్కూలుఫైనలు ఇంటర్మీడియేటు తరగతులందు కృతార్థుడై యిప్పుడు బి. ఏ. చదువుచున్న విద్యావంతుడేగాని తండ్రి గీచిన గీటును మాత్రము దాటజాలడు. కట్నంలో సగమువంతను రెండువేలయైదువందలు తప్పక 'యలకకట్నము' క్రింద దనకు రావలెననియు,నంతవఱకు నత్తవారిగడప ద్రొక్క వలదనియు లక్ష్మీనారాయణ శాసించెను. 'నాయాజ్ఞ దాటినచో నా యాస్తిలో జిల్లిగవ్వయైన నీకు బ్రాప్తింప' దని బెదరించుటయగాక యతడు దీర్ఘ కోపియు, మూర్ఖస్వభావుడు నగుటచేత దన ప్రస్తుత విద్యకే భంగము వచ్చునేమోయని రామారావు తండ్రి యాజ్ఞకు బద్ధుడైయుండెను. తండ్రి మనోతత్వమాతడు బాగుగ నెఱుంగును.

పండుగలకని పబ్బములకని వెంకటప్పయ్యగారైదాఱుసారులు సీతానగరము వచ్చి యల్లుని దీసికొని పోవ బ్రయత్నించిరి. కాని విఫలమనోరథులై వచ్చిన దారినే వెడలవలసిన వారైరి.

రామారావు పట్టపరీక్షయందు కృతార్థుడై యొకనాడు సీతానగరములో స్వగృహమున 'మదరాస్ మేల్' పేపరు చదువుకొనుచుండ నొక యుత్తరము వచ్చెను. అందు "నాకు జాల జబ్బుగా నున్నది. కడ సారిమాపు జూచుటకైన రాగోరుచున్నాను." అను వాక్యములను జదివి తత్తఱిల్లి వెంటనే తండ్రిని బిలిచి "నాన్నా! మా మామగారికి జబ్బుగానున్నదట." యని జాబు చేతి కిచ్చెను. లక్ష్మీనారాయణ యా జాబును జూచి—"అబ్బో! ఈ వ్రాతలు వారికి మామూలె. ఇట్టివి నీ కెన్ని జాబులు చూపించేది" యని యొక వెడ నవ్వునవ్వి—"రామూ! రెండునెల లోపికపట్టుము. మన రెండువేలైదువందలు వడ్డితోసహా యూడిపడు" నని యొక్కడికో వెళ్లెను.

రామారావు నిజమే యనుకొనెనుగాని తెలిసికొందమని యొక కార్డును దీసి మామగారికి వ్రాయ నారంభించెను. వెంకటప్పయ్యగారికి ఇంగ్లీషు దెలియదని తెలుగుతోనే వ్రాసి తోటమాలికిచ్చి పోస్టులో వేయ బంపెను. ఆ కార్డును దీసికొని రంగడు కొంతదూర మేగుసరికి లక్ష్మీనారాయణ యెదురువచ్చి యాకార్డును దాను పోస్టులో వేసెదనని చెప్పి రంగని వేఱొక పని మీద బంపెను.

అయిదాఱు దినములవఱకు దన జాబునకు జవాబు రాకుండుటచేత దండ్రిమాట నిజమే యనుకొని రామారావు బి. యల్. చదువుకొనుటకై చెన్నపట్టణమునకు బ్రయాణము కట్టెను. లాకాలేజిలో బ్రవేశించుట కింకను రెండుమూడు దినములు వ్యవధియుండుట నెఱింగినవాడగుటచే లక్ష్మీనారాయణ 'రేపుమాపు'నిజరుపుచుండెను. అత్తవారింటికి కేగునని భయముగాబోలతనికి!

ఇక వ్యవధిలేదని రామారావు తన ట్రంకు, పరుపు దీసికొని రాజమహేంద్రవరము వచ్చి గోదావరి

స్టేషనులో రైలెక్కి మద్రాసునకు బోవుచుండెను. బెజవాడకు వచ్చుసరికి మామగారి సంగతి దెలిసికొన గోర్కి పుట్టెను. తండ్రిగారి యాజ్ఞకు వ్యతిరేకమైనను నెట్లయిన శ్రీరామపురము బోవ నిశ్చయించుకొనెను. కమల కప్పటికి బదునాలవయేడు వచ్చియుండునని మనసులోనె లెక్కించుకొనెను. అంతలో రైలు తెనాలి స్టేషనుకు వచ్చినది. రామారావు వెంటనే దిగి ప్లాటుఫారముమీదనున్న 'హోటలు'నకు సామానును బట్టించుకొని పోయి యందే భోజనమునుజేసి కొంత విశ్రాంతి దీసికొని, యక్కడివారికి (హోటలు యజమానునకు) సామాను నొప్పగించి తానుమాత్రము సాయంకాల మైదు గంటలకు శ్రీరామపురము జేరుకొనెను.

కాని పెండ్లికి దప్ప మఱల వచ్చినవాడుగా నుండుటచేత నిల్లు గుర్తింపలేక, యొకయింటి ముంగిట గూర్చుండి ప్రత్తిలోని గింజలను దీసివేయుచున్న యొక వితంతు బ్రాహ్మణినిగాంచి 'వెంకటప్పయ్యగారి యిల్లేదండి' యని యడిగెను. ఆమె యింటిచాయ జూపుచు—"ఆ కూర్చుండినది వారి కుమార్తెయె" యని చెప్పెను. రామారావు మఱేమియు నడుగక యా యింటిచాయ కేసి వచ్చుచుండెను.

శ్రీరామపురమున కొకమైలు దూరమున గల మఱియొక గ్రామమునుండి కొందరు విద్యార్థులు చదువుకొనుటకై తెనాలికి బోవుచు వచ్చుచుందురు. ఆ యువకులు వచ్చునప్పుడును బోవునప్పుడును మిగుల దుడుకుదనముతో బ్రవర్తించు వారగుటచేత వీరనిన గమలకు మిగుల భయము. వారిలో నొకడు మిగుల దుష్టుడు. ఆనాడు దమయింటి వైపుగ వచ్చుచున్నది వాడేయని కమల భయపడినది. పార్వతమ్మ యప్పుడే మంచినీళ్లకై కాలువకు బోయెను. వెంకటప్పయ్యగారు దమ రుగ్మత నుండి మెల్లగ దేరుకొని యౌషధమునకై కొంచెము దూరమున నున్న వెంకటాచారిగారి యింటి కేగిరి. ఇంటిలో మఱెవ్వరును లేరు. కమలమాత్రము వీధి వసారా యరుగుమీద గూర్చుండి దారముతో జేతిరుమాలు నల్లుకొనుచుండెను.

రామారావు సమీపించుట గాంచి కమల మొగ మావలవైపునకు ద్రిప్పి తన యల్లికయందే దృష్టినుంచెను. అంత రామారావు—

"కమలా! క్షేమమా! నిన్నుజూచుటకే వచ్చినాను." అని మందహాసముతో బలుకరించెను. కమలకు భయముతో నొడలెల్ల గంపించెను. ఏమనుటకును నోరాడలేదు. ఎట్టనో ధైర్యము దెచ్చుకొని-ఛీ – అవతలకు బొమ్ము అనెను.

'ఆ_పోయి' అని రామారా వనిన వెంటనే— "పోయి గోదావరిలో దిగు"మని చివాలున నింటిలోనికేగి తిట్టుచు తలుపును గభాలున వేసికొనెను.

రామారా వీపరాభవమును సహింప జాలక పోయెను. మొదట దన్ను గుర్తించెనో లేదో యనుకొనెనుగాని గోదావరిలో దిగు మనుటచేత దప్పక తన్ను గుర్తించియే యట్లు తూలనాడెనని యనుకొనెను. ఆ క్షణముననే తన తండ్రిగారు చెప్పిడి మాటలు స్మరణకు వచ్చెను. తనతో జెప్పకుండ మోహావేశమున దన కుమారు డెప్పుడైన నత్తవారింటి కేగునేమోయనియు, నట్లేగినచో మామయల్లుండ్రేకమగుదురనియు, నందుచేత నలకట్నముక్రింద రావలసిన రెండువేలయైదు వందలు రాదేమోయనియు నెంచి లక్ష్మీనారాయణ దన కుమారునితో నప్పుడప్పుడు కోడలు గడుసుదనియు, వసరుబోతనియు, నింక నేమెమో చెప్పి రామారావు మనసు విఱుచ జూచెను. రామారావు మనస్సప్పుడు విఱుగలేదుగాని దురదృష్టవశమున నేడు జరిగిన సంభాషణవలన గమల యెడ సంశయచిత్తుడై విఱిగినమనసుతో స్టేషనుకై తెనాలిమార్గము బట్టెను. తన హృదయమునందువలె నలుదిక్కులను గాఢాంధకార మలముకొనెను. రామారావు స్టేషను జేరుసరికి దన ధూమపరంపరలచే నాకాశమును మలింతనల్లగ జేయుచు ధూమశకటమును స్టేషను జేరికొనెను. ఆ యాత్రక్షణముననే రామారావు చెన్నపురాభిముఖుడై పోవుచుండెను.

౨

వెంకటప్పయ్యగారికి వ్యాధి దిరగబెట్టినందున దానితోనే వారి జీవయాత్ర ముగిసెను. కమల పెండ్లికై

తెచ్చిన యాఱువేల ఋణమునకు వడ్డీకివడ్డీతో పెంచి ఋణదాతలు వెంకటప్పయ్యగారి యిల్లువాకిలి, గొడ్డు గోదము, పొలముపుట్ర మొదలైన యావదాస్తిని స్వాధీన మొనరించుకొనిరి. ఇక కమలా పార్వతమ్మల జీవితము గడచు టెట్లు!

వెంకటప్పయ్యగారి మరణవార్త లక్ష్మీనారాయణగారికి జేరినదో లేదో కాని సీతానగరమునుండి యెవ్వరును రాలేదు. రామారావు మదరాసు ప్రవేశించిన పిమ్మట లక్ష్మీనారాయణ పత్నీయుతముగ సీతానగరము నుండి వెడలి మఱియొక గ్రామములో గాపురముండెను. అందుచే గాబోలు వెంకటప్పయ్యగారి మరణవార్త వీరికి జేరలేదు.

పార్వతమ్మయాస్తి విక్రయించుట వలన నొక సంవత్సరము గడచెనుగాని యిక గడచుట దుస్తర మయ్యెను. మఱియు నింత వాహినితో జీవించిన వెంకటప్పయ్యగారి కుటుంబము వారిప్పుడన్నాతురులై గ్రుస్సను, బూవులమ్మిన యూరనె కట్టెలమ్ముకొనుటవలె నీచజీవనము దుర్భరముగ దోచెను. పాపము! పార్వతమ్మ యేమి చేయగలదు! అల్లారుముద్దుగ బెంపబడిన కమలయే! లుబ్ధాగ్రేసర చక్రవర్తియని యెఱుంగక, ధనాఢ్యులని యాసించి, యెవరి సౌఖ్యమునకై తాను ఋణములపాలగుటకేని సమ్మతించి యిట్టి సంబంధమును దెచ్చెనో యట్టి కమల కిప్పుడన్నోదకములే కఱవయ్యెగదా! యని పరితపించి పార్వతమ్మ చిక్కి సగమయ్యెను. విద్యావతియు, గుణవతియునగు కమల విచారమును గుఱించి వేఱ చెప్పనేల!

కమలను వెంటదీసికొనిపోయి యత్తవారింట దిగవిడువ జూచెనుగాని రామారావు కలకత్తాలోనో, చెన్నపట్టణములోనో యింకను జదువుకొనుచుండె ననియు, నత్తమామలకడ నుంచిన గడుపునిండ గూడైన దొరకదనియు పార్వతమ్మకు దెలిసెను. రామారావును దామన్వేషింప జాలమనియు, నెప్పటికైన దైవానుగ్రహమున్నచో నాతడే వచ్చుననియు పార్వతమ్మ తలంచెను. కాని శ్రీరామపురములో గాలము గడపుట దుస్తరమగుటచేతను, నం దాప్తు లెవరును లేకుండుట చేతను నొకనాటి తెల్లవారుజామున బైలుదేరి యేలూరు నకు వచ్చి యొక యింటిని బాడుగకు దీసికొని యందు కమలా పార్వతమ్మ లుండిరి.

కమలమ్మ నిత్యము నుదయముననే లేచి స్నానము చేసి, సూర్యున కెదురుగ నిలచి యేమేమో యనుకొనుచు బ్రార్థనచేయును. అటుపిమ్మట దమపెండ్లికాలమున దీయింపబడిన ఫొటోగ్రాఫులోని భర్తబింబమును బూజించుచు, బూలమాలికలు గ్రుచ్చి యలంకరించును. తరువాత విశ్రాంతికాలమంతయు భగవద్గీతాపారాయణముతో గడుపును. ఇది కమలమ్మయొక్క నిత్యనియమము.

ఇక పార్వతమ్మకు వచ్చిన పదిపదునైదు దినముల వఱకు నూరంతయు దిరుగుటతో సరిపోయెను. గాని నాలుగుదినములనుండి యొక ప్లీడరుగారి యింటిలో వంటచేయుటకు గుదిరెను. అన్నము పెట్టి నెలకు బండ్రెండు రూపాయ లిచ్చునట్టి యేర్పాటు. పార్వతమ్మ యొక్కపూటయే భుజించుచుగాన ప్లీడరుగారికై మధ్యాహ్నఫలహారముగ జేసినదానిలో, గొంత యాపె ఫలహారముచేసి, రాత్రివంటను సాయంకాలమె చేసి, ప్రొద్దు గ్రుంకకమునుపే పార్వతమ్మ యింటికివచ్చును. పంతులుగారే వడ్డించుకొని రాత్రిభోజనమును భుజించెదరు. ఆ పండ్రెండు రూప్యములతో గమలకును సుఖజీవనము జరుగుచుండెను.

ప్లీడరుగారు క్రొత్తగావచ్చి యేలూరులో ప్రాక్టీసు చేయుటకై యొక మేడ నద్దెకు దీసికొని వలయుపరికరములతో నుండిరేకాని వారికి నెవ్వరును లేరు. మేడ యన్నమాటయేగాని యొక్కసంసారమునకే చాలి చాల నట్లుండునంత చిన్నది. అయినను వీరొంటరిగ నుండుటచే నదియె వీరికెక్కువయ్యెను. వీరిపేరేమొ గాని యందఱు 'పంతులుగారు-పంతులుగా'రని పిలచుచుందురు. వాకిట మాత్రము వి. ఆర్. పంతులు, బి. ఏ., బి. యల్., జిల్లాకోర్టు వకీలు అని బోర్డు గలదు.

౭

కోర్టునుండి పంతులుగారు దమ యింటికి బ్రక్క-వీధినుండి కాలినడకను వచ్చుచు, నొక చిన్నిపసారా యింటిముందు దడాలున నాగిరి. అక్కడ పార్వతమ్మ పాదమాకు విస్తరుల గుట్టుచుండెను. కమలమ్మ భగవద్గీతల జదువుచు నామె కర్థము చెప్పుచుండెను. గ్రంథ పారాయణములోనున్న కమల గొంతవడికి ప్లీడరుగారిని జూచి యెవరో పెద్దమనిషి వాకిట నిలచియుండుటచేత దక్షణమె లోనికేగెను. కమల హఠాత్తుగ వెళ్లుట జూచి పార్వతమ్మ తలయెత్తి ప్లీడరుగారిని జూచెను. అంత పార్వతమ్మ లేచి నిలిచి లోనికి బిలువ సంకోచించెను; గాని పంతులు లోనికడుగు పెట్టుచు నిట్లు ప్రసంగించెను.

"ఇదియేనా మీరున్న యిల్లు"

"చిత్తము. దయచేయండి" అని చావడిలోగల యొక ప్రాతకుర్చీని చూపించి యామె పలికెను. పంతులుగారు గూర్చుండి చావడిని గలయ జూచుసరి కొక వధూవరుల ఫోటోగ్రాఫ్ గనబడెను. దానిని జేత దీసికొని యందున్న కుంకుమ, గంధము, అక్షతలు దుడుచుచుండిరి. చాటుననుండి చూచుచున్న కమల కిది కష్టముగానుండెను. గాని పెద్దమనిషి నేమియు ననలేక యూరకుండెను. అంత బంతులుగారు-పార్వతమ్మతో

"వీరెవరండి"

"ఆ యమ్మాయి మా మేనకోడలు"

"ఇంతకు ముందిచట గూర్చుండి భగవద్గీత చదువుచున్న యామెయేనా ?"

"చిత్తము"

"వీరెచట నున్నారు"

"కలకత్తాలోనో, చెన్నపట్టణములోనో చదువుకొనుచున్నారు"అని కన్నులనీరు దుడిచికొనెను "లేదండి. వారి చదువు సాంతమైనది. వీరిని నేను బాగుగ నెఱుంగుదును. వీరును నేనును చెన్నపట్టణములో నొక క్లాసులోనే చదివికొంటిమి" అని పంతులుగారనుటయె తడవుగ పార్వతమ్మ వెక్కి-వెక్కి-వచ్చుచేడ్పును మ్రింగికొనుచు గద్గదికతో—"వారిపు డెచటనున్నారు. పంతులుగారూ!" అని యడిగెను. కమలకు దుఃఖమాగలేదు. లోలోన గ్రుళ్లి యేడ్చుచుండెను. ఆ యేడుపుసవ్వడి ప్లీడరుగారికి వినబడినట్లే యున్నది. అంత—"పార్వతమ్మగారూ! ఎందుకు జింతించుచున్నారు?" అని పంతు లడిగెను. పార్వతమ్మ—"అయ్యా! కొన్ని సంవత్సరములనుండి వారిజాడ తెలియుటలేదండి. మా యన్నగారు పోయినప్పుడైనను రాలే" దనెను. "విచారము వలదు, వారీ యూరిలోనే యున్నారు. మీరు నేటి సాయంకాల మాలుగంటలకు వచ్చెదరేని వారిని మా యింటికి దీసికొనివచ్చెదను. మీ యమ్మాయితో గూడ రండు. బండిపంపెద"నని వెంటనే యా పటముందుంచి వెళ్లిపోయెను. వెళ్లిన గంటకే బండి వచ్చెను. పార్వతమ్మ పంతులుగారి యోగ్యత, సౌశీల్యము నెఱిగిన దగుటచేత సంకోచింప లేదు. కమలకు లగ్నకాలమున బెట్టిన బనారసుచీరెను గట్టనిచ్చి, యామెకు గల వస్తువులన్నిటిని బెట్టి యలంకరించెను. అప్పుడు కమల సాక్షాత్కమలాదేవి వలెను పునర్భవించిన రతీదేవివలెను గన్పట్టెను గాని కమలా పార్వతమ్మల కొకసందేహము గలిగెను.

"కమలా! నీవు గుర్తింపగలవా ?"

"అత్తయ్యా! నే నెప్పుడు చూచితినే?"

"అవును. నీవు గుర్తింపలేవుగాని కుడిభుజము మీద నొక పురుపుటికాయ యున్నట్లు నాకు గుర్తు" అనుచుండగా బండివాడు త్వరపెట్టెను. ఇరువురును బండినెక్కిరి. బండి గొంతతడవునకు ప్లీడరుగారి యింటి ముందు నిలిచెను. కమలయు పార్వతమ్మయు బండిదిగి కచ్చేరి చావడిలో నెవరో పెద్దమనుష్యు లుండుటచేత లోపలిచావడిలోనికేగి యందు నిలిచియుండిరి.

పంతులుగారు కొళాయిక్రింద స్నానముచేసి యొక జరీధోవతి గట్టుకొని మఱియొక యుప్పాడఖండువాను బైన వల్లెవాటుగ వేసికొనియుండిరి. ఇంతలో నెవరో మాట్లాడుటకు రాగా వారిని రెండుమాటలతో బంపి లోపలిచావడిలోనికి వచ్చిరి. అంత పార్వతమ్మగారు—

"అయ్యా! పిలిపించినారా? వారీ యూర నున్నారా?

"ఆ! ఇప్పుడే వచ్చెదరు. కాని—"

"అదేమి?"

"ఏమియు లేదు. మీ యమ్మాయి మునుపటివలెనె యీసారిగూడ—ఛీ! అపశకునపు బొమ్మన్నచో నెట్లు?"

"అట్లెప్పుడన్నది! వారు మాయూ రెప్పుడు వచ్చినారూ?"

"మీ యమ్మాయి నడగండి"

"శివ! శివ! ఇదేమిటత్తయ్యా! నే నెప్పుడన్నాను? వా రెప్పుడు వచ్చినారు?" అని కన్నుల నీరు తుడిచికొనుచు మొగమెత్తి యెదుటి గోడవంక జూచెను. తాను నిత్యము బూజించుచున్న పెండ్లి నాటి తమ ఫోటోగ్రాఫ్ పటమునంటిది యొకటి యందు వ్రేలాడుచుండెను కమలకు సంశయము గలిగెను. వెంటనే యెడమ కన్నదరజొచ్చెను. అంత ఛీడరుగారు—

"ఏమంటివి కమలాఫలమా. ఓహో! కమలాఫలమన్నచో నీవు నన్ను రామాఫలమందువుగాబోలు! లేదు. కమలా?"

కమలకు పెండ్లి నాటిమాట జ్ఞప్తికి వచ్చెను. వెంటనే లజ్జ, హర్షమున శోకము ముప్పిరిగొనెను. ఛీడరే రామారావుగారని స్పష్టమైనది. అప్పుడే పల్లెవాటుగ వేసికొనిన యుత్తరీయము క్రిందకు జారగ భుజముపైగల పురుపుటికాయ పార్వతమ్మకును కమలకును దృగ్గోచరమయ్యెను. పార్వతమ్మ యానందాశ్రువులతో—"నేటికి గదా ధన్యులమైతి" మని మెల్లగ కచేరి చావడిలోని కేగెను. కమలకు మితిమించిన యానందముచే సంతోషించుటకు మారు దుఃఖము పొర్లి పొర్లి వచ్చెను. నోట మాట రాదయ్యెను. అంత గద్గదికతో—"నాయపరాధమును క్షమింపు" మని రామారావుగారి రెండుపాదములను గట్టిగ బట్టుకొని కనుల నద్దుకొనుచు సాష్టాంగ పడెను. అంత రామారావును నేదియో యనబోయెను గాని రుద్ధకంఠుడై యేమియు ననజాలక "ఈ యపరాధము నీదికా"దని గద్గదికతో బలికి కమలను దన రెండుచేతులతో లేవదీసి కౌగిట జేర్చుకొనెను. తరువాత వారేమి మాట్లాడుకొనిరో-యేమి జరిగినదో కచేరి చావడిలోనున్న పార్వతమ్మకేమియు దెలియలేదు.

---

## తెలుఁగుతల్లి

జి. జాషువకవి గారు

కృతి నందుటకు పల్లకీమోయ దొరకున్న కృష్ణరాయలు రాజ్య మేలునాఁడు
మనుమసిద్ధియును తిక్కనగన్న కావ్యంబు కోరచూపులు జూచుకొన్ననాఁడు
తెలుఁగురాయని యొప్పుఁ లొలుకుగుప్పిటిలోన లేఁతకస్తురి గుబాళించునాఁడు
ముత్యాల మందిరంబుల, సత్కవులమీద బంగార మేరులై పారునాఁడు
కవులపలుకులు వేదవాక్యంబు లగుచు-క్షితితలంబును గంపింపఁ జేయునాఁడు
గారవంబున నన్నేల గాంచవైతి- తెలుపఁగదవమ్మ! ననుఁగన్న తెలుఁగుతల్లి!

అల సానికులజుఁ డూయెలమంచములనుండి పసిఁడిలేఖినిఁ బూని వ్రాయునాఁడు
పోతనార్యుని గేహమున, భారతీదేవి చిగురుఁజేతుల వంట సేయునాఁడు
భువనభీకరుఁడు వేములవాడ భీమన్న గంగ్రాజునకు జోలె గట్టునాఁడు
శ్రీనాథకవి, పాండితీ నైపుణముమీఁద డిండిమభట్టు నోడించునాఁడు
కనులఁ జూచెడుభాగ్యంబు గలిగియున్న-నేఁడు నాకవిత్వంబు రాణించునేమొ!
గారవంబున నన్నేల గాంచవైతి-తెలుపఁగదవమ్మ! ననుఁ గన్న తెలుఁగుతల్లి.

పసుపు ముద్దలనుంచి పతికి రోనము బోయి వీరపత్నులుపుట్టి పెరుగునాఁడు
ప్రతినదప్పక వైరివర్గము ల్పెకలించు వెలమబెబ్బులులు జీవించునాఁడు
కాళిందిలోఁ గత్తిగడిగి తల్లికిఁ జూపు శివరాజు పగతుర జెండునాఁడు
తమ్మిమొగ్గరము లుద్ధతిఁ జీల్చుకొనిపోవు పిల్లవిల్కాండ్రుద్భవిల్లునాఁడు
పిఱికినెత్తురు నాలోన వెలయదేమొ!-రంభ నాపేర నుత్తరాల్ వ్రాయునేమొ
గారవంబున నన్నేల గాంచవైతి-తెలుపఁగదవమ్మ! ననుఁగన్న తెలుఁగుతల్లి!

అలఘుదాతల దానజలధిలోపలమున్గి పెద్దమ్మ కన్నీరు విడుచునాఁడు
శరణాగతత్రాణ బిరుదంబు రాజుల పెడఁదబొమ్ములమీఁద వెలుఁగునాఁడు
సహజ పావనమైన సర్వసమత్వంబు ప్రతిక్షేత్రమున జాలువారునాఁడు
అన్యకాంతలమోములందుఁ బూరుషజాతి కన్నతల్లులమూర్తిఁ గాంచునాఁడు
వారి కబ్బినకీర్తి సంపత్తిలోనఁ-గొంతలో కొంత నేఁ బంచికొందునేమొ
గారవంబున నన్నేల గాంచవైతి-తెలుపఁ గదవమ్మ! ననుఁగన్న తెలుఁగుతల్లి!

రాముబాణమున ధైర్యము పెల్లగిల్లిన మున్నీరు తలవంచి మ్రొక్కునాఁడు
ప్రాయంబు జారిన బోయనాయకురాలు గుడిసెలో రాముని గొలుచునాఁడు
సీతమ్మకతన, సంపాతి శ్రీరఘురాము నరచేత వైకుంఠ మందునాఁడు
రామపాదుకలచే రాజ్యమేలించుచుభరతుండు కన్నీరు దొరఁగునాఁడు
భక్తివైరాగ్యములు నన్ను వలచునేమొ-కోరుకొన్నంత పుణ్యంబు గూర్తునేమొ
గారవంబున నన్నేల గాంచవైతి-తెలుపఁగదవమ్మ! ననుఁగన్న తెలుఁగుతల్లి!

---

# వేశ్య.

[రష్యన్ గ్రంథకర్త 'చెకోవు'నుండి తెనిగించ బడ్డది]

శ్రీమతి వేణుగోపాలస్వామిగారు
శేషు బాయి గోపాలస్వామి గారు

పాషా యవ్వనంలో చాలా అందంగా ఉండేది. ఆ దినాల్లో ఆమె కంఠస్వరం ఎంతో బాగుండేది. అప్పట్లో ఒకనాడు ఆమె విటుడు నికొలాయ్ పెట్రోవిచ్ కోల్పకోవ్ ఆమె బంగళా ముందటిగదిలో కూర్చున్నాడు. ఎండమాడ్చేస్తోంది. ఉక్కపోస్తోంది. కోల్ప కోవ్ అప్పుడే భోంచేసాడు. చౌకరకపు సారాయి పూర్తిగా ఒకబుడ్డి ఎక్కించాడు. కోపంగా ఉన్నాడు. కుదురుకూరాడు ఉన్నట్లు కనబడ్డం లేదు. ఇద్దఱికీ విసుగ్గా ఉంది. ఎండ ఎప్పుడు తగ్గుతుందా ఎప్పుడు షికారు వెళ్తా మా అని కూర్చున్నారు.

అప్పుడు ఉన్నట్టే ఉండి ఎవరో తలుపు కొట్టినట్టు శబ్దం అయింది. కోటూ జోళ్లూ తీసేసి కూర్చున్న కోల్పకోవ్ "ఎవరా అది" అని అడిగేటట్టు పాషా మొఖం కేసిచూసాడు.

"పోస్టు బంట్రోతో లేక నాతోటి వేశ్య ల్లో ఒకత్తో" అంది ఆ పాటకత్తె. కోల్పకోవ్ పోస్టుబంట్రోతు గాని పాషాతోటివేశ్యలుగాని తన్ను చూస్తారనేభయంలేదు. కాని ఎందుకైనా జాగ్రత్తగా ఉంటే మంచిదనుకున్నాడు. తన బట్టలన్నీ పోగుచేసి పక్కగదిలోకి వెళ్లాడు. ఇంతలో పాషా తలుపుతీయడానికి పరుగెత్తింది. తలుపు తీసింది. అట్టే నిర్ఘాంత పోయింది. ఆ తలుపు దగ్గఱ నిల్చుం దెవరు? పోస్టుబంట్రోతూ కాదు, తనస్నేహితురాలూ కాదు. ఎవరో తనకు తెలియని మనిషి. మంచి యవ్వనంలో ఉంది; ఎంతో అందంగా ఉంది; సంసారిలీరుగా ఉంది; కనబడ్డంకూడా పెద్ద మనిషిలాగే ఉంది.

ఆమె ముఖం తెల్లగా పాలిపోయి ఉంది. ఎత్తైనమెట్లను ఒక్కపరుగునఎక్కేస్తే ఒగర్చే టట్టు ఒగురుస్తూ ఉంది.

"ఏంకావాలి?" అని అడిగింది పాషా. ఆ కొత్తమనిషి వెంటనే జవాబుఇచ్చింది కాదు. ముందుకు ఒక అడుగుపెట్టింది. గది నాలుగు పక్కలా ఎగాదిగా చూసింది. మిక్కిలి అలిసే ఉందో, జబ్బుగా ఉందో, పాపం నిలవడానికి శక్తిలేనట్లుగా కూలబడ్డది. చాలాసేపు వఱకూ ఆమె తెల్లనిపెదవులు వణికాయి. కాని నోటిలోంచి మాట రాలేకపోయింది.

"నా భర్త ఇక్కడున్నాడా?" అని కన్నీటితో ఎఱ్ఱబడ్డ తన విశాల నేత్రాలు పైకెత్తు తూ అడిగింది.

"భర్తా?" అని గొణుక్కుంది పాషా. ఆమెకు ఉన్నట్లుండి చాలా భయం వేసింది. కాళ్లూ చేతులూ చల్లబడ్డాయి.

"ఏం మగడు?" అని మరల అడిగింది వణకడం మొదలుపెడుతూ.

"నామగడు......నికొలాయ్ పెట్రోవిచ్ కోల్పకోవ్"

"లే...లేదు,అమ్మా...నేను...ఏ మగడిని ఎఱుగను" అంది పాషా.

నిశ్శబ్దంగా ఉంది ఒక నిమిషం. ఆ కొత్త మనిషి తన జేబురుమాలును చాలాసార్లు తెల్లబడ్డ తన పెదిమలమీద ఉంచుతూంది. లోపల నుంచి వస్తూ ఉన్న వణకును అణిచెయ్యాలని ఊపిరి బిగబట్టింది. పాషా అట్టే స్తంభంలాగ కదలకుండా, మెదలకుండా నిలబడ్డది. నిర్ఘాంతపోయింది. భయంతో ఆమె కేసి చూస్తూ ఉంది.

"అల్లాయితే అతడు ఇక్కడ లేడంటావా?" అని ఈ సారి కఠినమైన కంఠస్వరంతో అడుగుతూ వికారంగా నవ్వింది ఆ స్త్రీ.

"నాకు...నాకు నువ్వు ఎవరిని గురించి మాట్లాడుతున్నావో తెలియడం లేదు," అంది పాషా.

"ఓసీ, పిశాచీ, నీచురాలా..."అని గొణుక్కుంది ఆస్త్రీ. పాషా కేసి ద్వేషంతోనూ, అసహ్యంతోనూ, ఏగాదిగా చూస్తూ,"అవును అవును...నువ్వు పిశాచివే. చివఱకు నువ్వు ఇల్లాంటిదానవు అని నీ మొఖం మీద చెప్పగలిగి నందుకు నాకు చాలా ఆనందంగా ఉంది." అని అంది.

కోపపుకళ్లుగల నల్లని బట్టలు ధరించిన, ఆ స్త్రీకి, పాషా తానేదో చూడ్డానికి అసహ్యకరమైన వస్తువులాగ కనబడుతూ ఉన్నానేమో అని అనుకుంది. తన ఎఱ్ఱని చెక్కిళ్లు, ముక్కుమీద స్ఫోటకం మచ్చ, ఎంత దువ్వినా వెనుకకు పోని ఉంగ్రాలజుట్టు, తలచుకొని సిగ్గుపడ్డది. తాను కొంచెం సన్నంగా ఉండి, మొఖంమీద పౌడరు వేసుకోకుండా ఉండి, ఉంగ్రాలజుట్టు లేకుండా ఉంటే,తాను సంసారి కాదనేసంగతి దాచిపెట్టగలిగే దాన్ని అని అనుకుంది. ఆవింతస్త్రీనిచూస్తూ ఆమె ఎదురుగుండా నిలబడ్డానికి అంతభయం సిగ్గు లేకుండా ఉండేది అని తలచింది:

"నా భర్తఏడీ?" అని ఆ స్త్రీ మళ్లీ అడిగింది. "అతడు ఇక్కడ ఉన్నా, లేక పోయినా నాకు ఏం లెక్కలేదు. కాని డబ్బు పోయింది అని మాత్రం నీతో చెప్తున్నా. వాళ్లు నికొలాయ్ పెట్రోవిచ్ కోసం వెదుకుతున్నారు... అతన్ని ఎఱస్టు చేయడానికి చూస్తూన్నారు. దానికి కారణం నువ్వే!"

ఆ స్త్రీ లేచి, అటూఇటూ కంగారుగా నడచింది. పాషా ఆమె కేసి చూసి చెడ్డభయపడ్డది. తనకు ఏమీ అర్థం కావడం లేదు.

"ఈవాళే అతన్ని పట్టుకుంటారు. ఎఱస్టు చేస్తారు." అంది ఆస్త్రీ. మెల్లగా ఏడ్చింది. ఆఏడ్పులో కోపం, విసుగూ కనబడుతూ ఉంది. "ఈ ఘోరమైనస్థితికి అతన్ని ఎవ్వరు తీసుకొచ్చారో నాకు తెలుసును! నీచురాలా!



౯. 'బాటసారి'
శ్రీ వి. ఆర్. చిత్రగారి చిత్రము.



౭. చంద్రవంక ఎత్తిపోతల
(మూడవ బహుమానము) శ్రీ కే. వీరయ్యగారి చిత్రము.



౮. పెట్రోలున్నా పోతులే గతి



౧౦. జగన్నాథ దేవాలయము-పూరి



౧౧. పూరి పట్టణము



౧౨. భువనేశ్వరము చెంత నున్న ఖండగిరి గుహాలు-జైనులవి-ప్రాచీనములు



౧౩. సూర్యాస్తమయము-మహానది



౧౪. మహానది అనకట్ట-వేసవికాలమున-కటకము

శ్రీ టి. విశ్వనాథముగారి చిత్రములు.

పిశాచీ! అసహ్యమైన నీపడుపువృత్తే దీనికి కారణం!" అంది. పెదవులు కదలడానికి మొదలు పెట్టాయి. అసహ్యించే ముక్కు ముడుచుకుంది. "నీచురాలా! నే ననాథను. విన్నావా?......... నేను దిక్కులేని దానను. నా కంటె నీవు బలశాలివి. కాని నన్ను, నా పిల్లల్ని రక్షించడానికి భగవంతుడున్నాడు! దేవుడంతా చూస్తాడు ఆయన న్యాయమూర్తి! నేకార్చిన కన్నీటిలో ప్రతిచుక్కకు, నేగడపిన నిద్రలేని రాత్రులన్నిటికి, ఆయన నిన్ను శిక్షిస్తాడు. నీకు నేను జ్ఞాపకం వచ్చేసమయం వస్తుందిలే!........."

మళ్లీ నిశ్శబ్దం అయింది. ఆ స్త్రీ అటూ ఇటూ తిరుగుతూ చేతులు పిసుక్కుంది పాషానిర్ఘాంతపడిపోయి ఆమెకేసి చూస్తూనే ఉంది. ఏమీ అర్థం అవలే. ఏదో ఘోరమైనది జరుగుతుందని ఆతురతతో చూస్తోంది.

"నా కాసంగతి ఏమీ తెలియదమ్మా," అంది. ఒక్కసారిగా గొల్లుమని ఏడ్చింది.

"శుద్ధ అబద్ధాలు!" అని ఆస్త్రీ అజిచింది. కళ్లెఱ్ఱచేసి పాషాకేసి చూసింది. "నాకంతా తెలుసును! నిన్ను నే చాలాకాలంనుంచి ఎఱుగుదును. ఒకనెలనుంచి ప్రతిరోజూ అతడు నీఇంటిలోనే ఉన్నాడని కూడా నాకు తెలుసును!"

"అవును. అయితే ఏం? ఏంచెయ్యమంటావు? నా దగ్గఱికి చాలామందివస్తారు. కాని నాదగ్గఱికి రమ్మని ఎవ్వరిని బలవంత పెట్టలేదు. అతడు ఏం చేస్తాడో అతని ఇష్టం."

"నేచెప్తున్నా, విను. డబ్బు పోయిందని వాళ్లకి తెలిసింది. ఆఫీసులో డబ్బుఅతను దగా చేసి ఎత్తుకుపోయాడు. ఇదిఅంతా నీలాంటి... నీలాంటి నీచురాలి కోసం. నీకోసం, ఘోరమైన అపరాధంకూడా చేసాడు. విను,"అన్నది ఆస్త్రీ కఠినస్వరంతో. మాట్లాడ్డం మానేసి పాషాకేసి చూసింది. "నీకు నీతి ఉన్నట్లులేదు. నీ బ్రతుకంతా హాని చెయ్యడం కొఱకే— అదే నీపని; కాని రవంతయినా దయాదాక్షిణ్యాలులేకుండా ఉండే ఇంత హీనస్థితికి దిగుతావని ఎవరూ అనుకోలేదు! అతనికి, పెళ్లాం బిడ్డలు ఉన్నారు...అతన్ని శిక్షించి దేశాంతరం పంపితే, తిండిలేక మాడుతాం, పిల్లలూ, నేనూ...అర్థం అయిందా? ఇప్పుడైనాఅతన్ని, మమ్మల్ని ఈ దుస్థితిలోంచిన్ని, ఈఅవమానంలోంచిన్ని, రక్షించడానికి వీలుంది. ఇవ్వాళ వాళ్లదగ్గఱికి తొమ్మిదివందలరూపాయలు తీసుకొని వెళ్తే అతన్ని వదిలేస్తారు. తొమ్మిదివందలరూపాయలు మాత్రమే!"

"తొమ్మిదివందలరూపాయ లేమిటి?" అంది పాషామెల్లగా. "నేను...నేను ఎఱుగను...... నేను తీసుకోలేదు."

"నేనుతొమ్మిదివందలరూపాయలకోసరం నిన్ను అడగడం లేదు. నీ దగ్గఱ డబ్బూలేదు, నీడబ్బు నా కక్కఱాలేదు. నేనడిగేది మరోటి. ......నీలాంటి స్త్రీలకు మొగాళ్లు సాధారణంగా వెలగలవస్తువులు ఇస్తారు. నామగడు నీకిచ్చిన వస్తువులుమాత్రం తిరిగి ఇచ్చివేయి!"

"అమ్మా అతడు నాకేమీ బహుమా నాలు ఇవ్వలేదు!" అని పాషా ఏడ్చింది. ఇప్పుడు సంగతి సందర్భాలు అర్థం అవడం మొదలు పెట్టాయి.

"ఆ డబ్బు ఏదీ? తగలేసాడు, తనదీ, నాదీ, ఇతరులదీ......అది అంతా ఏమయింది? విను, నిన్నునే వేడుకుంటా! ఆమహాకోపంలో నిన్ను అనరాని మాటలాడాను. కాని క్షమించు. నీకు నామీద ద్వేషం ఉండక తప్పదు, నాకు తెలుసును, కాని నీవు కనికరం గలదానవయితే నీవు నాస్థితిలో ఉన్నట్లు ఆలోచించు! ఆవస్తువులు నాకిచ్చేయమని వేడుకుంటా !"

"ఊ !" అన్నది పాషా బుజాలు కుంచుకుంటూ. "నేను సంతోషంతో ఇచ్చిఉందును. కాని దైవమేసాక్షి. అతడు ఎప్పుడూ నాకు బహుమానము ఇవ్వలేదు. నన్ను నమ్ము. నా అంతరాత్మయే సాక్షి. అయినా నీవు చెప్పింది నిజమే" అంది ఆపాటకత్తె కంగారు పడుతూ. "అతడు రెండుచిన్న వస్తువులు నాకు ఇచ్చాడు. తప్పకుండా అవి నీకు తిరిగి ఇచ్చేస్తా నీక్కావాలంటే."

పాషాబల్ల అరల్లో ఒకటి బయటికి లాగి దానిలోంచి, బంగారపుది గుల్లగాజు ఒకటి కెంపువేసిన ఒక సన్నని ఉంగరం ఒకటితీసింది.

"ఇదిగో నమ్మా !" అని ఆవస్తువులు ఆమెకు ఇచ్చింది.

ఆస్త్రీముఖం ఎర్రబడ్డది. వణకింది. కోపం వచ్చింది.

"ఏమిటిఇస్తున్నావు ?" అని అంది. నేను భిక్షంఅడగడంలేదు.నీవికానివే నేఅడుగుతున్నా. ...నా మగడు... ఆ బలహీనుడు...ఆ దౌర్భాగ్యుడి దగ్గఱనుంచి నీ అనుకూలాన్ని బట్టి నీవు తీసుకొన్నవే...గురువారం నాడు నామగడితో నిన్ను హార్బర్‌లో చూసా. అప్పుడు నీవు వెలగల గాజులు,బ్రోచిలువేసుకొన్నావు. అంచేత, నువ్వు, నీ అమాయకత్వపు వేషాలు వేస్తే నా దగ్గఱ సాగవు! కడసారి మాటు అడుగుతున్నా. ఆ వస్తువులు నాకు ఇస్తావా, లేదా ?"

"నీవు బలే తమాషా మనిషివి లాగున్నావే!" అంది పాషా నొచ్చుకుంటూ. "నే నిజంగా చెప్తున్నా. ఈ గాజూ, ఈ చిన్న ఉంగరం తప్ప మరోవస్తువు నీ నికొలాయ్ పెట్రోవిచ్, ఇవ్వగా నే చూడలేదు. అతడు నాకు మిఠాయి తప్ప ఏమీ తేడు."

"మిఠాయా !" అని నవ్వింది ఆ స్త్రీ. "ఇంటిదగ్గఱ పిల్లలకి తింటానికి కూడులేదు. ఇక్కడ నీకు మిఠాయి ! అయితే ఆ వస్తువులు తిరిగి ఇవ్వనంటావు ?" జవాబు రాకపోవడం చేత ఆ స్త్రీ కూర్చుని అర్థం లేని చూపు చూస్తోంది ఆలోచిస్తూ.

"ఇప్పుడు చేసేదేముంది ?" అంది ఆమె. "నేను తొమ్మిదివందల రూపాయలు తీసుకొని రాకపోతే అతడు నాశనం అవుతాడు.పిల్లలూ, నేనూ, నాశనం అవుతాం కూడాను. ఈ నీచురాల్ని చంపనా, లేకదానికాళ్లమీద పడనా?" అని అనుకుంది ఆస్త్రీ.

జేబురుమాలు మొఖంమీాద వేసుకొని గొల్లుమని ఏడవడం మొదలుపెట్టింది.

"నిన్ను వేడుకుంటా!" అనే మాటలు ఆఏడుపులో పాషా విన్నది. "చూసావా, నా మగణ్ణి నువ్వు దోచేసి నాశనం చేసావు. అతన్ని రక్షించు........ఆతడంటే నీకేమీా కరుణలేదు, కాని ఆపిల్లలు......ఆపిల్లలు...... ఆపిల్ల లేంచేసారు?"

పాషా ఆచిన్ని పిల్లలు వీథిలో నిలబడి ఆకల్తో ఏడుస్తూ ఉన్నట్లుగా తలచుకొని తానుకూడా ఏడవడం మొదలెట్టింది.

"నేనేం చేయగలనమ్మా? నన్ను తుచ్ఛురాలంటున్నావు. నికొలాయ్‌పెట్రోవిచ్‌ని నాశనం చేసానం టున్నావు. నిజంగా...దైవసాక్షిగాచెప్తున్నా, విను, నేను అతనిదగ్గఱనుంచి ఒక్కచిల్లిగవ్వయినా తీసుకోలేదు... నాతోటివేశ్యల్లో ఒక్కపిల్లకి మాత్రం డబ్బుగల విటుడున్నాడు. తక్కినవ మేమంతా ఏపూటకాపూట చారుమెతుకులతో గడుపుకునే వాళ్లమే. నికోలాయ్‌పెట్రోవిచ్ చాలా చదువుకున్నవాడు; పెద్దమనిషి; అందుకని అతన్ని నాదగ్గఱకు రానిచ్చాను. పెద్దమనుష్యులను మాదగ్గఱకు రానియ్యడం మాకు విధి."

"నే ఆవస్తువుల్ని, ఇచ్చివేయమని అడుగుతున్నా. అవి ఇచ్చివేయి! నేను ఏడుస్తున్నా. ......నేను నీముందఱ అవమాన పర్చుకుంటున్నా......నీకిష్టమయితే నీకాళ్లమీాద పడతా! నీకిష్టమయితే!"

పాషా భయంచే అఱచింది. చేతులు విసరింది. తెల్లబాఱిన ఈఅందగత్తె తనభావాల్ని నాటకంలోప్రదర్శించేటట్టు తెలియపరుస్తూఉంది ఆమెగర్వంతో, దర్జాతో, గొప్పదానివలె అగపడాలని, ఎక్కువ చేసుకోవాలని, వేశ్యయగు తన్ను అవమాన పర్చడానికి నిజంగా తనకాళ్ల మీాద పడుతుందేమో అని పాషా భయపడింది.

"అయితే, సరే, వస్తువులను నీకు ఇస్తాను!" అని కళ్లు తుడుచుకుంటూ, హడావిడిగా, అటూ, ఇటూ తిరుగుతూ అంది పాషా, "తప్పకుండ ఇస్తాను. కాని అవి నికొలాయ్‌పెట్రోవిచ్ ఇచ్చినవి మాత్రం కావు......ఇవి ఇతర పెద్దమనుష్యుల దగ్గఱ్నించి, నే తీసుకొన్నవి. నీ ఇష్టం........."

పాషా బీరువా, పై అరలాగింది. అందులోంచి రవ్వలబ్రోచ్ ఒకటి, పగడాలహారం ఒకటి కొన్ని ఉంగరాలు, గాజులు, తీసింది. అన్నీ ఆస్త్రీకి ఇచ్చేసింది.

"ఇవన్నీ, నీఇష్టం అయితే తీసుకో నీ మగడి దగ్గరనుంచి మాత్రము నేను ఏమితీసుకోలేదు. ఇవి తీసుకొని గొప్పదానవు అవు" అని ఆస్త్రీ తనకాళ్లమీాద పడతానని బెదిరించినందుకు కోపంతో అంది పాషా. "నువ్వు నిజంగా పెద్దమనిషివై తే......అతనికి ధర్మపత్నివై తే,అతన్ని నీదగ్గఱే ఉంచుకో. నాదేం పోయింది! అతన్ని రమ్మని నేను అడగలేదు. తనకు తానే వచ్చాడు."

ఆస్త్రీ ఏడుస్తూనే తనకిచ్చిన వస్తువులను పరకాయించి చూస్తూ అంది, "ఇవేనా...... ఇక్కడ ఉన్నవి అయిదువందల రూపాయలు కూడా చేయవు."

పాషా తొందరగా అలమారు లోంచి ఒక బంగారపువాచి, చుట్టలపెట్టి, బొత్తాములు, తీసి బయటికి, గిరాటువేసి చేతులు చాపుతూ, "నా దగ్గఱ ఇంకేమీ లేవు...నువ్వు వెళ్ళొచ్చు!" అంది.

ఆస్త్రీ నిట్టూర్పు విడిచింది. వణకుతూ ఉన్న చేతుల్తో ఆవస్తువులన్నిటిని, తన జేబురుమాలులో వేసి కట్టింది. అవి తీసుకొని ఒక్క మాట అయినా ఆడకుండా, కొంచెము తల అయినా ఊపకుండా, బయటికి వెళ్లింది.

పక్కగది తలుపు తెరువబడ్డది. కోల్ప కోవ్ లోపలకు వచ్చాడు; తెల్లబోయి ఉన్నాడు. ఏదో చాలా చేదుమందు తాగినట్లు తల ఊపడం మొదలుపెట్టాడు. కళ్లల్లోకి నీళ్లు వస్తున్నాయి.

"నువ్వు నాకు ఏమిబహుమతులు ఇచ్చావు?" అంది పాషా మీదపడుతూ, "ఎప్పుడు నన్ను అడగనిచ్చావు"

"బహుమతులా...దానికేంలే," అన్నాడు; తలపంకించాడు. "ఓదైవమా! నీ ఎదుటుగుండాపడ్చింది. నీఎదుట తన్ను అవమాన పర్చుకుంది......"

"నే అడుగుతున్నా. నువ్వు నాకేం బహుమతు లిచ్చావు?" అని పాషా ఏడ్చింది.

"అయ్యో! దైవమా! ఆమె, ఆసంసారి, ఆప్రౌఢాంగన, ఆ పతివ్రత......నీకాళ్ల మీద ...ఈముండ కాళ్ల మీద పడ్డానికి సిద్ధంఅయింది. ఆమెను ఈస్థితికి తీసుకొచ్చాను! దానికి నేను ఒప్పుకొన్నాను!"

చేతుల్లో తన తలపెట్టుకొని ఏడవడం మొదలు పెట్టాడు.

"దీనికి న న్నెన్నటికి క్షమించకూడదు! ఎన్నటికి క్షమించకూడదు! నాదగ్గఱనుంచిపో ......నీచురాలా!" అని అసహ్యంతో కేకలేస్తూ, పాషా దగ్గఱనుంచి వెనుక్కుకు తగ్గి, వణకుచున్న చేతులతో ఆమెను తోసేసాడు. "ఆమె నీకాళ్ల మీదపడే దే......నీకాళ్ల మీద! ఓదైవమా!"

త్వరగా బట్టలువేసుకొన్నాడు. పాషాను చులకనగా అవతలికి తోసేసి బయటికివెళ్లి పోయాడు.

పాషా పడుకుని గట్టిగా ఏడవడం మొదలుపెట్టింది. అంత తొందరతో ఇచ్చేసిన వస్తువులకోసరం విచారపడ్డది. ఆమె మనస్సు చివుక్కుమన్నది. మూడేళ్ల క్రిందట ఒక వర్తకుడు ఏంకారణం లేకుండానే తన్ను కొట్టడం జ్ఞాపకంవచ్చింది. మఱింత బిగ్గఱగా ఏడవడం మొదలు పెట్టింది.

---

# రామచంద్రప్రభుశతకము

కూచి నరసింహము గారు

(౬-వ సంపుటము, ౭-వ సంచిక తరువాయి)

ధృతి రహా నింద్రియనిగ్రహంబు దమ మస్తేయంబు శౌచంబు క్షాం
తి రుషాభావము బుద్ధి మంచిచదువు స్థిరత్వము స్సత్యముఁ
వరధర్మంబు లటంచుఁ దొంటిస్మృతి* తా వ్రాయుచ్చు స్పష్టంబుగాఁ;
దరియింపం బెఱబోధ మేటికి? మహాత్మా! రామచంద్రప్రభూ!

ధరణి స్నానవుఁ జేయుపాయమున నో తానెట్టిదా దేహినో
పారయం జేయవలె న్మదం; బదియె యాఁ బూర్ణేశ్వరారాధనం
బరయంగా; నని శ్లోకమందు నొకధన్యాత్ముండు బోధించెడున్;
దరియింపం బెఱబోధ మేటికి? మహాత్మా! రామచంద్రప్రభూ!

ధరలో శూరుఁ డన జితేంద్రియుఁడె; సద్ధర్మంబుల న్నిత్య మా
చరణంబందునఁ జూపువాఁడె కృతి; వాక్శౌండుండు సత్యోక్తియే;
యరయ న్భూత దయాగరిష్ఠుఁడె వదాన్యాగ్రేసరుం; డింద్రుఁగా!
తరియింపం బెఱబోధ మేటికి? మహాత్మా! రామచంద్రప్రభూ!

అనిశంబు న్సుఖిఁ జూచి మైత్రి, కృప దుఃఖార్తు న్విలోకించి, పు
ణ్యుని వీక్షించి ముదం, బపుణ్యుఁగనుచో సోపేక్షతావృత్తి—భా
వన లీమాడ్కి—ని బోవుచో నొదవు సుస్వాంతప్రసాదం బటం
చను సూత్రం*; బది నాకు నీవొసఁగవయ్యా! రామచంద్రప్రభూ!

అది యిమ్మంచు నిదిమ్మటంచు నిను నే నర్థింపఁగా నా కెదన్
జెదరా; దానను నాకు మేలగునొ పిర్వీఁకౌనో, కించిజ్ఞుఁడన్
విదితంబా నెటు నాకుఁ? గాన, నెది గావింపంగ నీకిష్టమో
యదె కానిమ్మని వేఁడుకొందుఁ బరమాత్మా! రామచంద్రప్రభూ!

శివునిం జూడ నటంచు వైష్ణవుఁ, డిఁక శ్రీజానినేఁ జూడనం
చు విరోధంబున శైవుఁ డందు; రెదలోఁ జూడంగ లే దిర్వురం
దేవుఁడు న్వారి యథార్థతత్త్వ; మదియే వీక్షించుచో నేకమౌ
శివుఁడు న్విష్ణువును సర్వదైవతములు న్శ్రీరామచంద్రప్రభూ!

---

* మనుస్మృతి.

* పాతంజలయోగ సూత్రము.

మనముం జూడఁ బ్రమేయమైన; దిఁక నీమాహాత్మ్యమో! కాలదే
శనిమిత్తంబుల దాఁటియుండుఁ; గనుక న్స్వాంతంబున న్నిన్నుఁ గాం
చ నశక్యం; బది గిద్దలోపలను గుంచంబు న్గదింపంగఁ జూ
చినయట్లుండును హీనపాత్రమగుచు న్శ్రీరామచంద్రప్రభూ!

కానవచ్చియు బాహ్యభేదములు డెక్కన్ స్సత్రవర్ణాదుల
న్లోనన్ గ్రంథముమాత్ర మేకమయి యుండుం బెక్కిటన్; బాహ్యమా
వానింద్రోసి మతంబులం గనిన లో భాసిల్లు తత్వం బటే
కానంగానగు నొక్కటీకన శుభాంగా! రామచంద్రప్రభూ!

స్వామీ దిక్కెఁక నీవె నాక నెడు విశ్వాసంబుతో స్వీయమా
సామర్థ్యంబును వమ్ముసేయక ధృతి న్సాంసారిక వ్యాపృతి
స్తోమంబుం బచరించు భక్తునకు నీతోడ్పాటు ప్రాప్తించుఁ దా
నేమార్గంబుననో సకాలముగఁ దండ్రీ! రామచంద్రప్రభూ!

పరులం దుండెడు తప్పలెంచి సవరింపం జూచుకంటె న్ననున్
దురితాపేతుని దాల్తఁ జేసికొను టెంతో మంచి, దేమన్న న
క్కరణి న్నేను మెలంగినం దఱుఁగు లోకంబందుఁ బాపాళి నొ
క్కరుఁడైన న్మహి కద్ది లాభమె యగుంగా! రామచంద్రప్రభూ!

నిసువుం దల్లి జలంబుతోఁ గడిగి మేనిన్ శుభ్రముం జేసినన్
వెసబూడ్దంబడి వాఁడు చేసికొను దాని న్వండి యేవంబుగా;
నసిగాఁ జేసి గురుండు చిత్తమును దాఁ జన్నంత, శిష్యుండు న
ల్లె సుఖాభాసములందుఁ జిక్కి చెడుఁ దండ్రీ! రామచంద్రప్రభూ!

సరిగా వంకరఁ దీర్చి కుక్కపుఁబుచ్ఛం, బద్ది విడ్వంగ నే
మరల న్వంకరపోవుఁ దొంటిగతి, నమ్మాడ్కి న్మహాతేజుఁ డొ
క్కరుఁ డేతెంచి ప్రపంచ మచ్చముగఁ దాఁ గావించి యేగంగ నే
తిరుగన్ గల్బిషమంది చెందునది యార్తి న్రామచంద్రప్రభూ!

ఎవ్వండైనను జేసెనే నెదియొ దుష్కృత్యంబు, గర్వంబునన్
నవ్వంగూడ దొరుండు వానిఁగని; మానైర్మల్య మిట్టె సదా
దవ్వై వమ్మెడఁ బాయకుండు ననుచున్ ధైర్యంబుతో నిల్చి వా
క్రువ్వ న్భక్తులుగారు నీయెదుట నేరున్ రామచంద్రప్రభూ!

ఏయే విద్యల నభ్యసించి తనుచుం బృచ్ఛింప నీవెప్పుడిం
కేయే సత్కృతు లాచరించి తనుచుం బృచ్ఛింతువే కాని; యెం

తో యాహ్లాదకరంబుగాఁ బలికితో హా! యంచు నా, కచ్ఛపా
న్యాయోపేతచరిత్ర మెచ్చుకొనుదయ్యా! రామచంద్రప్రభూ!

ఆ యత్యున్నతు లుండు భూరుహము వాత్యాబాధపాలౌ, దృణం
బాయాసంబును జెందదట్టు; లటె యాధ్యాత్మ్యాధికుం డొందెడున్
మాయాబాధలు సంసృతిన్, వినయసంపన్నుం డటుల్గాక తా
హాయి న్జేయును జీవయాత్ర జగదీశా! రామచంద్రప్రభూ!

ఓచోఁ గానిస్థలంబు నన్నిజ మహాత్మా విఖ్యాతోత్కంఠతో
వాచాడంబర మేచి చూప, కితరు ల్వ్రాకుచ్చు వాక్యంపు సా
మీచీన్యంబు గ్రహించి దానివలన న్మేలొందుఁ బ్రోడండె పో
నీచిత్తంబున కించి ధన్యుఁడగుఁ దండ్రీ! రామచంద్రప్రభూ!

తొలుతం జెడ్డతలంపు పుట్టు; నది తోడ్తోఁ జంపకున్న న్మదిన్
గలుగు న్దానికిఁ బుష్టి నిచ్చెడు ననంఖ్యాకంబులౌ భావనల్
పలుదుర్వాంఛలు గల్గు వెన్కఁ; గడ కావాంఛ ల్క్రియారూపమై
కలిగించు న్సుఖనష్టి రెంటను, శుభాంగా! రామచంద్రప్రభూ!

మరణం బొందెడువేళఁ, గుత్తుకకు శ్లేష్మం బడ్డమౌవేళ, నం
దఱు "నన్నెవ్వరి కప్పగించి చనె?" దన్నాదంబె కావించి యే
డ్తురు శాంతిం జననీక; యచ్చటి యొకండు న్నిన్నుఁ బ్రార్థించి నీ
చరణాబ్జస్మృతిఁ దేఁడు వాసికి రమేశా! రామచంద్రప్రభూ!

తన యిష్టానుస్మృతిం గృహంబుఁ దనుచిత్తవ్యాపృతు ల్సాగుచో,
మనమత్యంతము శాంతినుంట యది సామాన్యంబె; యింకెవ్వఁడుం
డును శాంతాత్మతఁ గ్రూరకష్టదశయందు న్వాఁడె నీసత్యభ
క్త నికాయంబునఁ జేర్చుకోఁదగు ననంతా! రామచంద్రప్రభూ!

అంతస్సార మెఱుంగ సాధనముగా దైశ్వర్యసంపత్తి, య
త్యంతంబైన ప్రలోభకార్థనిచయం బాపత్తులుం గాని; స్వ
ర్ణాంతస్థంబగునిగ్గుఁ గాంచ నొరగల్లోఁగాని స్నిగ్ధంబు భా
స్వంతంబౌ మొకమాలుగాదు జగదీశా! రామచంద్రప్రభూ!

కాంతం గాంచనము న్శరీరసుఖము న్గావంచు వర్జించి నీ
చెంతం భక్తులు చేసు లేల? యన, నీ శ్రీపాదపద్మద్వయీ
చింతాలభ్యసుఖంబు, వానివలన న్సిద్ధించు సౌఖ్యంబుఁ దా
నెంతో మించి యొసంగుచుండుటనె తండ్రీ! రామచంద్రప్రభూ!

అనుతాపాగ్ని మదీయకిల్బిషవనం బామూల దాహంబు చే
సిన వెన్క న్భవదీయ భవ్యగుణ సంస్మృత్యాదులం బిట్టు నా
కనులంబుట్టు సుశీతలాశ్రుతతి నాకాంక్ష న్శమింపంగఁ జే
సి, నను న్భక్తి సుధాబ్ధిఁ దేల్పఁగదవే! శ్రీరామచంద్రప్రభూ!

అకలంకాత్ముల దీర్ఘజీవనతఁ బుణ్యం బుర్విఁ బెంపొందు; దు
ష్కృత్కృతి వ్రాతము దీర్ఘజీవనతచే వర్ధిల్లుఁ బాపంబె; కో
రక దీర్ఘాయువు పాపి మృత్యువునె కోరంజెల్లు నద్దాన వా
నికి న్మృత్యువు లాభమౌను గనుక న్శ్రీరామచంద్రప్రభూ!

నీపాదాంబుజచింతనాభ్రధునిలో నే స్నానముం జేసి నా
పాపౌఘంబులఁ గడ్గివైచుకొని శుభ్రస్వాంతత న్నిల్చి, నీ
రూపంబు న్మదిఁగట్టి, మృత్యువును మిత్రుంబోలె రావోయి! యం
చాపద్బాంధవ! పిల్చు నిర్భయత నీవాఁ! రామచంద్రప్రభూ!

అన్నం బంబువు లగ్ని గాలి పొగబం డ్లాకాశయానంబు లిం
కెన్నో మానవసౌఖ్యసాధనము లీపృథ్వి న్కృతిం దెచ్చు, ని
ట్లున్న, “న్జీవితమధ్యమందు మృతిలో నున్నానునే” నన్నమా
ట న్నీమాయజడుండు తామఱచుఁ గట్టా! రామచంద్రప్రభూ!

సువిచారంబున నెవ్వఁ డీల్గు టనఁగాఁ జొక్కాల మార్పంచు నెం
చి, వపుర్నాశముకై భయంబు మదిలోఁ జెందండో యాతండు మృ
త్యువు నిర్జించిన శూరుఁడే యనఁదగున్ దోఁబుట్టునట్లే యతం
డవలోకించును మృత్యుదేవత మహాత్మా! రామచంద్రప్రభూ!

చావుంబొందినవానికై పొగులు చక్రాంతంబు నిర్వేదమం
దే వాఁడుంబడియుండుఁ; జెప్పటివలెన్ సృష్టిస్థమౌ సర్వముం
బోవు న్నాగి; యటంచు నెంచు నెడల న్బోకాడుఁ దోడ్తో నహం
భావం; బంత నరుండు ధన్యుఁడగుఁ జుమ్మా! రామచంద్రప్రభూ!

గదిలో నుండి మఱొక్కటౌ గదికి నేగ న్రేయి బాలుండు తా
బెదరు న్మధ్య తమఃప్రదేశము సొరన్ భీకారణాభావమం;
దిదియే మాదిరి మృత్యుభీతిగదురు న్హృద్వీథి నజ్ఞానికం
చుదితంబౌ నుడి సత్యమైననుడి గాదో! రామచంద్రప్రభూ!

---



రూప అనుప బన్యో అతిహీఁబపు కంచన ఖంభసోఁ హైఁ లపటావే ।
కోకత దండ బనే పరచండ సోఁ ముగ దరసోఁ భుజ జోర జనావే ।
మల్లకీ లీని షౌ రపరంగ కియే పర తేజసోఁ తేజ బఢావే ।
దేఖో దేసాఖ హిండోలకీ రాగనీ మల్లనిమధి మల్ల కహావే ॥

[జయపుర చిత్రము: దివాన్ బహాదూరు చతుర్భుజదాసు గోవిందదాసుగారి యనుమతిని]

# నాట్యకళాచరిత్రము

కీ. శే. మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రి గారు

[శ్రీ మహోపాధ్యాయులు అపు డపుడు రచియించి అముద్రితములుగ నిలిచియుండిన కొన్ని వ్యాసముల మాతృకలను వారి ధర్మపత్నిగారు భారతియందు ప్రకటింప నొసంగినారు. ఈ వ్యాసము వానిలో నొకటి. ఇది ఫూల్సుకేపు 8 పుటల సైజున నున్న చిన్న నోటు బుక్కున శ్రీ శాస్త్రులుగారి స్వహస్తలిపి నున్నది. దాని అట్టపై వారు 'i భరత & Drama, ii భరత and Shakespeare, iii The Modern Imitation Drama (Tel.)' అని కలదు. విమృష్ట విషయమునుబట్టి 'నాట్యకళాచరిత్రము' అనుపేరీవ్యాసమునకు సరిపోవునని తలఁచి ఆ పేరునే దీనికిఁ బెట్టి యథామాతృకముగా ప్రకటించితిమి. ఇంకను గల వ్యాసములు కొన్ని సంపూర్ణములు, కొన్ని అసంపూర్ణములు, కొన్ని సంగ్రహలేఖామాత్రములు. వానిలో నర్థావబోధము, సమన్వయ సౌలభ్యము గలవి యథామాతృకముగా భారతియందు మున్ముందు ప్రకటితములు కాఁగలవు. ఆంధ్ర సారస్వతప్రపంచమును తన కళాకలాపముచే ప్రకాశింపఁజేసి యస్తంగతుఁడైనయా కళాప్రపూర్ణుని యపూర్వకళాసంపదనుభూతిని భారతీద్వారమున నాంధ్రలోకమునకు ఇంకను బ్రసాదించిన వారి ధర్మపత్నియెడ నెంతయుఁ గృతజ్ఞులము.—సంపాదకుఁడు, భారతి.]

౧

భరతముని ఆత్రేయాదిమునులకు నాట్యవేదమును చెప్పుచున్నాఁడు:

"సమాప్తజప్యం వ్రతినం స్వసుతైః పరివారితమ్;
అనధ్యాయే కదాచిత్తం భరతం నాట్యకోవిదమ్.
మునయః పర్యుపాస్యైన మాత్రేయప్రముఖాః పురా;
పప్రచ్ఛుస్తే మహాత్మానో నియతేంద్రియబుద్ధయః.
యోఽయం భగవతా సమ్యక్ గ్రథితో వేదసమ్మితః;
నాట్యవేదః కథం చాయ ముత్పన్నః కస్యవా కృతే.
కత్యఙ్గః కింప్రమాణశ్చ ప్రయోగ శ్చాస్య కీదృశః;
సర్వ మేత ద్యథావత్త్వం భగవ న్వక్తు మర్హసి.
తేషాం తద్వచనం శ్రుత్వా మునీనాం భరతో మునిః;
ప్రత్యువాచ తతో వాక్యం నాట్యవేదకథాం ప్రతి".
భరత. ౧—(౨-౬).

౨

నాట్యశాస్త్రసృష్టి వినోదకరణముగా మహేంద్రాదిదేవతలచేత ప్రార్థింపఁబడినది. అట్లే బ్రహ్మదేవుఁడు అనుగ్రహించినాఁడు:—

"మహేన్ద్రప్రముఖై ర్దేవై రుక్తః కిల పితామహః;
క్రీడనీయక మిచ్ఛామో దృశ్యం శ్రవ్యంచ యద్భవేత్.
నచ వేదవిహారోఽయం సంశ్రావ్య శ్శూద్రజాతిషు;
తస్మాత్సృజాపరం వేదం పఞ్చమం సార్వవర్ణికమ్.
ఏవ మస్త్వితి తా నుక్త్వా దేవరాజం విసృజ్యచ;
సస్మార చతురో వేదా న్యోగ మాస్థాయ తత్త్వవిత్.
ధర్మ్య మర్థ్యం యశస్యం చ సోపదేశం ససంగ్రహమ్;
భవిష్యతశ్చ లోకస్య సర్వకర్మానుదర్శకమ్.
సర్వశాస్త్రార్థసంపన్నం సర్వశిల్పప్రవర్తకమ్;
నాట్యాఖ్యం పఞ్చమం వేదం సేతిహాసం కరోమ్యహమ్.

సంకల్ప్య భగవా నేవం సర్వా న్వేదా ననుస్మరన్;
నాట్యవేదం తత శ్చక్రే చతుర్వేదాఙ్గసంభవమ్.
జగ్రాహ పాఠ్యం ఋగ్వేదా త్సామభ్యో గీత మేవచ;
యజుర్వేదా దభినయా న్రసా నాథర్వణాదపి.
వేదోపవేదై స్సంబద్ధో నాట్యవేదో మహాత్మనా;
ఏవ నారదసంయుక్తో వేదవేదాఙ్గకారణమ్.
ఉపస్థితో ఽహం లోకేశం ప్రయోగార్థం కృతాఞ్జలిః;
నాట్యస్య గ్రహణం ప్రాప్తం బ్రూహి కింకరవా ణ్యహమ్'
భరత. ౧-(౧౧-౧౮).

3

నాట్యప్రయోజనము :

౧. ఇట్లు బ్రహ్మచేత నీనాట్యవేదము దేవతల కొఱకు చేయఁబడినదగుటంబట్టి దీనిప్రయోగమునకు అసురులు విఘ్నములు గావించిరి. అంతట బ్రహ్మ యీవేదము వారికి సయితము చేయఁబడినదనియును, దీనిస్వరూప ప్రయోజనము లిట్టివనియుఁ జెప్పి వారిని సమాధానపఱచినాఁడు.

"దేవానాం వచనం శ్రుత్వా బ్రహ్మ విఘ్నా నువాచహ;
కథం భవన్తో నాట్యస్య వినాశార్థ ముపస్థితాః.
బ్రహ్మణో వచనం శ్రుత్వా విరూపాక్షో ఽబ్రవీ ద్వచః;
యో ఽయం భగవతా సృష్టో నాట్యవేద స్సురేచ్ఛయా.
ప్రత్యాదేశో ఽయ మస్మాకం సురార్థం భవతా కృతః;
తత్తైవ దేవం కర్తవ్యం త్వయా లోకపితామహ.
యథా దేవా స్తథా దైత్యా స్త్వత్తః పూర్వవినిర్గతాః;
విరూపాక్షవచః శ్రుత్వా బ్రహ్మ వచన మబ్రవీత్.
అలం వో మన్యునా దైత్యా విషాద స్త్యజ్యతా మయమ్;
భవతాం దేవతానాంచ శుభాశుభవికల్పకః.
కర్మభావాన్వయాపేక్షీ నాట్యవేదో మయా కృతః;
నైకాన్త తో ఽత్ర భవతాం దేవానాం వాపి భావనమ్.
త్రైలోక్య స్యాస్య సర్వస్య నాట్యం భావానుకీర్తనమ్;
క్వచి ద్ధర్మః క్వచి త్క్రీడా క్వచి దర్థః క్వచిచ్ఛ్రమః.
క్వచిద్ధాస్యం క్వచి ద్యుద్ధం క్వచి త్కామః క్వచిద్వధః;
ధర్మో ధర్మప్రవృత్తానాం కామః కామార్థసేవినామ్.
నిగ్రహం దుర్వినీతానాం మత్తానాం దమనక్రియా;
క్లీబానామపి ధార్ష్ట్యానాం వా ఉత్సాహః శూరమానినామ్.
అబోధానాం విబోధశ్చ వైదగ్ధ్యం విదుషామపి;
ఈశ్వరాణాం విలాసశ్చ స్థైర్యం దుఃఖార్దితస్య చ.
సర్వోపజీవినా మర్థో యతి రుద్విగ్నచేతసామ్;
నానాభావోపసంపన్నం నానావస్థాన్తరాత్మకమ్.
లోకవృత్తానుకరణం నాట్య మేత న్మయా కృతమ్;
ఉత్తమాధమమధ్యానాం నరాణాం కర్మసంశ్రయం.
హితోపదేశజననం ధృతిక్రీడాసుఖాదికృత్;
దుఃఖార్తానాం సమర్థానాం శోకార్తానాం తపస్వినామ్.
విశ్రాన్తి జననం కాలే నాట్య మేత న్మయా కృతమ్;
ధర్మ్యం యశస్య మాయుష్యం హితం బుద్ధివివర్ధనమ్.
లోకోపదేశజననం నాట్య మేత ద్భవిష్యతి;
న త చ్ఛాస్త్రం న త చ్ఛిల్పం న సా విద్యా న సా కలా.
నాసౌ యోగో న తత్కర్మ యన్నాట్యే ఽస్మిన్న దృశ్యతే;
తన్నాత్ర మన్యుః కర్తవ్యో భవద్భి రమరాన్ప్రతి.
యస్మాత్ర కారణం నాట్య మేత త్తద్య న్మయా కృతమ్;
దేవానా మసురాణాంచ రాజలోకస్య చైవహి.
బ్రహ్మర్షీణాంచ విజ్ఞేయం నాట్యం వృత్తాంతదర్శకమ్;
యో ఽయం స్వభావో లోకస్య సుఖదుఃఖసమన్వితః.
సో ఽఙ్గాద్యభినయో పేతో నాట్య మి త్యభిధీయతే;
వేదవిద్యేతిహాసానా మర్థానాం పరికల్పనమ్.
వినోదకరణం లోకే నాట్య మేత ద్భవిష్యతి."
భరత. ౧—(౬౪-౮౬).

౨. వ్యుత్పత్త్యానందరూపములయిన యీబ్రహ్మోక్త ప్రయోజనములనే విద్వాంసులు అనువదించుచు వచ్చిరి.

౩. "ఆనన్దనిష్యన్దిషు రూపకేషు
వ్యుత్పత్తిమాత్రం ఫల మల్పబుద్ధిః;
యో ఽపీతిహాసాదివ దాహ సాధు
స్తస్మై నమః స్వాదు పరాఙ్ముఖాయ."
—దశరూపకము.

ఆ. "కావ్యం యశసే ఽర్థకృతే
 వ్యవహారవిదే శివేతరక్షతయే;
సద్యః పరనిర్వృతయే
 కాన్తా సమ్మితత యోపదేశయుజే."
 —కావ్యప్రకాశము.

ఇ. "విశ్వశ్రేయః కావ్యం
 తదదోషా పరిష్కృతా చ వాగర్థా;
సా వా గ్యా రసవృత్తిః
 సాధ్యో హి రసో యథాతథం కవిభిః.
స్వస్థానవేష భాషా
 భిమతా స్సన్తో రసప్రలుబ్ధధియః;
లోకే బహుమన్యన్తే
 వైకృతకావ్యాని చాన్య దపహాయ."
 —ఆంధ్రశబ్ద చింతామణి.

## ౪

### నాట్యమండపము:

౧. అనంతరము భరతముని నాట్యమండపము (=ప్రేక్షాగృహము) యొక్క విధానమును స్థూలసూక్ష్మ విషయవిస్తరముతో నుపదేశించుచున్నాడు:

"ఇహ ప్రేక్షాగృహం దృష్ట్వా ధీమతా విశ్వకర్మణా;
త్రివిధ స్సన్ని వేశశ్చ శాస్త్రతః పరికల్పితః.
వికృష్ట శ్చతురశ్రశ్చ త్ర్యశ్రశ్చైవతు మణ్డపః;
తేషాం త్రీణి ప్రమాణాని జ్యేష్ఠం మధ్యం తథావరమ్.
ప్రమాణ మేషాం నిర్దిష్టం హ స్తదణ్డసమాశ్రయమ్;
శతం చాష్ట (౧౦౮ మూరలు) చతుష్షష్టి (౬౪ మూరలు)
 హస్తా ద్వాత్రింశ (౩౨ మూరలు) దేవచ.
అష్టాధికం శతం జ్యేష్ఠం చతుష్షష్టిస్తు మధ్యమమ్;
కనీయస్తు తథా వేశ్మ హస్తా ద్వాత్రింశ దిష్యతే.
దేవానాంతు తథా జ్యేష్ఠం నృపాణాం మధ్యమం భవేత్;
శేషాణాం ప్రకృతీనాంతు కనీయః సంవిధీయతే.

* * * *

కనీయస్తు స్మృతం త్ర్యశ్రం చతురశ్రంతు మధ్యమమ్;
జ్యేష్ఠం వికృష్టం విజ్ఞేయం నాట్యవేద ప్రయోక్తృభిః."
 భరత. ౨-(౮-౧౪).

౨. అందు మర్త్యోచితముయొక్క పరిమాణము:
"చతుష్షష్టికరా (64 cubits) కార్యా
 దీర్ఘ త్వేన తు మణ్డపమ్;
ద్వాత్రింశతం (32 cubits) చ విస్తారా
 న్మర్త్యానాం యో భవే దిహ."

౩. అంతకన్న నధికప్రమాణమయినచో సామాజికులకు నటముఖదృష్ట్యాదిసూచితభావములు వ్యక్తపడవు; పాఠ్యము వినఁబడదు; ప్రతిధ్వనియుఁ గలుగును; స్వరమును వికృతమగును.

"అత ఊర్ధ్వం న క ర్తవ్యః క ర్తృభి ర్నాట్యమణ్డపః;
యస్మా దవ్య క్తభావం హి తత్ర నాట్యం ప్రజే దితి.
మణ్డపే విప్రకృష్టేతు పాఠ్య ముచ్చారిత స్వరమ్;
అనిస్సరణధర్మత్వా ద్విస్వరత్వం భృశం వ్రజేత్.
యస్య లాస్యగతో భావో నానాదృష్టి సమన్వితః;
సర్వేభ్యో విప్రకృష్టత్వా ద్వ్రజే దవ్య క్తతాం పరామ్.
ప్రేక్షాగృహాణాం సర్వేషాం తస్మాన్మధ్యమ మిష్యతే;
యావ త్పాఠ్యంచ గేయంచ తత్ర శ్రవ్యతరం భవేత్."
 భరత. ౨-(౨౦-౨౪).

౪. అఱువదినాల్గుకరముల నిడుపులో వెనుకటి యెనిమిదికరములు నేపథ్యగృహము, దానిముందటి యెనిమిదికరములు రంగశీర్షమునుం గావలయునని విస్తరము. అనంతరము క్రమముగ భిత్తికర్మవిస్తరము, స్తంభకర్మవిస్తరము. రంగశీర్షమున ఆఱుదారువు లుండవలయును. రంగపీఠము అద్దమువలె నునుపుగా నుండవలయును. నేపథ్యగృహమునకు రంగములోనికి రెండుద్వారము లుండవలయును.

"ఏవం విధం ప్రక ర్తవ్యం రంగశీర్షం ప్రయత్నతః;
కూర్మపృష్ఠం నక ర్తవ్యం మత్స్యపృష్ఠం తథైవచ.
శుద్ధాదర్శతలప్రఖ్యం రఙ్గపీఠం ప్రశస్యతే."
 భరత. ౨-(౬౧-౬౨).

౫. అనంతరము దారుకర్మవిస్తరము:
"ఏవం రఙ్గశిరః కృత్వా దారుకర్మ ప్రయోజయేత్;
ఊహాప్రత్యూహసంయుక్తం నానాశిల్పప్రయోజితమ్.

నానాపక్షిగణోపేతం బహువ్యాళోపశోభితమ్;
అష్టాలభఞ్జికాభిశ్చ సమన్తా త్సమలంకృతమ్.
నిర్యూహకుహరోపేతం నానాగ్రథిత వేదికమ్;
నానావిన్యాససంయుక్తం యన్త్రజాలగవాక్షకమ్.
సుపీఠధారణీయుక్తం కపోతాలీ సమాకులమ్;
నానాకుట్టిమ విన్యస్తైః స్తంభై శ్చాప్యుపశోభితమ్."

భరత. ౨-(౬౪-౬౭).

౬. అనంతరము నాట్యమండపాకారాది విస్తరము:

"కార్యః శైలగుహాకారో ద్విభూమి ర్నాట్యమండపః;
మన్దవాతాయనోపేతో నిర్వాతో ధీరశబ్దవాన్.
తస్మా న్నివాతః కర్తవ్యః కర్తృభి ర్నాట్యమండపః;
గంభీరస్వరతా యేన కుతపస్య భవిష్యతి."

భరత. ౨-(౬౯-౭౦).

౭. నిర్వాతము గంభీరస్వరత్వప్రదము.

౮. అనంతరము భిత్తిపై చిత్రకర్మవిస్తరము:

"భిత్తికర్మవిధిం కృత్వా భిత్తిలేపం ప్రదాపయేత్;
సుధాకర్మవిధి స్తస్య విధాతవ్యః ప్రయత్నతః.
భిత్తి ష్వథ విలిప్తాసు పరిమృష్టాసు సర్వతః;
సమాసు జాతశోభాసు చిత్రకర్మ ప్రయోజయేత్.
చిత్రకర్మణి చాలేఖ్యాః పురుషాః స్త్రీజనా స్తథా;
లతాబన్ధాశ్చ కర్తవ్యా శ్చరితం చాత్మభూమిజమ్.
ఏవం వికృష్టం కర్తవ్యం నాట్యవేశ్మ ప్రయోక్తృభిః."

భరత. ౨-(౭౧-౭౪).

౯. ఇట్లు వికృష్టప్రేక్షాగృహమువరకుం జెప్పి, చతురశ్రమున సోపానపీఠముసయితము కర్తవ్యమని తన్నిర్మాణప్రకారముం జెప్పుచున్నాఁడు:

"స్తంభానాం బాహ్యతశ్చాపి సోపానాకృతిపీఠకమ్;
ఇష్టకాదారుభిః కార్యం ప్రేక్షకాణాం నివేశనమ్.
హస్తప్రమాణై రుత్సేధై ర్భూమిభాగసముత్థితైః;
రంగపీఠావలోక్యంతు కుర్యా దాసనజం విధిమ్."

భరత. ౨-(౭౯-౮౧).

## ౫

### ప్రేక్షాగృహమందు ప్రథమ ప్రయుక్తము:

౧. విశ్వకర్మచేత నిట్లు దివ్యమయిన ప్రేక్షాగృహము నిర్మింపఁబడినంతట భరతుఁడు బ్రహ్మను ఏమి ప్రయోగింతునని యడుగఁగా బ్రహ్మ తా రచించిన యమృతమంథనసమవకారము నాడుమనెను. భరతముని యట్లే కావించెను.

## ౬

### ప్రథమడిమము, తాండవవిద్యాప్రాప్తి:

౧. పిమ్మట కొంతకాలమునకు బ్రహ్మ కైలాసమునకు భరతమునిం గొనిపోయి అట మహేశ్వరునిమ్రోల త్రిపురదాహ మనుడిమమును ఆడించెను.

౨. అందుల కత్యంతప్రీతుఁడై మహేశ్వరుఁడు నాట్యోపయోగులయిన లాస్యతాండవవిద్యలసర్వస్వమును భరతునికి నేర్పుమని తండువున కాజ్ఞాపించెను. అతఁడట్లే కావించెను. అతనివలన భరతముని నృత్తమును, తదీయాంగహారములను,కరణములను,రేచకములనుసకలాంగసకలాభినయములను నేర్చుకొనెను. ఆవిధముగా నాట్యముతో నృత్తప్రయోగముకూడఁ జేర్పఁబడినది.

## ౭

### నృత్తప్రయోజనము:

" అభినయముచే అర్థము విశదమగును కావున దానిం జేర్పవలసినదే; నృత్తమువలన నేప్రయోజనము కనఁబడకున్నది, దాని నేల చేర్చితిరి?" అని మును లడుగఁగా భరతుఁడు దానిని వినోదకరణముగాఁ జేర్చితి నని చెప్పుచున్నాఁడు:

"ఋషయ ఊచుః:
యథా ప్రాప్త్యర్థ మర్థానాం తజ్జ్ఞై రభినయః స్మృతః;
కస్మా న్నృత్తం కృతం హ్యేత త్కం స్వభావ మపేక్షతే.
న గీతకార్థసంబద్ధం న చా ప్యర్థస్య భావకమ్;
కస్మా న్నృత్తం కృతం హ్యేత ద్గీతే ష్వాసారితేషు చ.

భరత ఉవాచ:
అత్రోచ్యతే నఖల్వర్థం కఞ్చి న్నృత్త మపేక్షతే;
కింతు శోభాం జనయతా మితి నృత్తం ప్రవర్తితమ్.

ప్రాయేణ సర్వలోకస్య నృత్త మిష్టం స్వభావతః;
మఙ్గళ్య మితి కృత్వా చ నృత్త మేత త్ప్రకీర్తితమ్.
వివాహప్రసవావాహప్రమోదాభ్యుదయాదిషు;
వినోదకరణం చేతి నృత్త మేత త్ప్రవర్తితమ్."

భరత. ౨-(౨౪౩-౨౪౮).

ఇప్పటి ప్రయోగములలో నృత్తము ఉపేక్షితము.

౭

ధర్మిద్వయము:

నాట్యమందు లోకధర్మియనియు, నాట్యధర్మియనియు నిరుదెఱంగులు గలవు. లోకధర్మియందు వస్తువు ఎట్లు జరిగినదో అట్లే రచితమగును; అట్లే ప్రయోగింపఁబడును. నాట్యధర్మియందు నృత్తము, గీతము, శాస్త్రోక్తాభినయము, పద్యములను రంజనార్థము చేర్పఁబడును; ప్రయోగింపఁబడును. కాళిదాసాది మహాకవుల నాటకములయందు రంజనార్థము పద్యములుమాత్రము రచింపఁబడినవి. వానియందు నృత్తగీతములు కథావస్తువులో వచ్చెనా అవి ఆకథావస్తువులో ఉండినట్టివనియే భావము. అంతియకాని పాత్రవాక్యములన్నియు ప్రాయికముగా నేనియు గీతికలుగానే యుండవు. ఈధర్మిభేదములను భరతాచార్యుఁ డిట్లు వివరపఱుచుచున్నాఁడు:

"ధర్మీయా ద్వివిధా ప్రోక్తా మయా పూర్వం ద్విజోత్తమాః;
లౌకికీ నాట్యధర్మీ చ తయో ర్వక్ష్యామి లక్షణమ్.

స్వభావభావోపగతం శుద్ధం త్వవికృతం తథా;
లోకవార్తాక్రియోపేత మఙ్గలీలావివర్జితమ్;
స్వభావాభినయోపేతం నానాస్త్రీపురుషాశ్రయమ్;
య దీదృశం భవే న్నాట్యం లోకధర్మీతి సా స్మృతా.
యోఽయం స్వభావో లోకస్య సుఖదుఃఖక్రియాత్మకః;
శాస్త్రాభినయసంయుక్తో నాట్యధర్మీ ప్రకీర్తితా.
అతివాక్యక్రియోపేత మతిసత్త్వాతిభావికమ్;
లలితాఙ్గహారాభినయం నాట్యలక్షణలక్షితమ్.
సర్వాలఙ్కారసంయుక్త మశ్వస్థపురుషాశ్రయమ్;
యదీదృశం భవే న్నాట్యం నాట్యధర్మీతు సా స్మృతా.
లోకే యదభియోజ్యం తు భద్ర మత్రోపయుజ్యతే;
మూర్తిమత్సాభిలాషం చ నాట్యధర్మీతు సా స్మృతా.
అత్రోక్తం చైవ యద్వాక్యం న శృణ్వన్తి పరస్పరమ్;
అనుక్తం శ్రూయతే యచ్చ నాట్యధర్మీతు సా స్మృతా.
శైలయానవిమానాని చర్మవర్మాయుధధ్వజాః;
మూర్తిమన్తః ప్రయుజ్యన్తే నాట్యధర్మీతు సా స్మృతా.
లలితై రఙ్గవిన్యాసైః తథా క్షిప్తపదక్రమైః;
నృత్యతే గమ్యతే చాపి నాట్యధర్మీతు సా స్మృతా."

భరత. ౧౩-(౫౦-౫౬).

౮

నృత్తోదాహరణము:

రత్నావళీనాటకమందు ప్రథమాంకములో రాణిగారి చేటికలు వసంతోత్సవములో రాజునకును ఆమె యొక్క సందేశమును తెచ్చుచు దారిలో పౌరసంఘముతో పాడుచు, నర్తించుచు వచ్చిరి. అది చిత్రాంగి వకీలు అభియోగవాదమును, సారంగధరుని వకీలు రక్షణవాదమును, డలాయితు తన సాక్షికిలుపును, సాక్షులు తమకులనామాదికమును, సాక్ష్యములను, రాజరాజనరేంద్రుఁడు తనయునికాలు సేతులఁ నఱకుతీర్పును సవాద్యముగా ఆడి పాడుటవలెఁ గాక, కథావస్తూపాత్తవసంతోత్సవానుభవప్రకార మగుటచేత సుప్రసక్తమై యున్నది.

"విదూషకః—(విలోక్య) ఏదంపి దావ సువియద్ధజణ జలధరిద సింగకజల ప్పహారముక్క సిక్కార మణోహారం వారవిలాసిణీ విలసిదం అలోఏదు పిఅవఅస్సో.

[విదూ.—(చూచి) ప్రియవయస్యుఁడా, బలే జాణలయిన పరసులు సూటిదప్పక క్రోవులతో చిమ్మిన వసంతాలపోట్లకి సీత్కారంచేస్తూ ఈ భోగాల యెమ్మెకత్తెలు ఏలాగు విలపిస్తున్నారో చూడు.]

రాజా—(విలోక్య) వయస్య, సమ్యగ్దృష్టం త్వయా; కుతః:

అస్మిన్ ప్రకీర్ణపటవాసకృతాన్ధకారే
దృష్టో మయా మణివిభూషణరశ్మిజాలైః;
పాతాళ ముద్యతఫణాకృతిశృఙ్గకోఽయం
మా మద్య సంస్మరయతీవ భుజఙ్గలోకః.

[రాజా—(చూచి) వయస్యుఁడా, సరిగా కని పెట్టితివి; ఏలన:

ఉ. మానక రాలు బుక్క. బలు
మబ్బులు చేసెడి చిమ్మచీఁకటిన్
గావఁగనా చోకింత మణి
కాంచనభూషణరశ్మిపాళిచే
పూనికఁ గ్రోవుల న్ఫణల
పోలిక నెత్తుభుజంగలోక మా
ధ్యానము మీఱ నన్ను బలి
ధామమునన్ స్మరింపఁజేసెడిన్.]

విదూషకః—(విలోక్య) భో వఅస్స, ఏసా క్ఖు అణేఅ మఅపరిసం వసంతాభిణఅం ణచ్చంతీ చూదలదిఆఏ సహ, ఇదో జ్జేవ్వ ఆఅచ్ఛది త్తి అవలోఏదు పిఅవఅస్సో.

[విదూ.—(చూచి) ఓ వయస్యుఁడా, ఇదుగో మదనిక మత్తుకు తగినట్లు వసంతాభినయం చేస్తూ చూతలతికతో కూడా ఇక్కడికే వస్తూ వున్నది. చూడు ప్రియవయస్యా.]

(తతః ప్రవిశతో మదనలీలాం నాటయన్త్యౌ ద్విపదీ ఖణ్డం గాయన్త్యౌ చేట్యౌ.)

[అంతట మదనలీలను నటించుచు, ద్విపదీఖండముం బాడుచు ఇరువురు చేటికలు ప్రవేశింతురు.]

(మదనికా గాయతి.)

[మదనిక పాడును.]

కుసుమాఉహ పిఅదూఅఓ మఉలాఇద బహుచూఅఓ,
సిఢిలిఅ మాణగ్గహణఓ వాఅయిదాహిణపవణఓ,
విఅసిఅవఉలాసో అఓ కంఖిఅ పిఅఅణమేలఓ,
పడివాలణఅసమత్థఓ ఛమ్మఇ జువఈసత్థఓ.

[గేయము.

వలకడ తెమ్మెర వచ్చెనే వలరాజు నానతిఁ దెచ్చెనే
ఎలనాఁగలను గంటగించెనే ఎలమావులను వనిపించెనే
పొగడతావుల వెదపల్లెనే మగువల మగలపై వల్లెనే
తోఁగకంటియిఁ(?)ాలువు త్రుంచెనే చిగురుఁబోఁడుల గుండె
సించెనే.]

ఇహ పఢమం మహుమాసో జణస్స హిఅఆఇఁ కుణఇ మిఉలాఇ
పచ్ఛా విజ్ఝఇ కామో లద్ధప్పసరేహిఁ కుసుమబాణేహిఁ.[ఇఁ;

[క. మునుమును మధుమాసం బిట
జనుల యెడదల మెత్తఁబఱచుఁ జయ్యన నంతన్
అనుపోటుఁ జొరఁగఁ గాముఁడు
మునుకొని కాడంగ నేయుఁ బువుబాణములన్.]

రాజా—(నిర్వర్ణ్య) అహో మధురోఽయ మాసాం నిర్భరః క్రీడారసః. తథా హి.

[రాజు—(చూచి) ఆహా! యీ చేడెల యాటతమి పాటిమీఱి మనోహరముగా నున్నది. అట్లే కదా.]

స్రస్తః స్రగ్దామశోభాం త్యజతి విరచితా
మాకులః కేశపాశః
క్షీబాయా నూపురౌ చ ద్విగుణతర మిమౌ
క్రన్దతః పాదలగ్నౌ;
వ్యస్తః కమ్పానుబన్ధా దనవరత మురో
హన్తి హారోఽయ మస్యాః
క్రీడన్త్యాః పీడయేవ స్తనభర వినమ
న్మధ్యభఙ్గానపేక్షమ్.

[ఉ. వేనలి ప్రస్తమై చెదరి
పీడ్కొనె వల్లిన యెత్తుపోఁడిమిన్
మానక పాద మంటి యిను
మట్టుగఁ గ్రందిలుచున్న వందియల్
పూనుచుఁ గంప మిట్టటయి
మోఁదుచు నున్నది హార మక్కునన్
గాను కుచాద్రినమ్రము ర్తె
గంబడ మత్త నటించు పీడనాన్.]

విదూషకః—(సహాసం) భో వఅస్స అహం పి ఏదాణం బద్ధపరిఅరాణం, మజ్ఝే ణచ్చన్తో గాఅన్తో మఅణమహూస్సవం, సంమాణఇస్సమ్.

[విదూ—(నవ్వుచు) వయస్యుఁడా, నేనుగూడా కాసెగట్టినయీచేడెలమధ్య ఆడుతూపాడుతూ వసంత సేవు వహోత్సవంబుఁగని గౌరవించి వస్తాను.]

రాజా—(సస్మితమ్) వయస్య, ఏవం క్రియతామ్.

[రాజు—(చిఱునగవుతో) వయస్యా, అట్లే చేయుము.]

విదూషకః—జంభవం ఆణవేది త్తి. (ఇత్యుత్థాయ చేట్యోర్మధ్యే నృత్యతి.)...

[విదూ.—సీయాజ్ఞ. (అని లేచి చేటికలనడుమ నర్తించును.)...]"

౧౦

రత్నావళీప్రయోగము:

౧. ఈ సంస్కృతరూపకములను ఎన్నఁడేని ఎవ రేని ఆడియుందురా అనియుం గొందఱు ప్రశ్నించుట గలదు.—ఒకా నొకప్పుడు దామోదరమిత్రుఁడను నొక మహామాత్యుఁడు తన తోఁడు వసంతోత్సవములో మంచి నాటక మాడింపుమని యడుగఁగా ఈరత్నావళీనాటిక నాడించెను. ప్రయోగమందు మహామంత్రి నాటికార్థమై తనపౌరులే ఆగ్రంథములో వర్ణింపఁబడినట్లు స్త్రీలతోఁ గూడ సర్వాభరణభూషితులై విభవోత్తరముగా క్రోవు లతో సెజ్జనీ రొండొరులపైని, వేశ్యలపైనిం జల్లుచు, పట్టి బుక్కాసాదుముచే సంధ్యారాగముం గావించుచు, భోగ ము మేళములతోఁగూడ నృత్తగీతవాద్యములతో నేని ప్రోల నాటికాప్రయోగములో నతని మేడవెంబడి నేఁగు నట్లు గావించెను. ఈవృత్తాంతమును, నటసంఘమునకు నాతిచ్చిన బహుమతులవివరమును, ఈ నాటకకథను ఆమ హామంత్రియే ఆర్యావృత్తముల నొకగ్రంథముగా రచించి నాఁడు. ఇందువలన నీనాటకములపై మనపూర్వులకు ఎంతగులి యుండెనో, రాజమంత్రులును ఎట్టి విద్వన్న కేణ్యులుగ నుండిరో ఎఱుకపడును.

౨. మాళవికాగ్నిమిత్రములో గణదాసుఁ డను నాట్యాచార్యుఁడు ఆత్మోత్కర్షపరముగా ఈ నాట్య ధర్మినే ఇట్లు ప్రశంసించినాఁడు:

" దేవానా మిద మామనంతి మునయః
కాన్తం క్రతుం చాక్షుషమ్
రుద్రేణేద ముమాకృతవ్యతికరే
స్వాఙ్గే విభక్తం ద్విధా;
త్రైగుణ్యోద్భవ మత్ర లోకచరితం
నానారసం దృశ్యతే
నాట్యం భిన్నరుచే ర్జనస్య బహుధా
ప్యేకం సమారాధనమ్."

౩. భరతుని గ్రంథమున నాట్యమునకు వలయు విషయము సవిస్తరముగా చెప్పనిది లేదు. ఏపాత్రము నకు ఏరంగో, రంగుల నెట్లు చేసుకొనవచ్చునో, టోపాలు గీపాలు లోనగునవి యెట్లో, ఇట్టివిస్తరము లెల్ల చెప్పఁబడి యున్నవి. దానిం జదివి యనుసరించు ప్రయోగములు మహోత్కృష్టము లగును.

౧౧

వ్యుత్పాదనోదాహరణములు:

౧. దశరూపకమందుఁ జెప్పిన యానందవ్యుత్ప త్తులలో ఆనందము మధుమాధుర్యమువలె నమభవైక వేద్యము. వేల్పు నేని ప్రార్థనయందును, నలువ యుత్తర మందును వ్యుత్పత్తిరూపప్రయోజనము సామాన్యముగాఁ జెప్పఁబడియున్నది. అందులవిశేషములకయి యొక కొన్ని యుదాహరణములు మహాకవులనాటకములనుండి యొసంగెద:

౧. శాకుంతలము నుండి—

" ౧. అసంశయం క్షత్రపరిగ్రహక్షమా
యదార్య మస్యా మభిలాషి మే మనః;
సతాం హి సందేహపదేషు వస్తుషు
ప్రమాణ మన్తఃకరణప్రవృత్తయః."

[అ. సందియంబు లేదు క్షత్రార్హ తారుణ
మార్య నీమనంబ యభిలషించె

సజ్జనులకు వస్తువం దేహములయందుఁ
దనమనః ప్రవృత్తిఁ దన్నివృత్తి.]

౨. "అయం స తే తిష్ఠతి సంగమోత్సుకో
విశఙ్కసే భీరు యతో ఽవధీరణామ్;
లభేత వా ప్రార్థయితా న వా శ్రియం
శ్రియా దురాపః కథ మీప్సితో జనః".

[ఆ. అనుమతించు నెవ్వఁ డని వెఱచెదొ బాల
వాఁడె నిన్ను వలచి వాడె నిట్లు
సిరిని గోరువాఁడు చెందునో చెందఁడో
సిరియ కోరనేని చెంద దనని.]

౩. "శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీ
వృత్తిం సపత్నీజనే
భర్తు ర్విప్రకృతాఽపి రోషణతయా
మాస్మ ప్రతీపం గమః;
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే
భాగ్యే ష్వనుత్సేకినీ
యా న్త్యేవం గృహిణీపదం యువతయో
వామాః కులస్యాధయః."

[చ. గురువులఁ గొల్వు భక్తిఁ జెలి
కూటమిగాఁ గనుమీ సపత్నులన్
వరుఁడు శపించినన్ గినుక
పట్టి కువాదము పల్క కెప్పుడున్
పరిజనమున్ దయ న్మనుపు
భాగ్యము లైనను బొంగకింతు లీ
వెరవునఁ గాంతురమ్మ గృహి
ణీపదమున్ కుటిలల్ కులవ్యథల్.]

౪. "అర్థో హి కన్యా పరకీయ ఏవ
తా మద్య సంప్రేష్య పరిగ్రహీతుః;
జాతో మమాయం విశదప్రకాశః
ప్రత్యర్పితన్యాస ఇవాంతరాత్మా."

[తే. కన్య యనఁ గాద జగతిలో నన్యసొమ్ము
దానిఁ బతిఁ జేరఁ బంపిన తత్క్షణంబ
అతివిశదమయ్యె నార వా యంతరాత్మ
యిల్లడను గాచి యొడయని కిచ్చినట్లు.]

౫. "పతీమపి జ్ఞాతికులైకసంశ్రయాం
జనో ఽన్యథా భర్తృమతీం విశఙ్కతే;
అత స్సమీపే పరిణేతు రిష్యతే
ప్రియాఽప్రియా వా ప్రమదా స్వబన్ధుభిః."

[శా. పాతివ్రత్య మహోనిధాన మయినన్
భావింతు రట్లట్లుగా
జ్ఞాతివ్రాత కులైకసంశ్రయరతన్
సానాథ్యభిద్రన్ జనుల్
కాతర్యంబు వహించి యాకతమునన్
గాంక్షింపుదు ర్బాంధవుల్
చేతం గూర్పఁగ నప్రియం బ్రియమునగా
నీ నెవ్వడిన్ జన్యవిన్.]

౬. "ఇదం తత్ప్రత్యుత్పన్నమతి స్త్రైణమితి యదుచ్యతే.
స్త్రీణా మశిక్షితపటుత్వ మమానుషీషు
సంస్దృశ్యతే కిముత యాః ప్రతిబోధవత్యః;
ప్రాగన్తరిక్షగమనా త్స్వ మపత్యజాత
మన్యై ర్ద్విజైః పరభృతాః ఖలు పోషయన్తి."

[మత్త. స్త్రీల మానుషజాతులందె య
శిక్షసత్ప్రతిభల్లదా
మేలు బోధన గల్గు మానుషి
మేధ శక్యమె చెప్పఁగా
లీల నన్యఖగాళిచేఁ దన
లేతకందుల నింగిఁ బోఁ
జాలు నం తెనిపించునా నెఱ
జాణఁ గోయిలఁ గావమే.]

(క. జగమెల్ల నెఱుఁగు నొక తెకు
నగణితముగ నిద్ధమైన నంబుధి నెఱుఁగున్
మగరాఁడువారు గూడిన
మగజాకర, పట్టపగలు చుక్కలు వొడుచున్.

ఆ యర్థాంతరన్యాసమునకును, ఈయుతికిని గల తారతమ్యముం గనుఁడు.)

౭. "యేన యేన వియుజ్యంతే ప్రజా స్స్నిగ్ధేన బన్ధునా;
స స పాపా దృతే తాసాం దుష్యన్త ఇతి ఘుష్యతామ్"

[క. ఏ రేఁ ప్రియబంధువు సెడఁ
బాయుదురో జనులు వారిపాలన నఘుఁడా
నాయమ్మున దుష్యంతుం
డాయాబంధునని చాటుఁ డతివిశదముగాన్.]

౨. ఉత్తరరామచరితమునుండి యించుక—

౧. "జామాతృయజ్ఞేన వయం నిరుద్ధా
స్త్వం బాల ఏవాసి నవంచ రాజ్యమ్;
యుక్తః ప్రజానా మనురఞ్జనే స్యా
స్తస్మా ద్యశో యత్పరమం ధనం వః."

[గీ. అల్లుని మఖంబు సంకెల యయ్యె మాకు
క్షీరకంఠుఁడ వేలెదుదారి క్రొత్తి,
ప్రజల రంజింపఁ దివురు మెప్పాటనైన
దాన నగుకీర్తియే మేలిధనము మాకు.]

౨. "సతాం కేనాపి కార్యేణ లోకస్యారాధనం వ్రతమ్;
యత్పూరితంహి తాతేనమాంచప్రాణాంశ్చముంచతా."

[క. ఏ కార్యముచేనైనను
లోకారాధనమె సాధులోకవ్రతమౌ
ఆకరణి నను నసుల విడ
నీకొని మాయయ్య దానినే కద నెఱపెన్.]

౩. "స్నేహం దయాంచ దాక్షిణ్యం యదివా జానకీమపి;
ఆరాధనాయ లోకస్య ముఞ్చతో నాస్తి మేవ్యథా."

[తే. అర్మిలినిగాని, దయఁగాని, హాయిఁగాని
అది యిదననేల, జానకినైనఁగాని,
ప్రజల యనురంజనమునకై విడలు నాకు
హృదయమునఁ గల్గ దిసుమంతయేని వంత.]

"వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి;
లోకోత్తరాణాంచేతాంసికస్తాన్ప్రత్యేతుమర్హతి."

[క. స్వరుపుసకన్నఁ గఠినములు
విరికన్నను గోమలములు విశ్వాతిసులౌ
పురుషవరేణ్యుల మనములు
తర మెవ్వరి కౌను వారితత్త్వముఁ దెలియన్.]

౪. "అపూర్వకర్మచండాల మయిముగ్ధే విముంచమామ్;
శ్రితాసి చన్దనభ్రాన్త్యా దుర్విపాకం విషద్రుమమ్."

[క. సేరనిముగుదా, విడు మది
చారముగ, నపూర్వకర్మచండాలు ననున్
చేరితివి చందనం బని
ఘోరవిపాకమును గాలకూటద్రుమమున్.]

౫. "రే హస్త దక్షిణ మృతస్య శిశో ర్ద్విజస్య
జీవాతవే విసృజ శూద్రమునౌ కృపాణమ్;
రామస్య గాత్ర మసి నిర్భరగర్భఖిన్న
సీతావివాసనపటోః కరుణా కుతస్తే".

[తే. కుడికరమ శూద్రమునిమీఁద విడు కృపాణి
విప్రబాలుఁడు మృతుఁడు జీవించుకొఱకు
కరుణ నీ కేడ దుర్భరగర్భఖిన్న
సీతఁ దరమిన రాముని గాత్రమునకు.]

"(కథంచిత్ ప్రహృత్య) కృతం రామసదృశం కర్మ.
అపి స జీవేత్ బ్రాహ్మణశిశుః."

[(ఎట్టకేలకు కొట్టి) రామసదృశమైన కర్మం గావించితిని. ఆబ్రాహ్మణపుత్రుఁడు బ్రదుకును గాక!]

"(ప్రవిశ్య)
దివ్యపురుషః—జయతు జయతు దేవః."

[దివ్యపురుషుఁడు— (ప్రవేశించి) జయము జయము దేవరకు.]

౬. "దత్తాభయే త్వయి యమాదపి దణ్డధారే
సంజీవితః శిశురసౌ మమ చేయమృద్ధిః;
శమ్బూక ఏష శిరసా చరణౌ నతస్తే
సత్సంగజాని నిధనాన్యపి తారయన్తి"

[ఉ. నీవు కృతాంతునుండియును
నిర్భయ మిచ్చి ధరింప దండమున్
జీవన మొందె నీశిశువు
చెందితి నిట్టిశుభంబు నేనునున్
దేవర శంబుకుండను
ద్వదీయపదంబుల మ్రోలఁ జేర్చెదన్
జావులుగూడ సాధుజన
సంగభవంబులు తారకంబులౌ.]

"రామః—ద్వయమపి ప్రియం నః. తదనుభూయతా ముగ్రస్య తపసః పరిపాకః."

[రాముడు—రెండును మాకు ప్రియములు. మఱి యనుభవింపుము ఉగ్రమైన తపంపు ఫలమును.]

౭. "యత్రానందాశ్చ మోదాశ్చ యత్ర పుణ్యాశ్చసంపదః;
వైరాజా నామ తేలోకాస్తైజసా స్సంతు తే ధ్రువాః."

[తే. ఎందు మోదంబు లెసఁగు నానందము లగు
నెందుఁ బుణ్యంపుసంపద లింపుమీఱు
తైజసములు వైరాజాభిధానకములు
నయిన లోకంబులు ధ్రువంబు లగుత నీకు.]

"శమ్బూకః—యోఽయం మత్త్వత్ప్రసాదోపాదాన ఏవ. మహిమా. కిమత్ర తపసా. అథవా మహ దుపకృతం తపసా."

[శంబూకుఁడు – ఈమహిమ మీ ప్రసాదమునకు ఫలముగాని తపస్సునకుఁ గాదు. అయిన నట్లనఁ గూడదు. తపస్సే నాకు మహోపకారముం గావించినది.]

౮. "అన్వేష్టవ్యో యదసి భువనే భూతనాథ శ్శరణ్యః
మామన్విష్యన్నిహ వృషలకం యోజనానాం శతాని;
క్రాన్త్వా ప్రాప్తస్స ఇహ తపసస్సంప్రసాదోఽన్యథా చేత్
క్వాయోధ్యాతః పునరుపగమో దణ్డకాయాం వనే వః."

[చ. వెదకుదు రెల్లవారలు భు
విన్ నిను భూతపతిన్ శరణ్యునిన్
వెదకుచు నన్ను దుర్వృషలు
నీ పరు దెంచితి నూఱులామడల్
ఇదియె తపఃప్రసాదము
మహిమ్నము కాక యయోధ్యనుండియున్
బన మిందు దేల వెండియును
భానుకులాగ్రణి, దండకాటవిన్.]

"త్వం జీవితం త్వమసి మే హృదయం ద్వితీయం
త్వం కౌముదీ నయనయో రమృతం త్వ మఙ్గే;
ఇత్యాదిభిః ప్రియశతై రనురుధ్య ముగ్ధాం
(నిశ్వస్య)తా మేవ శాన్త మథవా కిమి హోత్తరేణ."

[ఉ. ఈవె మదీయజీవితము
నీవె ద్వితీయమనంబ నక్షులం
దీవె విశుద్ధకౌముదివి
యీవె సుధాపగ నంగమందునన్
ఈవహి వేలకున్ శతము
లిట్టుగము ల్పచరించి దానినే
(నిశ్వసించి) హో విధి, శాంతమూర్తి, మఱు
గా కిఁక నుత్తర మేల యూరకోవన్.]

౯. "జనకః—అహో నిర్దయతా దురాత్మనాం పౌరాణామ్ అహో రామస్య క్షిప్రకారితా."

[జనకుఁడు—అహో దురాత్ములైన పౌరుల కరుణ లేమి! అహో రాజు రాముఁడు తొందరపడుట!]

"ఏత ద్వైశస ఘోరవజ్రపతనం శశ్వ న్మమోత్పశ్యతః
క్రోధస్య జ్వలితుం ధగి త్యవసర శ్చాపేన శాపేన వా."

[ఉ. ఈవిశసాశనిప్రహతి
నెంతయు నారయ నాక్రుధాగ్నికిన్
పావి యిదే భగాలుమని
శాపమొ చాపమొ పూని మండఁగాన్.]

"కౌసల్యా—భగవతి, పరిత్రాహి పరిత్రాహి
ప్రసాదేహి కుపితం రాజర్షిమ్."

[కౌస—భగవతీ, రక్షింపు రక్షింపు. సముదాయింపుము కుపితుని రాజర్షి ని.]

౧౦. "లవః—
ఏతద్ధి పరిభూతానాం ప్రాయశ్చిత్తం మనస్వినామ్;
అరున్ధతీ—
రాజన్నపత్యం రామ స్తే పాల్యాశ్చకృపణాః ప్రజాః".

[లవుఁడు—
తే. మానఘనుల కదే యవమానితులకుఁ
బ్రాజ్ఞసమ్మత మగునట్టి ప్రాచిత్తంబు;
అరుంధతి—
రాజ, నీపట్టి కాఁడె శ్రీరాముఁ డవని
పాలనీయులుఁ గారె కృపణులు ప్రజలు.]

౧౧. "జనకః—
శాన్తం వా రఘునన్దనే తదుభయం
తత్పుత్రభాండం హి మే

భూయిష్ఠ ద్విజ బాల వృద్ధ వికల
స్త్రైణైశ్చ పాల్యోజనః."

[జనపదము—

ఉ. కావవి రాముపై నతఁడు
గాఁడె మహాత్మజభాండ మాదటన్
బ్రోవక తప్పునే ద్విజని
పోతజరద్వికలాబలాతతిన్.]

౧౨. "వటవః—అరే శ్రూయతాం: అశ్వోశ్వ ఇతి కో ఽపి భూతవిశేషో జనపదేషు శ్రూయతే, సోఽయ మధునాస్మాభిః ప్రత్యక్షీకృతః."

[వటువులు—(సంభ్రమమునం బ్రవేశించి) కుమార, కుమార, గుఱ్ఱము గుఱ్ఱమని ఒకభూతవిశేషము జనపదములలో నుండునని విందుము గదా! అది యిప్పుడు మన కడకు ప్రత్యక్షముగా వచ్చియున్నది.]

"లవః—అశ్వఇతి పశుసమామ్నాయే సాంగ్రామికే చ పఠ్యతే; తద్బ్రూత కీదృశః."

[లవుఁడు—గుఱ్ఱమని పశుశాస్త్రమందే కాక సంగ్రామశాస్త్రమందుఁగూడఁ జదివితిమి. మఱి చెప్పుఁడు దాని స్వరూపము.]

"వటవః—శ్రూయతాం"

[వటువులు—వినుము.]

"పశ్చాత్పుచ్ఛం వహతి విపులం తచ్చ ధూనోత్యజస్రం
దీర్ఘగ్రీవః స భవతి ఖురా స్తస్య చత్వార ఏవ;
శష్పాణ్యత్తి ప్రకిరతి శకృత్పిణ్డకా నామ్రమాత్రాన్
కిం వ్యాఖ్యాతై ర్వ్రజతి స పున ర్దూర మేహ్యేహి యామః."

[మ. వెనుక న్దోఁకను దాల్చు విప్పుగ, సదా
వే దాని నాడించెడిన్
మొనయున్ దీర్ఘముగాఁగఁ గంఠము, ఖురం
బు ల్దానికిన్ నాల్గెసూ
తిను లేఁబచ్చిక నామ్రమాత్రములుగా
డించున్ శకృత్పిండముల్
చను దూర మ్మది యేల వర్ణన? కనన్
జన్దెమ్ము, రా, రా వెసన్.]

౧౩. "వృద్ధా స్తేన విచారణీయ చరితా
స్తిష్ఠన్తు హుం వర్తతాం
సుందస్త్రీ దమనేఽప్యఖండయశసో
లోకే మహాన్తో హి తే;
యాని త్రీ ణ్యకుతోభయా న్యపి పదా
న్యాసన్ ఖరాయోధనే
యద్వా కౌశల మిన్ద్రసూనుదమనే
తత్రా ప్యభిజ్ఞో జనః."

[ఉ. ఉందురు జ్యాయసుల్ తడవ
నొప్పదు వారిచరిత్ర ముండనీ
సుందునినాతిఁ గూల్చిన వి
శుద్ధయశోనిధు లమ్మహామహుల్
ముందడుగుల్ ఖరాజి నవి
యూఁ దకుతోభయముల్ చెలంగవే
యింద్రజు నేఁచు నేరుపును
నెల్ల జనంబులు మెచ్చుకొన్నదే.]

౧౪. "వ్యతిషజతి పదార్థా నాన్తరః కోఽపి హేతు
ర్న ఖలు బహిరుపాధీన్ ప్రీతయః సంశ్రయంతే;
వికసతి హి పతఙ్గ స్యోదయే పుణ్డరీకం
ద్రవతి చ హిమరశ్మా వుద్గతే చన్ద్రకాన్తః."

[ఆ. గూఢహేతు వేదొ కూర్చును వస్తుల
బహిరుపాధిఁ బ్రీతి బలసి కొనదు
ప్రొద్దు పొడిచినంత పుండరీకము పూచు
నెలమణియుఁ గరంగు నెలయుఁ దోఁప.]

౧౫. "రామః—ఏహ్యేహ్యాయుష్మన్!
అమృతాధ్మాతజీమూతస్నిగ్ధసంహననస్య తే;
పరిష్వంగాయ వాత్సల్యాదయ ముత్కణ్ఠతే జనః."

[రాము—రా, రమ్మ, ఆయుష్మంతుఁడా!

తే. అమృతపూరితవారివాహంబు కరణి
నిద్దమును శ్యామలము నగు నీదు మేనిఁ
గౌఁగిటం బొదువంగ నుత్కంఠఁ గొంటి
వత్సలత్వంబుచేఁ బరవశ్యమొంది.

౧౬. "లవః—తాత, కి మేతత్?
బాష్పవర్షేణ నీతం వో జగన్మంగళ మాననమ్,
అవశ్యా యావసిక్తస్య పుండరీకస్య చారుతామ్."
[లవుఁడు-నాయనా, యిదేమి?

తే. భువనమంగళమైన మీ మోము యిదేమి
బాష్పవర్షంబుచేతను బాత్రమయ్యె
తుహినజాలంబుచేతను దోఁగినట్టి
పుండరీకంబునం గ్రాలు నిండుసిరికి.]

ఆ. 'కావ్యేషు నాటకేష్వేవ వయంవా వయమేవవా;
ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే.'

అన్నకారణ మే మనఁగా నాయికానాయకుల పరదేవతాత్వంబును, తదుచిత సత్త్వశుద్ధ్యుత్కర్షయు, నాయకుని లోకారాధనపరాయణత్వంబును.

## ౧౨

భరతసూత్రానుసారులగు నాటకములలో ఉత్తమములే మనవఱకు వచ్చినవి: మృచ్ఛకటి, శాకుంతలము, ఉత్తరరామచరిత్రము, రత్నావళి, ప్రియదర్శిక, మాళవిక, విక్రమోర్వశీయము, ముద్రారాక్షసము—ఇత్యాదులు.

## ౧౩

౧. వీనిస్వారస్యము నెఱుంగుటకు ఇంచుకేని లక్షణజ్ఞానము వలదా? ఇంచుక తెలిపెది:

గుణములు—ఓజః కాంతి మాధుర్యసౌకుమార్యములు.

రీతులు—గౌడీవైదర్భీలాటీపాంచాలులు.

వృత్తులు—కైశికీసాత్త్వత్యారభటీభారతులు.

రసములు—శృంగార వీరకరుణాద్భుత హాస్యభయానక బీభత్స రౌద్ర శాంతములు.

సాత్త్వికభావములు—స్తంభప్రళయ రోమాంచ స్వేదవైవర్ణ్య వేపథ్వశ్రువైస్వర్యములు.

వ్యభిచారిభావములు.

విభావములు.

అనుభావములు.

స్థాయిభావములు—రతిహాసశోక క్రోధోత్సాహ భయజుగుప్సావిస్మయ శమములు.

కావ్యదోషములు.

రూపకోపరూపకములు.

అంకములు.

సంధులు.

నాటకాలంకారములు.

నాటకాంగములు—ఇత్యాదు లెన్నియో.

౨. వీనివివరము లెఱింగినవారు నాటకముల యందు ఉత్కర్షాపకర్షల నిరూపింపఁగర్తలు. అయినను వాస్తవమును పెద్ద లీట్లు చెప్పియున్నారు:

ఆ. "కవయః కాళిదాసాద్యాః కవయో వయ మప్యమీ!
పర్వతే పరమాణౌ చ పదార్థత్వం వ్యవస్థితమ్.

ఆ. తస్మా దాలోచితా శేష లోకశాస్త్రేణ ధీమతా;
కర్తవ్యం కాళిదాసాదేః కావ్యానాం పరిశీలనమ్."

౩. పూర్వులమర్యాద ఇట్లున్నది. ఈ కాలమందో, తెలియనివారే విమర్శించి అజ్ఞతచేతను, ఈసుచేతను, ఏకైక కవ్యనురక్తిచేతను గ్రంథకర్తలకు, భాషకు చెఱుపు గావించుచున్నారు.

౪. ఇట్టి నాటకములు సంస్కృతమందే రాఁగా రాఁగా కవులకు ప్రతిభ చాలనందున చప్పిడులై ప్రేఁగులైనవి.

## ౧౪

మన యాంధ్రమునందు యక్షగానములైనవి; సంగీతనాటకములైనవి. ప్రహ్లాదనాటకము, జలక్రీడ భాగవతము, భామకలాపము, ఇత్యాదిరూపమున కూచిపూడివారి ప్రభావముచేతను, దాసరుల మహిమచేతను, జంగాల ప్రతాపముచేతను, రస్తా మరమ్మత్తు లారంభించి

మ్యూనిసిపాలిటి వారికి నుపకరింపకపోడంగినవి. ఇందు కూచిపూడివారికి భరతోక్తనృత్తవిద్య సాంగహార కరణ రేచక పిండీబంధాది విస్తరముగా తెలిసియుండినది. ఈ వడివీథి నాటకములలోఁ గొన్నిట నిట్టిపాటలును వినంబడును—హాస్యగాఁడు ప్రవేశించి స్త్రీత్వ మభినయించుచు నిట్లు పాడును:

"వెందుకే నా కీ మొగుడు
ముండ్రోలి గండను-వెందుకే నా కీ మొగుడు
నోళ్ళకొక్క రేకొడికి వొకసుద్దా సేయిస్తే
తెలసుద్దా లేదాని తన్నూకుంటాడే. వెందుకే.
వారివీరిపుణ్యాన వచ్చాయి పుకిలేను
తండ్రి పేరూ పెట్టమాని తన్నూకుంటాడే. వెందుకే."

ఇట్టిదియు నస్త్రీ స్వత్తప్రతిబింబ మగుటచే దైనందినమాత్రమునకు ఉదాహరణభూతమై ఆనంద నిష్యందియు, వ్యుత్పాదకంబును అని కొందఱు రసికశిఖామణులు వక్కాణింతురు.

వేదవ్యాసపాత్రము తన ప్రవేశమును తానే చెప్పుకొనుటగా ఇట్లు పాడును—

"వందార్ వందనరే వేదవియాశర్ వందార్ వందనరే."

౧౫

౧. ఇటీవల షేక్స్పియరు నాటకములం గని యస్మదీయులు కొందఱు జోన్సుప్రభృతులచే హనాటీకృతము లైన శాకుంతలాది నాటకముల నాంగ్లీకరించినారు.

౨. స్వతంత్రాంధ్ర నాటకములను భరతమాత్రానుసారముగానే, సంస్కృతనాటకముల ఫక్కికనే, వ్రాయువారు అరుదు.

౩. సంఖ్యాతీతులు స్వతంత్ర నాటకములను పురాణనాటకమర్యాదనే వ్రాయుచున్నారు.

౪. ఈ రెండు తెఱంగుల నాటకములను జీవికార్థము గాక విద్యావినోదార్థము బుద్ధిమంతులు ఆడుచున్నారు. కూచిపూడిపాటలు, దాసరుల, జంగాల, ప్రచారము తగ్గిపోవుచున్నది.

౧౬

ఈ రెండు తెఱంగులకును సామాన్యలక్షణలేశము:—

౧. "A play ought to be a just image of human nature."—Dryden.

అట్లయిన స్వగతమును బిగ్గరగాఁ జెప్పుట యెట్లు? కావున పైమాటను సముచితవిశేషణములతో గ్రహింపవలయును. మఱియు-

౨. రసములేనిది కావ్యము గాదు; రసమునకు ఔచిత్యము ఉపనిషత్తు:

"అనౌచిత్యాదృతే నాన్యద్రసభఙ్గస్య కారణమ్;
ఔచిత్యోపనిబన్ధస్తు రసస్యోపనిషత్పరా."

అర్థాచితి, విషయాచితి, వక్త్రౌచితి, శ్రోత్రాచితి, వాచ్యాచితి, దేశాచితి, సమయాచితి-ఇత్యాదులు సర్వకావ్యసామాన్యములు. మఱియు-

౩. "యానిశాస్త్రాణి యేధర్మా యాని శిల్పాని యాఃక్రియాః;
లోకధర్మప్రవృత్తాని నాట్యమిత్యభిసంజ్ఞితమ్.
నచ శక్యం హి లోకేఽస్మిన్ స్థావరస్య చరస్యచ;
శాస్త్రేణ నియమం కర్తుం నానాచేష్టావిధిం ప్రతి.
నానాశీలాః ప్రకృతయః శీలే నాట్యం వ్యవస్థితమ్;
*తస్మాల్లోకప్రమాణంహి జ్ఞేయంనాట్యంప్రయోక్తృభిః."
భరత. ౨౨-( ).

"నతచ్ఛాస్త్రం నతచ్ఛిల్పం నసా విద్యా నసా కళా;
నాసౌ యోగో నతత్కర్మ నాటకే య న్నదృశ్యతే."
భరత. ౧-( ).

మఱియు—

౪. నాటకమున మూఁడైక్యము లుండవలయును—కాలైక్యము, దేశైక్యము, క్రియైక్యము: ఈ మూఁడు నలవడినచో రమణీయత గలుగును.

(* పై Dryden నిర్వచనమున కిది సరిపోవును.)

౧౭

౧. మతభేదములు:

భరతమతము

అంకము నిర్విభాగము. అందు(ఈ క్రింది దూరాధ్వాదులు నిషిద్ధములు)*—

"దూరాధ్వాన (దూరాహ్వానం—పా.) వధోయుద్ధం
రాజ్యదేశాది విప్లవః;
వివాహో భోజనం శాపోత్సర్గో మృత్యూ రతం తథా.
దన్తచ్ఛేద్యం నఖచ్ఛేద్య మన్య ద్వ్రీడాకరం చ యత్;
శయనాధరపానాది నగరా ద్యవరోధనమ్.
స్నానానులేపనే చైభి ర్వర్జితో నాతివిస్తరః."

అందు—అనేకదినకథ ప్రయోజ్యము గాదు:

"నానేకదిన నిర్వర్త్య కథయా సంప్రయోజితః."

అందు—అంకాంతమున సర్వపాత్ర నిష్క్రమణము:

"అన్తనిష్క్రాన్తనిఖిలపాత్రో ఽఙ్క ఇతి కీర్తితః."

అందు—పద్యము లెక్కువ యుండఁగూడదు:

"నాతి ప్రచుర పద్యవాన్."

హరాణమతము

అంకము రంగ (క) ములచే సవిభాగము. ఇందు ఆ (భరతోక్త) నిషేధములు లేవు.

[ఇందును — అశ్లీలములు మాత్రము జరుగవు; రతి ముండదు.

తిదంగము లగు నఖక్షత స్తనగ్రహణదంతక్షతాదులు నుండవు.]

శాకుంతలమందు చుంబనోద్యమమేగాని చుంబనసిద్ధి వలనుపడదాయెను;—

ఇందు—ఎక్కి తొక్కి చుంబనములు చేయవచ్చును.

ఇఁక వధయుద్ధమరణాదుల మాట చెప్పనే అక్కఱలేదు.

ఇందు—రంగ(క)ములనూలమున ప్రయోజ్యమే.

ఇందు—అంకమున ఎన్నిరంగ(క)ములు కలవో అన్నిటి తుదలందును సర్వపాత్రనిష్క్రమణము.

ఇందు—కొన్నిట పద్యములచేతను, కొన్నిట పాటలచేతను ప్రాణము నిలుగును.

౨. ఇట్లు ఈ నిషేధముల కలిమిలేములలో నేది గుణవత్తరమో విచారణీయము. ఆవిచారమును మఱియొక సమయమునఁ గావించెద. కాని అవి లేమిచేతను, రంగ(క) విభాగములచేతను హరాణఫక్కి సుకరము. ఈ ఫక్కిని ఎల్లవారును గ్రామాలు వ్రాయవచ్చును.

౩. ఒక్క చుంబనమును దప్పించుటకు కాళిదాసు ఎంత యుక్తి చేసెనో పరిశీలింపుఁడు:—

"శకున్తలా—ముఞ్చదావ మం భూయోవి సహీజణం అణుమాన ఇస్సం.

రాజా—భవతు మోక్ష్యామి.

శకున్తలా—కదా.

రాజా—

అపరిక్షతకోమలస్య యావ
త్కుసుమస్యేవ నవస్య షట్పదేన;
అధరస్య పిపాసతా మయా తే
సదయం సున్దరి గృహ్యతే రసో ఽస్య.
(ముఖ మస్యా స్సమున్నమయితు మిచ్ఛతి.)
(శకున్తలా నాట్యేన పరిహరతి.)"

[క. కనిగా తెలియఁగని క్రొవ్విరి
నసమున నెలదేఁటి తేనె యానెడు మాడ్కిన్
పసి వడ యుఱ నీమోవిన్
రస మే నర్మిలిని గ్రోలి రహి వీడ్కొనెదన్.
(అని యామెమోము నెత్తఁబోవుచున్నాఁడు.)
(శకుంతల నాట్యముచే తొలఁగఁజేయుచున్నది.)

---

*మా. అనుబంధము: ౧.

(నేపథ్యే)

"చక్కవాకవహుఏ, ఆమన్తేహి సహఅరం ఉవట్ఠిదా రఅణీ"

[ఓ జక్కవజవ్వనీ, సహచరుని వీడ్కొనుము; రేయి దగ్గఱయుచున్నది.]

"(దుఃఖేవ నిష్క్రాన్తా శకున్తలా సహేతరాభిః.)"

*      *      *      *      *

"రాజా — (పూర్వస్థాన ముపేత్య పనిశ్వాసమ్)

అహో విఘ్నవత్యః ప్రార్థితార్థసిద్ధయః; మయా హి-

ముహు రఙ్గుళిసంవృతాధరోష్ఠం

ప్రతిషేధాక్షర విక్లబాభిరామమ్;

ముఖ మంసవివర్తి పక్ష్మలాక్ష్యాః

కథమ ప్యున్నమితం న చుంబితంతు."

[ఉ. చిత్తరి ప్రేళ్లతో నధర

బింబము మాటికిఁ జాటుసేయుచున్

ద త్తరపాటుతో వలదు

తాఁకుఁడ యన్నరితి పేశవర్ణముల్

చిత్తము ముచ్చిలన్ బుజము

సేర్చిన సెమ్మొగ మెట్టకేని నే

నెత్తియు నార ముద్దుగొన

కే విడనాడితిఁ బక్ష్మలేక్షణన్.]

౪. ఇట్టి నిషేధముల బాధ లేనందున నిప్పటి యాంధ్ర నాటకములలో పాణిగ్రహణకావలంబన మే ప్రాయికతమ మైనది. సంస్కృతనాటకాంధ్రీకర్తలు పయితము కొందఱు స్వకీయస్వతంత్రనాటకములందు పాణిగ్రహణకనే యవలంబించినారు.

## ౧౯

ఇప్పటి కొన్ని నాటకములను, తత్కవులనుం గూర్చి యించుక వివర్శింపవలసియున్నది.—

౧. పూర్వకాలమున "నాటకాన్తం హి సాహిత్య"మ్మని పెద్దల సుద్దిగా నుండినది. ఇప్పు డది "నాటకాద్యంహి సాహిత్య"మ్మని ముద్దులసుద్దిగా పరిణమించినది.

౨. ఇప్పుడు ప్రాయికముగా మూఁడవ ఫారములో భగ్నులైన (అనఁగా ప్రామోషను గాకయో, స్కాలర్షిప్ లేకయో చదువు మానుకొన్న) యాంధ్రవిద్యార్థులలో నాటకము వ్రాయలేనివా రుండరు. అభగ్నులైనవారు (అనఁగా ప్రామోషనై స్కాలర్షిప్ గలవారు) ఈ వ్రాఁత గాండ్రకు, అనఁగా ఈ జీనియస్సులకు, ఈ మొహరము పులులకు, మన్నెడి పట్ట నట్లుగా తోఁకపట్టువారుగాను, డప్పులు కొట్టువారుగాను నుందురు. ఇఁక బి. ఏ. లే పూనుకొన్నయెడల చెప్పవలసినదే లేదు. మూఁడవఫారము విద్యార్థులకు గ్రంథరచనం దొడంగినంతట బాలకవులని బిరుదము కలుగును.

౩ మహా ప్రసిద్ధులైన యొకానొక విద్వద్వరేణ్యులు ఒక బాలకవిచే తాము కథ చెప్పి రచింపించి సవరించిన యొకయాంధ్రవచన గ్రంథమును నాకడకుం దెచ్చి దానిని నిర్దోషముగా ముద్రింపింపుమని నన్నుం గోరిరి. నే నంగీకరించి ఫారమునకు మార్లు వేలుగా బాలకవికృతదోషములను దిద్దుచుంటిని. తదనుసారముగా బాలకవియే ప్రూఫులు దిద్దుకొనుచుండెను. ఆతఁడు గ్రంథములో నక్కడక్కడ చేటపెయ్యలవంటి పద్యములనుగూడ కట్టుచుండెను. వానికిని జీవము పోయుచుంటిని. ఆతఁడు నియోగి, నన్నయ వైదికి. ఆ కారణంబున నన్నయకవనముకన్న తన చెత్తయే సత్తువ గలదని యతనికి అంతర్గతజ్వర ముండెను. అతనికి అప్పటి కింకను మీసములు చక్కఁగా పొటమరింపలేదని కొందఱి మతముగాను, ఇఁక మొలవవని నా మతముగాను నుండెను. ఒకనాఁడు తదీయపద్యములో "కాకికి యోడు యంచపతి గాఁగలదే ధరణీతలంబునన్" అని నాలవపాదము వచ్చినది. "యోడుయంచ"ను "రాజహంసి" గా మార్చితిని. వైదికుఁడనైన నాదిద్దుఁబాటును బాలకవి కఠిన ప్రయోగమని కైకొన సంకోచించెను. అతని యాజ్వరమునకు తల్లాపకులైన మన్మిత్రులే మందిత్తురుగాక యని అతనిని ఆరెండుపాఠములను వారితో చెప్పుకొని వారొప్పుకొన్నదానిని గైకొనుమంటిని. వారా రెంటిని విని ఆశ్చర్యపడి బాలకవికి మదీయ సంస్కరణమున సందేహించినందులకు కాయశుద్ధిగా సకలశుద్ధులం గావించి

అజ్వరమును కుదిర్చిరి. అతఁడు పీఠికలో తన గ్రంథమున "కొన్ని తప్పులు సవరించినందులకు" అని నాకు వందనములు ముద్రింపించెను. అందును అతనికి నే నొక తప్పు చూపితిని. 'బాలకవీ, "కోటితప్పు"ల మాటకు "కొన్ని తప్పు"లని ముద్రించితి వేమి?' అని యడిగితిని. ఇందుల విశేషమును బుద్ధిమంతు లూహించుకొందురు గాక! ఈ బాలకవి ఏతద్వ్యుత్పత్త్యనంతరము పెక్కు నాటకములు వ్రాసియున్నాఁడు.

౪. ఇపుడు సీను (scene) అను హూణపదమునకు రంగము అను నాంధ్రపదమును పెట్టినారు. దీని పొందిక నరసిన చమత్కారము తెలియఁగలదు.

వెబ్‌స్టరు నిఘంటువులో నిట్లున్నది:—

Scene... 3. So much of a play as passes without change of locality or time, or important change of character; hence, a subdivision of an act; a seperate portion of a play subordinate to the act but differently determined in different plays; as, an act of four scenes.

'My dismal scene I needs must act alone.' —Shak.

వెబ్‌స్టరు మఱియొక వ్యావహారికార్థము నిట్లు వ్రాయుచున్నాఁడు:—

4. The place, time, circumstance, etc. in which anything occurs, or in which the action of a story, play, or the like, is laid; surroundings amid which anything is set before the imagination; place of occurrence, exhibition, or action.

'In Troy, there lies the scene.'—Shak.
'The world is a vast scene of strife'.
—J. M. Mason.

రంగశబ్దమునకు ఆప్టే నిఘంటువులోని యర్థములు:—రఙ్గః... 3. A stage, theatre, play-house,......as in 'రఙ్గవిఘ్నోపశాన్తయే', S. D. 281......... 4. The members of an assembly, the audience: 'అహో రాగానుబద్ధచిత్తవృత్తిరాలిఖిత ఇవ సర్వతో రఙ్గః' (అభి. శా.) S. I; 'రఙ్గస్య దర్శయిత్వా నివర్తతే నర్తకీ యథా నృత్యాత్, పురుషస్య తథాత్మానం ప్రకాశ్య వినివర్తతే ప్రకృతిః.' సాఙ్ఖ్య. 'రఙ్గో నా రాగే నృత్యస్థరణక్షితౌ, అస్త్రీ త్రిపుటీ.'— విశ్వమేదిన్యౌ.

ఈ యుదాహరములవలని ఫలితార్థము:— సీను శబ్దమునకు మూలార్థము stage (రంగము) అయినను, ప్రకృత వ్యావహారికార్థము అది గాదు. రంగశబ్దమునకు వ్యావహారికార్థమే stage, theatre, audience. కావున ప్రథమరంగము, ద్వితీయరంగము, తృతీయరంగము అను వ్యవహారమును హూణీకరించిన—First stage, Second stage, Third stage; First theatre, Second theatre, Third theatre; First audience, Second audience, Third audience—అగును. ఇదియే నానుడివిన చదువని కవుల కవనసామ్రాజ్యము. నాట్యరంగము, నాచిరంగు, ఇత్యాది వ్యవహారము మనకు అపూర్వముగాదు. ఈ శబ్దమునే పర్యాయపదములచే వ్యవహరించిన ప్రథమనాట్యశాల, ద్వితీయనాట్యశాల, తృతీయనాట్యశాల; ప్రథమప్రేక్షకమండలము, ద్వితీయప్రేక్షకమండలము, తృతీయప్రేక్షకమండలము ఇత్యాదు లగును. ప్రేక్షకమండలమును చదివినపండితులు సమాజ మందురు. రఙ్గకమని సంజ్ఞను జేర్చిన యీ పొరఁబాటు తొలఁగును.

౫. ఇప్పుడు ఇంగ్లీషువలె వెలువడుచున్న నాటకములకు భరతముని నిషేధించిన పూర్వోక్త వధచుంబనాది కృత్యములే ప్రాణభూతములు. కథ యెంతచెడ్డదైనను అందుఁ గలసద్బోధన విద్యుదుద్యోతమందమతిప్రతారక పామరరంజకముగా విభజ్యమానములగు నిషిద్ధాసంబద్ధ వికృతచర్యలలో వడంగి రూపఱును.

౬. ఈరంగ(క)ములందు ముద్దులు పెట్టుట ఉక్తపూర్వము. వధలకు, యుద్ధములకుం గొదువలేదు. భోజనము చెప్పవలసినదే లేదు — కోటివిద్యలు కూటి

శోకావేశకదా;— సోఫాపై మృతదేహమునుంచి* అతనిచుట్టు
రా మృతునిభార్యలనుగా సుందరీమణీ వేషధారులను
కూర్చుండఁబెట్టి శోకములకుం గట్టి వారిచేత మృతునిగూర్చి
"పల్యాకర్ణనముం" బాడించుట. దీనిని Pathos అని
ప్రస్తుతించువారుం గలరు. ఇత్యాదివికారములు ఇట్టి
నాటకములలో పెక్కులు నెక్కొనుచున్నవి.

## ఔచిత్యానౌచిత్యములు:

౭. ఇప్పటి నాటకములయందు ఔచిత్యచింత
లేదు. పూర్వులు అనుచితవ్యవహారమును ప్రతినాయకు
నికిం బెట్టిరి. కథానాయకునికిం బెట్టరు. పరదారకాంక్ష
రావణునికిని, కాకాసురునికిని బెట్టిరి. శ్రీరాములవారికి
ఏకపత్నీవ్రతము నెలకొల్పిరి. ఏలన కథానాయకుఁడు
లోకమునకు సదాచారోదాహరణభూతుఁడుగా నుండ
వలయును. 'రామాదివ ద్వర్తితవ్యం, నతు రావణాదివత్'
అని కదా రామకథోపదేశము

> "యత్తాస్యే దనుచితం వస్తు నాయకస్య రసస్య వా;
> విరుద్ధం తత్పరిత్యాజ్య మన్యథా వా ప్రకల్పయేత్."
> సా. ద.

అని యాలంకారికశాసనము. ఏతదనుగుణముగా కొన్ని
రామనాటకములందు కవులు మంథర నే కైకే
యీరూపమున దశరథునివలన రామనిర్వాసనాదివరము
లం బడయంజేసి రాజపత్నీగౌరవమును గాచినారు. కవి
కిని తనదేశముపై యభిమానము వెలయును. అట్లే కింగ్
లియరులో షేక్స్పియరు ఇంగ్లండు మీదికి లియరు రక్ష
ణార్థమై తత్తృతీయజామాతయైన ఫ్రాన్సు రాజుచేత
యుద్ధాభియోగము చేయింపమి స్వదేశాభిమానముచేత
నని విమర్శకులు వ్రాసియున్నారు.

౮. భారతకథయందు దుష్యంతుఁడు శకుంతలను
తన ధర్మపత్నిగా నెఱింగియు ఎఱుంగనని బొంకి వెడల
నడిచినాఁడు. పిమ్మట నాకాశవాణీ నిర్భర్త్సనమునకుం
గొంకి యామెను గ్రహించినాఁడు. నాయకదోషపరిహా
రార్థమై కాళిదాసుఁడు దుర్వాసశ్శాపమును, అంగుళీయక
దర్శనరూపమగు తద్విమోచనమునుం గల్పించినాఁడు:
అందువలనంగదా, లోకమునకు ఉత్తమపురుషుని చిత్త
నైర్మల్యంబును, వాస్తవమయిన గాఢంపుఁ బశ్చాత్తాపం
బును, సాధ్వీమణియొక్క పవిత్రవిరహవ్రతంబును అను
నుత్కృష్టహితోపదేశము సిద్ధించినది.

> అ. "ఇద ముపనత మేవం రూప మక్లిష్టకాంతి
> ప్రథమపరిగృహీతం స్యా న్నవే త్యవ్యవస్యన్;
> భ్రమర ఇవ విభాతే కుంద మన్త స్తుషారం
> నచ ఖలు పరిభోక్తుం నైవ శక్నోమి హాతుమ్."

> [మ. కనుదోయిక్ మిఱుమిట్లుగొల్పెడు పసు
> త్కు ప్రాప్తమై క్రాలు నీ
> కనదక్లిష్టశుభాచ్ఛరూపముఁ దొలిం
> గైకొంటినో లేదో యం
> చు నితాంతంబునఁ దేఁటి లోని కెలమం
> చుం గొన్న కుందంబు లీ
> లను గైకోఁ జోర మాన నోప భ్రమ డో
> లారూఢచిత్తుండనై.]

> ఆ. "త్వయ్యేవ విస్మరణదారుణచిత్తవృత్తా
> వృత్తం రహః ప్రణయ మప్రతిపద్యమానే;
> భేదా ద్భ్రువోః కుటిలయో రతిలోహితాక్ష్యా
> భగ్నం శరాసన మి వాతిరుషా స్మరస్య."

> [చ. పటుతర విస్మృతిప్రఖర
> భావుఁడవై తనతోడి యారసో
> త్కటనిభృతప్రసంగతను
> తథ్యము నా నతిలోహితాక్షియై
> కుటిలములౌ బొమ లుమ్మడిచి
> కొంటను మానిని గెంటు నీకునక్
> పెటపెట మారు కార్ముకము
> పెళ్లున భగ్నము నేసినై చెఁ బో.]

> ఇ. "యది యథా వదతి క్షితిప స్తథా
> భవసి కిం పితు రుత్కులయా త్వయా;
> అథ తు వేత్సి శుచివ్రత మాత్మనః
> పతికులే తవ దాస్యమపి క్షమమ్."

* చూ. అనుబంధమున ౧.

[తే. రాజు వల్కుఁడు క్రియ నపరాధ్ధవేని
తండ్రి కింకేల కులమును దక్కు నీవు
కాక యాత్మవ్రతము శుచిఁ గాచితేని
దాస్యమేనియుఁ దగు నీకు భవుని యింట.]

ఈ. "మూర్ఖః స్యాదుత మేషా వా
వదే న్నిర్భర్త్సతి సంశయే;
దారత్యాగీ భవా మ్యహో
పరస్త్రీ స్పర్శపాంసులః."

[ఆ. నాకు బుద్ధిమాలి యాకల్కి కల్లలు
పాటునో కొ యనెడు సందియమున
నాలినే త్యజించి దూరనే యగుదునో
పరవధూటి నంటి పాడయిదునో.]

ఉ. "ఇతః ప్రత్యాదేశా త్స్వజన మనుగన్తుం వ్యవసితా
తత స్తిష్ఠే త్యుచ్చై ర్వదతి గురుశిష్యే గురుసమే;
పున ర్దృష్టిం బాష్పప్రసరకలుషా మర్పితవతీ
మయి క్రూరే య త్తత్సవిష మివ శల్యం దహతి మామ్".

[ఉ. చేకొనకేను త్రోవ నిటఁ
జేర్వడి బంధులఁ గూడనై యటన్
రాకని రోషభీషణగి
రన్ బితృశిష్యుఁడు తన్నిభుండు నా
నాకమలాక్షి నన్నుఁ గని
నాశయు వెంబడియు గన్నయట్టి బా
ష్పాకుల దృష్టి యేర్చు నన
యంబు విషాక్తశరంబు కైవడిన్.]

ఊ. "కృతం న కర్ణార్పిత బంధనం సఖే
శిరీష మాగణ్డ విలంబి కేసరమ్;
న వా శరచ్చంద్రమరీచికోమలం
మృణాళసూత్రం రచితం స్తనా న్తరే."

[ఉ. వ్రాయనరామిఁ గర్ణమున
వావిరి నర్పిత బంధముం గపో
లాయతలంబి కేసరము
నంచితలీల శిరీషపుష్పమున్
వ్రాయఁగఁ దా స్తనాంతరము
నన్ శరదిందుమరీచి సేలు మే
లోన్నయగమా మృణాళతను
సూత్రము నైన సమంగుమిత్రమా!]

ఋ. "మోహా న్మయా సుతను పూర్వ ముపేక్షిత స్తే
యో బద్ధ బిందు రధరం పరిబాధమానః;
తం తావ దాకుటిల పక్ష్మ విలగ్న మద్య
బాష్పం ప్రమృజ్య విగతానుశయో భవామి."

[చ. ఉవిదరో మున్ను మోహమున
నొప్పరికించితి బద్ధబిందువున్
భవదధరోష్ఠబింబమున
వావిరి నోవిడుచున్న బాష్పమున్
ప్రవణత దాని నాకుటిల
పక్ష్మవిలగ్నముఁ ద్రోచి యిప్పుడే
నవుదును గాక యేను విర
తానుశయుండను ప్రాణనాయికా!]

౯ ఇప్పుడిట్టి యౌచిత్యము తెలియూటం బట్టి యిప్పటినాటకములందు నటిని సూత్రధారుఁడు (దానిమగఁడు) 'దేవీ' యనియు, దాసికూఁతురు సీతాదేవిని 'రాచకూఁతురా' అనియు సంబోధించుట, నాయిక (మహారాజు కూఁతురు) తనజనకుని మంత్రిపుంగవుని "ఏలరా", "చూడరా" అనుటయు, రాజును మంత్రి "ఈ నవట నోర్వర" అనుటయు, (ఈ నాటకము యఫ్. ఏ కు టెక్స్టు గానుండుటయు,) రాజును దాసి పేరుపెట్టి పిలుచుటయు,) రంగ (క) మంతియు కన్నను విన్నను, నాటకమున అందే తొలిగా ప్రవేశించిన పాత్రములు ఎవరవరో తెలియమియు, రుక్మిణికిని, చేటికలకును ఆమె వివాహయత్నంపు దినములలో విధవావివాహముంగూర్చి వాదముపడి రగడయగుటయు, శ్రీకృష్ణులవారు వివాహార్థమై రుక్మిణితో తత్సౌందర్య పరీక్షార్థము రహస్యసమావేశముం గోరి రుక్మిణిపురోహితగృహమందు వచ్చి ప్రచ్ఛన్నముగా నుండఁగా, పురోహితుఁడు సంఘటనార్థము రుక్మిణికడకు ఇలువెడలఁగానే ఆతనియిల్లాలు సరసగూఁటియై శ్రీకృష్ణులవారిని పైకొనుటయు, ఎదిగినకూఁతురు పేనిరాజ్య మపహరింపఁబన్నుచున్న తనమంత్రియగు తండ్రి ప్రీతికై రాజభక్తుని సేనాపతిని వలపించి తన

తోడికూటమికై రాత్రి ఆరామమునకు ఎలయించి తండ్రి తలవరులచేతివధకుం జాలు సేయుటయు, ఆకూఁతురే తండ్రిని మాటిమాటికి "ఏమి నా కింకను పెండ్లి సేయవు, ఆపిల్ల కైనది, ఈపిల్ల కైనది" అని రద్ది సేయుటయు, (ఈ నాటకము యఫ్. ఏ. పరీక్షకుఁ బనుటయు), అపూర్వములయిన ఇదానీంతన హాస్యనృత్తములను అతిపూర్వులకుఁ బెట్టుటయు కనవచ్చును.

[‘నయార్ణవా, మతిమంతా, నీతిజ్ఞా’-సారంగ రాజనరేంద్రులొండొరుల సంబోధించుకొనుట. సారంగుఁడు ‘రాజనరేంద్రా’ అనుట. సుభద్రాపరిణయ సంబంధమున విధవా వివాహవాదము బలరామకృష్ణులకు. ‘ఆ శ్రీకృష్ణుఁడు’ - సత్యభామవాక్యము; ‘నారదా’! కృష్ణవాక్యము.]†

విషాదనాటకములు:

౧౦. ఇపుడు షేక్స్పియరువలె విషాదనాటకములు వ్రాయుతీవరములో కృష్ణదేవరాయని కన్న మహావీరుఁడును, బహుయుద్ధవిజయియు, సర్వదక్షిణాపథ చక్రవర్తియు, ఎవనిగొప్పతనమున మన కానందమో, ఎవని పారఁబాటునకై మనకు అవమానమో, అట్టిమహాక్షత్రియప్రభుపుంగవుఁడు ప్రచ్ఛన్నదురాచారుఁడై మ్లేచ్ఛ సుందరివలన మ్లేచ్ఛసుతుం బడయుటయు, వానిని నిజ సేనానాయకుం గావించికొని వానికుట్రచేఁ దాను మడియుటయేకాక వెనీసు పోర్చుగలు రాజసభలయందు ప్రసిద్ధి గాంచిన విజయనగర మహారాజ్యమును, చిరదృఢ హిందూరాజ్యమును, క్షత్రియపరిపాలనను ఒక్కపెట్ట తుదముట్టించుటయు అను నీవృత్తాంతముకూడ నాటకమయినది. ఇందువలనం గలుగు దుఃఖావమానములలో "తప్పుచే ముప్పు వచ్చు"నను బోధన అడుగంటిపోవుచున్నది. తల్లిఅంకు నెవ్వఁడును చెప్పుకోఁడు గదా! మన రాజుదోషమును మనకు అట్టిదేఅనికవు లెఱుంగవలదా!

౧౧. కొందఱుకవులు నటసంఘములకు ఆశ్రయులుగానో, ఆశ్రితులుగానో ఉందురు. వారు ఆసంఘములోని నటులకు శక్యమయినపాత్రములనే నిజనాటకములందు నెలకొలుపుదురు. ఆయాసంఘమునకు శక్యమయిన సంవిధానమునే కల్పింతురు. ఏ నాటకసంఘమువారేని ఏనాటకము నేనియు రంగానర్హమని వచించినచో మనము దానిని ఆనటసంఘమువారికి అశక్యమని అర్థముచేసికో వలయును. వాస్తవముగా అర్హమో, అనర్హమో భరతశాస్త్రమువలన నేర్పడవలయును గాని నటసంఘసామర్థ్యపరిమితులచేతఁగాదు.

నీచపాత్రగ్రామ్యము:*

౧౨. కొలఁదిసంవత్సరములక్రిందట నాటకస్వరూపము ఈకవులకు ఎంత యవిదితముగా నుండెననఁగా, నీచపాత్రములకు గ్రామ్యభేదములం బెట్టినవానిని కడమవారెల్ల అరికట్టం దలపెట్టి అందుల ఫలముగా "కవిపండితసంఘము"ను తుదముట్టించిరి. వారి యుద్యమంబును భగ్నమయినది.

౧౩. నాటకములలో పద్యములం పెట్టుటయందు గ్రంథగౌరవ మున్నది. కాళిదాసాది మహాకవులనాటకములయందు అనంతవ్యక్తులు లేనిదిగా పద్యముండదు. ఇప్పటి కొందఱు వచ్చినాఁ డనుటకు పద్యము, పోయినాఁ డనుటకు పద్యము వ్రాసి దాని నొకపీడం గావించిరి.

పాటలపెల్లిదము:

౧౪. దీనిని మించినది పాటలపెల్లిదము. ఉత్తమపురుషపాత్రములకు పాటలు పెల్లయినచో గాంభీర్యము చెడును. సంవిధానౌచిత్యమునుబట్టి ఒకటి రెండుండిన నుండుఁగాక. స్త్రీలకయినను అట్లే. సంస్కృతనాటకములందు స్త్రీలకు పద్యములం లేవు; పాటలును లేవు. సంవిధాననిమిత్తకములుగా ఒకటి, అర ఉన్న నుండును; రసముం బోషించును. ఆంధ్రకవులు కొందఱు అట్లు సేయక మాటమాటకుం బాటల నాటుచున్నారు. అది తండ్రి తా నింటికి కార్యస్థానమునుండి సాయంకాలము రాఁగానే తనపిల్లలందఱు తన్ను ముద్దుగొనవలయునని

† దీనిని వ్యాపకర్త మాతృకయందు సూచించినారు

* చూ. అనుబంధమున 2.

శాసింపఁగా, వారు ఒకటి రెండుదినములు అట్లే కావించి అనంతరము మనుటయు, తండ్రి తజేమిత్రజేమి కొట్టుటయు, వారు దాఁగుటయు, తండ్రి వెదకి పట్టినప్పుడు వారు ఎదురుతిరిగి తిట్టి పారిపోవుటయు అనుకథక్కై నడితోలుదొల్త కొంతవఱకు లోకులు పాటలకు హర్షించుటయు, అనంతరము రోయుటయుఁ గా పరిణమించుచున్నది.

"ఆల సత్యభామకు తలనిండ పూలే"

అనుపాటలో 'పుతలనిండ' అని విభజించు వీథిభాగవత్రమువారిని వెక్కిరించుచు ఈ నగరపౌధ నాటకమువారు "ఇంద్రుఁడు సభ కేతెంచెను" అను పాటలో "తెంచెను" అని విభజించి పాడుదురు. వీరిం గని పిపమెత్తి వీరిని మించువారైన సంస్కృతనాటకసంఘగాయకులలో దుష్యంతుఁడు "అపరిక్షత కోమలస్య" అను ముక్కను పాడుచు మూఁడుగా "అపరిక్షత-కో-మలస్య" అని విడఁదీసి తుదితుండును రెట్టించి రెట్టించి ఎగిరియెగిరి పాడుచుండెను. దీనికే ఆన్కారు వచ్చుచుండినది.

౧౫. ఇపుడు నటులు పాటలు పాడునపుడు హాశోణ్మనియును శ్రుతిమాత్ర మొసంగుటగాక అనువదనము కూడఁ గావించును. ఆరోదలో పాటలో నిశబ్ధములు శ్రోతలకు ఆవేద్యము లగుచున్నవి. భరతముని గీత మభినేయమగుచో వాద్యయోజన కూడదని శాసించియున్నాఁడు.

"యత్రాభినేయం గీతం స్యా
త్తత్ర వాద్యం న యోజయేత్."

మాళవిక అగ్నిమిత్రునిమ్రోల ముందు రాగాలాపన చేసి, తర్వాత చతుష్పదవస్తువును పాడి, అటు తర్వాత దానినే అభినయించినది. అందువలన ముందు పాట సామాజికులకు విశదమై, అనంతరము అభినయము వలన హృదయమున కెక్కును. అభినయముతో నృత్యము చేరును; నృత్యముతో వాద్యము చేరును.

"మాళవికా—
(ఉపగానం కృత్వా చతుష్పదం వస్తు గాయతి)

దుల్లహో పిఓ తస్సిం భవ హిఅఅ ణిరాసం
అమ్హో అపంగఓ మే ప్ఫురఇ కింవివామ ఓ;
ఏసో సో చిర దిట్ఠో కహం ఉవణఇ దవ్వో
ణాహ మం పరాహీణం తుఇ గణఅ సతిణ్హం.

(ఇతి యథారస మభినయతి.)

*　　*　　*　　*

రాజా—
అనయాఖలు:
జన మిమ మనుర క్తం విద్ధి నాథేతి గేయే
వచన మభినయన్త్యా స్స్వాఙ్గ నిర్దేశపూర్వమ్;
ప్రణయగతి మదృష్ట్వా ధారిణీ సన్నికర్షా
దహమివ సుకుమార ప్రార్థనా వ్యాజము క్తః.

[మాళవికా గీతాన్తే గన్తు మిచ్ఛతి.]...

*　　*　　*　　*

[మాళవికా నివృత్య స్థితా.]

రాజా—[ఆత్మగతం] అహో, సర్వా స్వవస్థాసు చారుతా శోభాం పుష్యతి. తథాహి:

వామం సన్ధి స్తిమితవలయం
　　న్యస్య హస్తం నితంబే
కృత్వాశ్యామా విటపసదృశం
　　స్రస్తము క్తం ద్వితీయమ్;
పాదాఙ్గుష్ఠా లులితకుసుమే
　　కుట్టిమే పాతితాక్షం
నృత్యా దస్యాః స్థిత మతితరాం
　　కాన్త మృ జ్వాయతార్ధమ్.—

*　　*　　*　　*

గణదాసః—భగవతి, యథాదృష్ట మభిధీయతాం దోషో గుణో వేతి.

పరివ్రాజికా—
యథాశాస్త్రం సర్వమనవద్యమ్. కుతః:
అఙ్గై రంత ర్నిహితవచనై స్సూచిత స్సమ్య గర్థః
పాదన్యాసో లయ ముపగత స్తన్మయత్వం రసేషు;

శాఖాయోని ర్మృదు రభినయ స్తద్వికల్పానువృత్తౌ
భావో భావం నుదతి విషయా ద్రాగబద్ధ స్స ఏవ.

*　　　　*　　　　*　　　　*

గణదాసః—అన్య న ర్తయి తాస్మి."

## శైలి

౧౫. ఈ నాటకములలో కొన్నిట రసము అస్ఫుటము; విరసత్వయుం గలదు. భావము మాఱినప్పుడు శైలి మాఱదు. పాటలమెట్లును, రాగములును, భావోచితముగా మాఱవు. ఏవంప్రాయ నాటకప్రవణులకు నీరసము మృదువు; పేలవము మధురము; తప్పులు మెండయినకొలంది స్వాభావికశైలి (Idiamatic style); వాడుకమాటలు రసవంతములు.

కవనమున వాడుకమాటలన్నియు సర్వత్ర అర్హములని తెలంపఁగూడదు.

### పూర్వ లిట్లు

౧. మధువులాని, లేక తేనియ లాని, లేక క్రొం దేనియ లాని.

౨. మృష్టాన్న మారగించి.

౩. మేలివలిపములు దాలిచి.

౪. తాక కనిరొ.

### పీరలిట్లు

౧. తేనె తాగి.

౨. మంచితిండి తిని.

౩. మంచిసన్నబట్టలు · లేక గుడ్డలు కట్టుకొని. (బట్టలు కొన్ని జిల్లాలలో తప్పు; గుడ్డలు మఱి కొన్నిట తప్పు.)

౪. ముట్టుకో కనిరొ.

గురువు తా రచియించుచుండిన గ్రంథమును పూర్తి సేయుమనుటకై తన యవసానకాలమున శిష్యుల నిరువుర నిట్లు పరీక్షించెను: ఎండుదుంగ యొకటి వారిముందఱ వేయించి వారిని అదట దానియునికిం జెప్పుమనిరొ. ఒకఁడు 'శుష్కం కాష్ఠం తిష్ఠత్యగ్రే.' అనిరొను. ఇతరుఁడు 'నీరసదారు విభాతి పురః' అనెను. ఆగ్రంథమును పూర్తి సేయుమనిని గురువు ఈ రెండవవానికి నియమించెను. ఇట్టి భేదమును పాటింపని కవనము పనికిరాదు.

## ౧౬

౧. నటులంగూర్చియు ఒకమాట చెప్పవలయును. నటునికి వాగ్మిత, దిట్టతనము, అనుకరణమునై పుణి, సమగ్ర నిజపాత్ర్యపరిజ్ఞానమే కాక సమగ్రనాటక పరిజ్ఞానమును, ప్రజ్ఞయు వలయును.

౨. నటులను అర్హతంబట్టి పాత్రములకు నియమించినచో ఒజ్జకు ప్రయాసముండదు. ప్రయోగము శోభిల్లును.

"తస్మాదన్విష్య హి గుణా న్కార్యః పాత్రసమాశ్రయః;
న ఖేదజననం బుద్ధే రాచార్యస్య భవిష్యతి.
　　　　　　　　　　భరత. ౨౫—( )

పాఠ్యములో నటునికి ఒజ్జ ప్రతిశబ్దమును (ప్రతియక్షరమనియుం జెప్ప నొప్పును.) నేర్పవలయును. ఒద్దికలో నటులు గడిదేరినపిమ్మట నే ప్రయోగము కావింపవలయును. ఒండుచో నటులు నానావిధముల కవికిని, ఒజ్జకును అవమానముం దెత్తురు.

౩. నటులు అనుకార్యులదశాభావాదులను తాము నాట్యసమయమున స్వకీయములనుగా సాక్షాత్తుగా అనుభవించుచుందురని కొందఱు తలంతురు. అది పొరఁబాటు.

"యథా జన్తు స్స్వభావస్థం పరిత్యజ్యాన్యదైహికమ్;
తత్స్వభావం హి భజతే దేహాన్తర ముపాశ్రితః.
వేషేణ వర్ణకై శ్చాపి చ్ఛాదితః పురుష స్తథా;
పరప్రభావం కురుతే యస్య వేష ముపాశ్రితః."
　　　　　　　　　　భరత. ౨౧—( ).

"స్వాభావికేన రూపేణ ప్రవిశే ద్రఙ్గమండపే;
ఆత్మరూపం సమాచ్ఛాద్య వర్ణకై ర్వ్యావనైరపి.
యాదృశం యస్య యద్రూపం ప్రకృత్యా తస్య తాదృశం;
వయో వేషానురూపేణ ప్రయోజ్యం నాట్యకర్మణి.
యథా జీవ స్స్వభావం స్వం పరిత్యజ్యాన్యదైహికమ్;
పరభావం ప్రకురుతే పరదేహ ముపాశ్రితః.
ఏవం బుధః పరం భావం సోఽస్మీతి మనసా స్మరన్;
యేష వాగఙ్గలీలాభి శ్చేష్టాభిశ్చ సమాచరేత్."

నటుఁడు ఆయాసశాభావమును భావించి తనను తూలాభినయమును తలంపునకుం దెచ్చుకొని తాను గ్రుడ్డి పాత్రముచేసిన పాత్ర్యమును స్మరించుచు శబ్దార్థములు తప్పి పోనీయక అభినయించునే కాని అనుభవింపఁడు. ఈ సిద్ధాంతమే 'మనసా స్మరణ' అనుటచే సూచితము. అట్లే కానిచో, అనఁగా తనవిగానే అనుభవించునదేని, రావణ పాత్రము జటాయుపాత్రమును, నరసింహపాత్రము హిరణ్యకశిపుపాత్రమును సంహరింతురు; వారిచేత చావ నేని చత్తురు. భీమసేనపాత్రము దుర్యోధనపాత్రమును తొడ విఱుగఁగొట్టి అందుల నల్లం ద్రావును ఒండె, వానిదెబ్బచే తానయినం జొచ్చునొండె.

౪. ఇప్పు డిప్పుడు బుద్ధిమంతు లనేకులు వ్యుత్పన్నులు, రసజ్ఞులు నటులై ఈ నాట్యవిద్యకు గౌరవముం దెచ్చుచున్నారు. వా రేమో నైపుణిం బ్రదర్శించుచున్నారు గాని వారికి ఉత్కృష్టప్రకృతులయొక్క భావాదివిశేషములను అభిధ్యానించి అనుగుణాభినయముచే శోభింపఁజేయుటకు తగిన నాటకములు ఇంకను వెలువడకయున్నవి.

౨౦

ఉపసంహారము:

ఇట్టి ఈ నాట్యకళాకల్పవల్లిని నాగజెముడుగా పరిణమింపనీయక సహృదయులందఱును దీనికోహాదరహస్యమును చేర్చి, చేర్చి, దీనిం బోషించి, సద్రూపకరూపైతదీయపరిణతఫలములను నిపుణతమనటీనటపరివేషకులచేత రసికభోక్తలకు వడ్డనసేయించి భాషాదేవతాసమారాధనముం గావింతురు గాక!

# అనుబంధము

౧. ఈ నిషిద్ధములలో కొన్ని ప్రయోగింప నశక్యములు, కొన్ని అమంగళములు, విచ్ఛిత్తి విరహితములు, ఉద్వేజకములు. తత్తన్నిషేధములకు కారణముల నూహించుకొనవచ్చును. వ్రీడాకరములు సామాజికుల చిత్తశుద్ధికి భంజకములు; చెడునడవడిని నేర్పును.

'బయోస్కోపు లేనికాలపు నియమము లివి. ఇప్పుడు అశక్యములు గావు' అని కొంద ఱందురు. అప్పటికిని వ్రీడాదికారణములచే నిషిద్ధములేవో అవి త్యక్తవ్యములే; అనుచితత్వముచేత రత్నావళీప్రదర్శనములో దామోదరమిశ్రుఁడు వసంతోత్సవమును రాజవిదూషకాదులవ్రేలపారులచే ప్రత్యక్షముగా జరిపించెను.

కొన్ని నిషిద్ధములను కవిప్రతిభోత్పద్యమానములుగా నున్నను బయోస్కోపు ప్రభృతిసాధనములచేత సామాజికరంజనార్థము చూపించిన దోషమేమి? ఆయాపాయమున నటులకు విశ్రాంతియుం గల్గును.

ఒకప్పుడు కూచిపూడివారో మఱెవరో ఆడిన ప్రహ్లాదనాటకములో తమ్ముఁడు బల్లిదుఁడు నృసింహవేషి; అన్న హిరణ్యకశిపుఁడు. ఆవిష్టుఁడై నృసింహుఁడు కశిపుని పొడిచి చంపినాఁడు. ఆట ముగిసినది. తమ్ముఁడు తెలివి రాఁగా, 'అన్న యేఁడీ?' అని యడిగి 'నీవే చంపితివే' అని ఇతరులు చెప్ప విపరింపఁగాఁ, దానుఁబొడుచుకొని చచ్చెను-అని యైతిహ్యము కలదు.

నా స్నేహితులు చిలంబి ఆదినారాయణప్పనాయఁడుగారు (అధికారవిరామముం బొందిన పోలీసు ఇన్‌స్పెక్టరు) బల్లారిలో సరసవినోదినీ సభవారి పాదుకాపట్టాభిషేక నాటకములో ధర్మవరము కృష్ణమాచార్యులుగారు—నాటకగ్రంథకర్తయే— దశరథపాత్రముగా వచ్చి సోఫామీఁద మృతదశరథుఁడుగ పడియుండుటయు, (నలువురు) ముగ్గురు స్త్రీవేషమున వసనభూషణోజ్జ్వలముగా దానికోళ్ళకడం గూర్చుండి వేలు వేలు భావములలో 'పల్యంకక్రణము' పాడఁదొడంగుడు, "అయ్యో, కృష్ణమాచారీ, చచ్చిపోయినావేమి? ఈ పాడునాటకానికోసము నీవు చావనేల? ఆయనను చంపినారేమయ్యా పాపాత్ములారా! ఛీ!ఛీ! నేనిక్కడనుండలేను" అను నిత్యాదివిలాపములు గావించి ప్రేక్షాగృహములో పడిపోయినారు. మేము పలువురము ఆయనను ఉపాయమున ప్రేక్షాగృహమునుండి వెలికి గొనిపోయి పరుండఁబెట్టి ఆ తబ్బిబ్బు తీఱి వారు సుషుప్తిం జెందునజను వారికడం గాచియుండి, క్రమక్రమముగా వారిని మాకు దక్కిం

చుకొంటిమి. ఈ వృత్తము ప్రథమ కవిపండితసంఘ సమావేశములో నొకరాత్రి జరిగినది. రెండవ సమావేశమున మదరాసులో ఆసంఘము తుదముట్టినది.

## నీచపాత్రగ్రామ్యము:

౨ ఈ విషయమున మదీయగ్రామ్య భాషాప్రయోగ నిబంధనములం బరిశీలింపనగు.

పాత్రోచితభావ లేనిచో రూపకము అవస్థానుకృతి కానేరదు. వాచికాభినయము చెడును.

వాక్యమందు సంధిలేమి గ్రామ్యతాపాదకము గాదు. ఇందుకై మదీయవిసంధివివేకముం గనుఁడు.

అంకము—రంగము (=సీను) అంకమున కాల దేశవృత్తైక్యము లుండును సుఘటితతరములు. ఆఘటన రంగనాయకాధునికకల్పితవిభజనచేత శిథిల మగును. శిథిలమైన రసహాని కలుగును. కావున ఈ యవాంతరవిభాగములు పనికి రావు. ఎన్ని సీనులో అన్ని అంకములనియేల వ్యవహరింప రాదా?—నాస్వానుభవము—నేను ప్రతాపరుద్రీయమును సీనులు సీనులుగానే తొలుత వ్రాసికొంటిని. నా హృదయమునకు రసము అందలేదు. తృప్తి కాలేదు. మరల మరల మార్చుచుంటిని. మార్పులలో సంకోచమగపడినది. సంకోచము హెచ్చుగా హెచ్చుగా సీనులు తగ్గినవి. అంకములు కొంచెము హెచ్చినవి. ఈవిధమున విష్కంభప్రవేశాదిసంఘటనచే సీనుల పెంపు నివర్తిల్లినది.



# సందర్శనము

శివశంకర శాస్త్రి గారు

నినుం గనినయంతనే నిఖిలలోక గంభీరతా
   మనోజ్ఞ మహితాభయే మదికి దోచు సీమంతినీ!
జనించు వెనువెంటనే చకితలోచనాంతోల్లస
ద్వినమ్రత ఘనమ్ముగా విమలభావ సంశ్లిష్టమై.

చిరంబుగ మెలంగు నా స్మృతిపథమ్మునన్ సమ్మద
ప్రరోహ మధురమ్ముగా భవదపూర్వ లావణ్యతా
పరీవృత శరీరమున్ పరమపాండు కౌశేయమున్
కరేణు వరయానమున్ కటకకంకణారావమున్.

ప్రభాత సరసీరుహ ప్రతిభట ప్రభావోల్లసత్
స్వభావ రమణీయమౌ వదనబింబ మా ప్రొద్దునన్
శుభాంగి, యుదయింపగా సుదృఢ మామకాంతర్వ్యథా
విభావరి రయంబునన్ వెడలె నేత్రమార్గంబునన్!



## విఘ్నేశ్వర స్తవము

అంకముఁ జేరి శైలతన
  యాస్తనదుగ్ధము లానువేళ బా
ల్యాంకవిచేష్టఁ దొండమున
  నవ్వలిచన్ కబళింపఁబోయి యా
వంకఁ గుచంబుఁ గాన కహి
  వల్లభహారముఁ గాంచి వేమ్మృణా
ళాంకురశంక నంటెడు గ
  జాస్యునిఁ గొల్తు నభీష్టసిద్ధికిన్.

—మనుచరిత్ర.

# *అశోకుని శిలాశాసనములు: రాయలసీమ

మల్లంపల్లి సోమశేఖర శర్మగారు

ఇంతవఱకు అశోకుని శిలా శాసనములు కళింగ దేశమున జౌగడ ప్రాంతముననే కాని వేఱెచ్చటను గానరాలేదు. ఇప్పుడు మఱల గొన్ని అనంతపురంజిల్లా సరిహద్దుల ఆంధ్ర దేశములోని రాయలసీమలో బయలుపడినవి. వీటిని మొట్టమొదటకనిపెట్టి లోకమునకు ప్రకటించిన ఖ్యాతి గౌనర్మెంటువారిదే; కాని వారు ఏలనో కాని యవి యున్నస్థలమును వెలిపుచ్చకబహురహస్యముగదాచియుంచి కర్నూలుమండలమున గనబడిన వని మాత్రము ప్రకటించిరి. దక్షిణాంధ్ర దేశమైన రాయలసీమలో నివి బయలుపడుట నిజముగా ప్రాచీనాంధ్ర దేశ సౌభాగ్య ప్రాముఖ్యములకు తార్కాణమని చాల సంతోషించి యవి సత్వరముగ ప్రకటింపబడుట యాంధ్రావనికి సమ్మోదము గూర్పగలదని ఏతద్విషయమై పత్రికలలో గౌనర్మెంటువారు ప్రకటించిననాటి నుండియు అవి బయలుపడిన స్థలమును కనుగొనుటకై అనేక ప్రయత్నములుచేసి సఫలీకృత మనోరథులమైతిమి. ఇట్లు ప్రయత్నించినవారము నేనును, మన్మిత్రులు శ్రీయుత డాక్టరు వెంకట రమణయ్యగారును. కడచిన ఫిబ్రవరి ౨౮ వ తేది నాడు మే మురుపురము నీరాయల సీమకు ప్రయాణ మైతిమి.

అనంతపురం జిల్లా గుత్తి తాలూకాకు ఉత్తరపు సరిహద్దుగ కర్నూలుజిల్లా పత్తికొండ తాలూకా యున్నది. గుత్తికి చేరువగనే ఏడెనిమిది మైళ్లదూరమున, గుత్తినుంచి గుంతకల్లుకుపోవు రోడ్డుమీద తూర్పుప్రక్క ఎఱ్ఱగుడి అను గ్రామము కలదు. గుత్తికి అంతసమీపమున నున్నను ఇది పత్తికొండ తాలూకా గ్రామము. గుత్తినుండి యిచ్చటికి గుఱ్ఱపుబండ్లు కట్టుకొని పోవచ్చును: లేదా నడచి పోయినను సులభమే. గుంతకల్లురోడ్డుకి పడుమటితట్టున ఖండతుండెములుగ నున్న బోడిగుట్టలవరుసలు కొన్ని కలవు. ఇవి 'భోషాణ'పు పెట్టెలవలె చాల పెద్దవయిన నాపరాతి బండలు చిన్న వాటితోపాటు చేర్చి కూర్చిపెట్టిన ట్లుండును. గుంతకల్లురోడ్డుకి తూర్పువైపున నున్న ఎఱ్ఱగుడిగ్రామమునకు, పడుమటివైపున నున్న గుట్టలకు రమారమి మైలో రెండు మైళ్లో యుండును. ఈ గుట్టలలోని బండలమీదనే అశోకుని శాసనములుచెక్కబడియున్నవి. శాసనములు చెక్కినబండలు కొన్ని నిట్టనిలువుగను,

* గుత్తిప్రాంతమున అశోకశిలాశాసనములు కాన్పించినవనియు, వీటెనిమిత్తమై శ్రీయుత యన్. వెంకటరమణయ్యగారు వెళ్లుచున్నారనియు, అనుజ్ఞ యిచ్చిపంపిన నేనును వెళ్లుదుననియు దేశోద్ధారక శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారితో విన్నవించుకొనగా వారందుల కంగీకరించి ప్రయాణభృతి యొసంగి నన్ను పంపిరి. అందుకు వారి కనేక కృతజ్ఞతాపూర్వకవందనము లొనరించుచున్నాను.

కొన్ని ఏటవాలుగను ఉన్నవి: మఱికొన్ని బల్ల పరుపుగ పడియున్నవి. శాసనములు ఈ బండలను చక్కగ మలిచి చదునుచేసి చెక్కినట్లగు పడదు. ఏశాసనపు రాయియుగూడ చక్కగ చదునుగ లేదు. ఇందుకుతోడు ఈ రాళ్లలో కొంత యిసుక పాలుకూడ ఎక్కువ. ఈకారణములవలన శాసన ప్రతిబింబములు చక్కగ వచ్చుట కష్టసాధ్యము. గుట్టలు ఎత్తైయినవి కాకపోవుటచేతను, గుట్టలమీద చెట్టుచేమ లేవియు లేకపోవుటచేతను, గుట్టకు శాసనములు తూర్పుప్రక్కనే యుండుటచేతను ప్రతిబింబములు తీయవలసిన పనియంతయు ఎండలోనే జరుగవలసియుండును. ప్రతిబింబములు తీయుటలో రాళ్లు కడుగుట మొదలగుపనులుచేయుటకు నీళ్లు చాల అవసరము. అవి గుట్టదగ్గర లేవు. అక్కడికి రమారమి అరమైలు దూరమున గుంటలలో నుండియో, అచ్చటను లేనిచో గ్రామమునుండియో వాటిని తెప్పింపవలసియుండును.

మేము ఎఱ్ఱగుడికి పోయిన పిదపగాని మాకీకష్టసుఖములు తెలియరాలేదు. ఎఱ్ఱగుడి చిన్న గ్రామము. అచ్చట బ్రాహ్మణులది ఒక్క యిల్లు మాత్రమే కలదు. వంటభోజనము చేసికొని ప్రతిబింబములు తీయుపనికి పూనుకొందమన్న చాలకాలాతీత మగుటయే కాక తీవ్రమయిన యెండలో పనిచేయవలసి యుండును. అందును మేము వెళ్లినది కొంచెమించుమించు వేసవికాలమే. వంట భోజనము చేసికొని పనిచేసిన లాభము లేదని, కూలీల నేర్పాటుచేసికొని మధ్యాహ్న ముపవాసముతోనే శాసనప్రతిబింబములు తీసికొన నారంభించితిమి. కుంటలలో నుండి నీళ్లు తెచ్చుటకై కూలీలకు కుండకు అర్ధరూపాయ చొప్పున ఇచ్చుకోవలసి వచ్చినది.

కొన్నికొన్ని శిలలమీది యక్షరములు లోతుగ నున్నవి. మరికొన్నిటి మీదివి అరిగిపోయియో యెండవల్లనో తేల్చికనబడుచున్నవి. లోతుగ చెక్కిన శిలలమీది ప్రతిబింబములు బాగుగనే వచ్చును. మిగిలిన వాటిమీద, ఇంకను తగిన సన్నాహమున్నగాని మంచి ప్రతిబింబములు రావు. క్రింద నిలుచుండుటకును, నిలిచి ప్రతిబింబములు తీయుటకును తగిన వీల్లు లేకపోవుటచేతను, శాసనశిలలు కొన్ని మిక్కిలి యెత్తుగనుండి వ్రేలాడుచున్నట్లుండుటచేతను మంచె మొదలైన కట్టుబాటులు చేసిననేకాని ప్రతిబింబములు తీయుటకే సాధ్యముకాదు. మంచె మొదలైనవి కట్టించుటకు మోకులు కఱ్ఱలు మొదలగు సామానంతయు గుత్తినుండి తీసుకరావలసినదే కాని ఎఱ్ఱగుడిలో సందర్భపడదు. అదియునుగాక, శాసనశిలలు చదునుగాలేని మెరకపల్లములు కల యిసుకరాళ్లగుటవలన ప్రతిబింబములు తీయుటలో నుపయోగించు "డాబర్లు","బ్రష్షు" చాల ఉన్నగాని ప్రతిబింబములు తీయుట కష్టము: అనగా నీపనియంతయు బహువ్యయప్రయాససాధ్యము.

ఇవి యన్నియు మాకు మొదట తెలియలేదు. అయినను అట్టి విషమ పరిస్థితులలో

కూడ శాసన ప్రతిబింబములకై ప్రయత్నించినాము. ఎండలో చేయవలసిన పని: అది వేసవి యెండ. అవి యన్నియు తెగ కాలిపోవు రాళ్లు: క్రింద కాళ్లు, పైన నెత్తి మాడుచున్నవి. చెట్టు లేదు: చేమ లేదు. ఆమట్టమధ్యాహ్నము మాకు తిండిలేదు సరికదా త్రాగుటకు దగ్గఱ పుడిసెడు మంచినీళ్లయినను లేవు. ఇక మాయవస్థ చెప్పవలసిన దేమున్నది? రాతినికడిగి ప్రతిబింబము తీయు నిమిత్తమై దానిమీద కాకితము పఱచునప్పటికి క్రిందరాయి, పైని కాగితము కూడ ఎండిపోవుచుండెడివి. ఇందుకు తోడు గాలి: పరిస్థితులింత విషమముగ నున్నప్పటికి క్రిందుగనుండి తీయుటకు సాధ్యముగ నున్న రెండు మూడు శాసనములకు ప్రతిబింబములు తీసినాము; కాని అందు బాగుగ వచ్చినది ఒక్కటే పెద్దది. ఇదియైన నంత కంటె బాగుగనే వచ్చియుండును కాని ఆ పరిస్థితులలో అప్పుడు మాకు అంతకంటె సాధ్యమైనది కాదు.

శాసనలిపి బ్రాహ్మీలిపి: భాష ప్రాకృతము. మేము తీసిన ప్రతిబింబమునుబట్టి శాసనమును విడదీసి చదివి ప్రకటింపవలెనని కొంత ప్రయత్నించితిమి కాని శాసనపంక్తులు సరాసరిగ నుండక ఒకదానిలోనుండి మఱియొక దానిలోనికి పోవునట్లు చెక్కబడుటచేతను, కొన్ని యక్షరములు చెడుటచేతను శాసనమును విడదీయుటకే అసలు శాసనశిలను చూడవలసినపునరపేక్ష కలిగినది: కాని యది యెట్లు నెరవేరగలదు? ద్రవ్య సాధ్యము. అందువలన చేయునది లేక యాశాసనము నింతవరకు ప్రకటింపజాలమైతిమి. అశోకశాసన విమర్శజిజ్ఞాసువులకు ఉపకరింపగలదేమో కొంతవఱకైన నని మేము తీసిన శాసనప్రతిబింబము నిట నిచ్చుచున్నాము. (చూ—చిత్రము ౧.)

పత్తికొండ తాలూకా పర్వతారణ్యమయము. ఈ తాలూకాలో గుట్టలలోను, అడవులలోను ఇట్టి శాసనములు కొన్నికలవని "దర్యాప్తు"వలన దెలిసినది. ఈ ప్రాంతమున గుట్టల నానుకొనియు, ఇంచుకంత దూరముననుకూడ "తాండా"లు కలవు. సుకారితెండాలగూడెములకే "తాండా" లనిపేరు. ఇవి ఒక్కొక్క పల్లెటూరిని చేరియుండును. ఎఱ్ఱగుడి తాండా; గుత్తి తాండా-ఇట్లే గ్రామనామములతో చేర్చి వీటిని పిలుచుచుందురు. సుకారితండాలకు పశువుల వ్యాపారము వ్యవసాయము ప్రధానవృత్తులు. కొన్ని కొన్ని తాండాలవాళ్లు ఇట్టి శాసనములున్న స్థలములు చూపించెదమని చెప్పినారు—ధనాకాంక్షతోనే. అవి అశోకుని శాసనము లంత పురాతనపువైనను కాకపోయినను చాల ప్రాచీనశాసనములై యుండుననుట కవకాశము కలదు. గుత్తిరాజ్యము బాదామి చాళుక్యుల నాటినుండియు ప్రసిద్ధివహించిన దేశము. అన్వేషణమే సరిగాచేసినచో ఇంకను అంతకు పూర్వపు శాసనములుకూడ ఏవైన దొరకిన దొరకవచ్చును. ఈప్రాంత మింకను శాసనముల నిమిత్తమై చక్కగ "సర్వే" కావలసియున్నది.

పిదప మేము గుత్తికి చేరువ నున్న కొన్ని గ్రామముల బర్యటనము చేసితిమి. అందు ముఖ్యముగ జేర్కొనదగినది పెద్దవడుగూరు. ఊరంత పెద్దది కాకపోయినను చాల పురాతనమైనది. తరచు ఇక్కడ పాటిమట్టిలో పురాతనపునాణెములు బయలుపడుచుండునట. మేమాయూరు వెళ్లుటకు కొంతకాలమునకు బూర్వము అక్కడ నొకకుండలో పోసి కుండెడు సీసపు నాణెములు ఎవరిదొడ్డిలోనో దొరకినవట: కాని యూరివారు వాటిని వైద్యులకమ్మివేసిరట-భస్మముల నిమిత్తమో యేమో. మిగిలినవి యేమైదాటో యుండగా అచ్చటివారు వాటిని మా కిచ్చిరి. నాణెములు చాల అరిగిపోయినవి. వాటిమీద పేరులేవియు లేవు. ఈనాణెములకొకప్రక్క పూర్తిగ అరిగిపోయినది. రెండవప్రక్క ముఖము కుడివైపుకి గల గుఱ్ఱమును, ఆగుఱ్ఱపు ముఖమున కించుక దిగువ బంతివలె గుండ్రనై యుబ్బెత్తుగ నున్న చుక్కయొకటియు గలవు. సీసపునాణెము లెక్కువగ ఇంతవఱకు ఆంధ్రరాజులవే కానవచ్చుటచేత ఇవి వారివే యని మా యూహ. మాకు దొరకిన యీ సీసపు నాణెములు ఆంధ్రరాజులవే యని నిశ్చయింపదగియున్నను ఏ రాజువో మాత్రము ఖండితముగ జెప్పలేము. అయినను ఈప్రాంతమంతయు "ఆంధ్ర" రాజ్యములోనిదే యనిశాసనములవలననే కాక ఈనాణెములవలన గూడ నిశ్చయమగుచున్నది. ఈయూరిలోని శిలాశాసనములను బరిశీలించుటలో అమూల్యమైన శాసన మొకటి మాకు గోచరించినది. అది బాదామి చాళుక్యనృపతియైన మొదటి పులకేశినాటిది. ఇంతవఱకు మొదటి పులకేశినాటి శాసనములేవియు దొరకలేదు. ఇదియే మొదటిది కాని శాసనశిల చాల చెడిపోయినది. అప్పటికి మాకు తగిన సౌకర్యములు లేనికారణమునను, కలుగని కారణమునను ఆ శాసన ప్రతిబింబమును దీసికొన వీలు లేకపోయినది.

అటుతరువాత మిత్రులైన వెంకట రమణయ్యగారు శలవులేక చెన్నపురి వెళ్లిపోయినారు. తగినంత తృప్తికరమైనపని జరుపకయే మఱలివచ్చుట కిష్టములేక నేను కడప మండలమున ప్రాచీనశాసనముల నిమిత్తము సంచారము చేసినాను.

* * * *

కడపమండల సంచారమున కిది రెండవ తడవ. మొదటి తడవ శ్రీ వెంకట రమణయ్యగారితో కూడ వారి ఖర్చులమీదనే సంచారము చేసితిని. ఈ రెండు తడవలుకూడ పల్లెటూళ్లలో తిరిగి కొన్ని ప్రాచీన శాసనములు సంపాదింప గలిగితిని. ఈ రెండుపర్యాయములు కూడ నందలూరులోని వకీలుగారగు శ్రీయుత గజ్జెల సుందర రావుగారును, ప్రొద్దుటూరులోని వకీలుగా రగు శ్రీయుత గజ్జెల కృష్ణమూర్తి గారును, యఱ్ఱగుంట్లలోని వ్యాపారస్తు లగు శ్రీయుత కేతు వెంకటరెడ్డిగారును మాకు అమితోపకారులైరి. కడపమండలమున ఇంకను బర్యటనము సలుపవలసియేయున్నది: ముగియ లేదు. అందువలన మా పర్యటనవిశేషములను

దెలుపుట కిది యదను కాదు. కాని, పర్యట
నము చేసినందువలన చారిత్రకముగ గొప్ప
లాభము కలదని మాత్రము స్వానుభవమున
దెలుపుచున్నాను.

ఈపర్యటనములో కొన్నికొన్ని చోట్ల
నుండెడిశిల్పచిత్రములనుఫోటోతీసియున్నాము.
నందలూరికి చేరువగా అక్కడనుంచి కడపకు
బోవు రైలుమార్గమునకు కుడిప్రక్క, రైలు
స్టేషనుకు మూడుమైళ్లదూరమున కొన్ని శిలా
విగ్రహములు కలవు. ఇవి యన్నియు కలసి
పదునాలుగు ఉన్నవి. రెండు విగ్రహశిలల
మీద, విగ్రహముల ప్రక్క తమిళ శాసనములు
కలవు. ఇవి చాల చెడిపోయినవి. కాని తద్భా
షావిదులు శిలలయొద్ద గూర్చుండి చదివి శాస
నములను విడదీయవచ్చునేమో యని మాయూ
హ. మఱియొక విగ్రహముమీద "అణాలి శెట్టి
వీరప్ప" అని కాబోలు చెక్కబడియున్నది.
ఇవి యన్నియు వీరశిలలని మాతలంపు. ప్రతి
విగ్రహమును ధనుర్బాణములు, కత్తులు కటా
రులు, కుంతములు, కైజారులు, గండ్రగొడ్డళ్లు
మొదలైన యోధోచితాయుధములతో నొ
ప్పుచు చూడ ముచ్చటగనున్నది. తమిళ శాస
నముల మూలమునను, వీరులజుట్టుకట్టు, వేష
ము మొదలైన బాహ్యాలంకారముల మూల
మునను ఇవి చోళపాండ్యులనాటి వీరవిగ్రహ
ములు కాదగును. ఈప్రాంతమంతయు ప్రాచీ
నకాలమున చోళులయొక్కయు, పిదప పాం
డ్యులయొక్కయు పరిపాలనక్రింద నుండె నను
టకు నందలూరు సౌమ్యనాథస్వామి యాల
యములోని తమిళభాషాశాసనములే తార్కా
ణము. ఏతదాలయ నిర్మాణశిల్పమున చోళ
శిల్పకళాచ్ఛాయలు పొడకట్టుచుండును. ఒక్క
చోళ పాండ్యశాసనములేకాక కాకతీయ, విజ
యనగరాధీశుల శాసనములుకూడ నీయాల
యమున గానవచ్చుచుండుటచేత నీస్థలము
చాల పవిత్రమైనదనియు, నీప్రాంతము చరిత్ర
ప్రసిద్ధిని గన్నదనియు నిశ్చయింపవచ్చును.

ఈవీరశిలాచిత్రములలో ప్రభువును, ఆ
తని యనుచరులను వేషాలంకారములనుబట్టి
వేఱ్పఱిచి చూపవచ్చును. వీరు లందఱు ఆయుధ
పాణులై యుద్ధోన్ముఖులుగ నున్నట్లు చిత్రింప
బడినది. దర్శనీయములైనవి యీవీరశిలలు. వీటికి
చేరికగనే ఒకశిలమీద తమిళ శాసనము కల
దు. ఈ తమిళ శాసనమును జదివినచో ప్రాయిక
ముగ నీవీరశిలావృత్తాంతము కొంత తెలియ
వచ్చునేమో. గానర్మెంటు శాసన
శాఖవారు కాని, పురాతత్త్వ శాఖవారు
కాని వీటిని గమనించినట్లు కనబడదు. ఇట్టి
విగ్రహములకు చాలచోట్ల పట్టినస్థితియే వీటి
కిని పట్టినది. ముక్కులు విరిగిపోయినవి. పని
లేని పామరుల దుడుకుతనమువలన కొన్ని
కొన్ని విగ్రహములు వికృతాకృతిని గాంచి
నవి; అయినను విగ్రహములలో చాలవఱ
కింతవఱకు సంపూర్ణరూపముతోనే యున్నవి.
వీటి కించుక ఎదురుగ రైలుమార్గమున కవత
లి ప్రక్క ఒకమసీదు కలదు. నందలూరిలో
నుండు మహమ్మదీయులు ఈవీరులను గొలుచు
చుందురని చెప్పుదురు. ఆ విగ్రహములకు

ఈ మసీదుకు ఏదైన సంబంధము కలదో యే
మో. అచ్చటివారు ఈ ప్రతిమలు విజయనగ
రాధీశులకు సామంతులుగ క్రీ. శ. పదునాలు,
పదునేను, పదునెనిమిది శతాబ్దులలో ఆప్రాం
తమును బరిపాలించిన చోడవంశజులైన మట్లి
ప్రభువుల వని చెప్పుదురు కాని తమిళశాసన
ములు వీరుల వేషాలంకారములు—వీటినిబట్టి
చూచిన ఈ నానుడి సత్యమగునా యని మా
సంశయము.

ఈ విగ్రహముల కన్నిటికి ఫోటోలు
తీసికొనుట పడినది కాదు. కొన్నిటి మాత్రము
తీసినాము. ఆవీరుల రూప రేఖాలంకారములను
పాఠకులు గ్రహించుటకు తోడ్పడగల వని
దిక్ప్రదర్శకముగ ఆ వీరుల బొమ్మలను ఇందు
ప్రకటించుచున్నాము.

కామలాపురమునకు సమీపముననేయున్న
ఎల్లగుడిపాటిలోకూడ. చక్కని శిలావిగ్రహ
మొకటి యున్నది. అక్కడ ప్రాచీనశాసన
ములు కొన్ని కలవని తెలిసి యచ్చటికి వెళ్లి
నప్పుడు ఈవిగ్రహముయొక్క ఫోటో కూడ
తీసికొంటిమి. ఇచ్చటిశాసనములను దీసికొనుట
లోను, ఫోటోలను దీసికొనుటలోను అచ్చటి
అర్చకులైన శ్రీ రంగాచారిగారును, గ్రామ
మునసబుగారైన శ్రీబసిరెడ్డిగారును మాకు
చాల తోడ్పడిరి. ఆకర్ణాంతము జ్యావల్లిని లాగి
ధనువు మోపెట్టిన యా వీరవిగ్రహము నయ
నానందకరముగ నుండుటచే దాని బొమ్మకూడ
ఇందు ప్రకటించుచుంటిమి. (చూ. చిత్రము ౨.)

కడపమండలమున నేరెండుతడవలు చేసిన
సంచారమున కొన్ని విలువగల ప్రాచీనశాసన
ములను సంపాదింపగలిగితిని. కొంచె మించు
మించుగ నివియన్నియు క్రీ. శ. ఏడెనిమిది
తొమ్మిది శతాబ్దములనాటివి. శాసనములది
ప్రాచీనవేంగీచాళుక్య లిపి. భాష యంతయు
తెలుగే. సంపాదించిన శాసనములు చాల
వఱకు కడపచోళులవి. ఇవి దేశచరిత్రమునకు,
భాషాచరిత్రమునకు చాల అమూల్య
మైనవి. కడపచోళుల చారిత్ర మింతవఱకు
చక్కగ దెలియరాలేదు. పోర్మముఖరామ పుణ్య
కుమారుని మాలెపాడు తామ్రశాసన
మున నీకోవవారి వంశవృక్షమునందలి రాజుల
పేర్లు కొన్ని తెలియవచ్చుచున్నవి. ఈ
వంశపురాజులలో కొందఱిశాసనములు ఈ
పర్యటనమున సంపాదితములైనవి. ఇవి కడప
మండలచోళుల చారిత్రమునకు కొంత తోడ్ప
డగలవు. ఈ చోళులకే రేనాటిచోళులని
పేరు. వీరు సామంతులో, స్వతంత్రులో, వీరి
కిని తమిళచోళులకును, వీరికి తెలుగుచోళుల
కునేమైన సంబంధము లుండెనో లేదో, యున్న
నవి యెట్టివో యివి యన్నియు నింకను పరి
శోధనవలన సాధింపవలసిన సమస్యలే. చారి
త్రక పరిశోధన మింకను కొనలు సాగినగాని
యవి పరిష్కారము కాజాలవు.

రాయలసీమ యాంధ్రదేశమునకు కంఠా
భరణమువంటిది. చరిత్రపరిశోధన తత్పరులకు
గూడ అది కొంగుబంగారమే. తగినకట్టుబాట్ల
మీద వ్యయప్రయాసములకోర్చి యాసీమ

నంతయు తిరిగి ప్రయాణము చేసి చారిత్రకముగ పరిశోధనము సల్పితిమేని జీర్ణవిద్యానగర చారిత్రమే కాక ప్రాచీనాంధ్ర దేశచారిత్రము కూడ చాలవఱకు బయలుపడునను ఆశకలదు; కాని "ధనమూల మిదంజగ" త్తనునట్లు ఏకార్యమైనను ధనముతో నున్నది.

కాని యొక్క విషయము తెలుపవలసి యున్నది. రాయలసీమలో ఏ గ్రామమునకు బోయినను శిలాశాసనములకు-అవి విజయనగ రాధీశులనాటివైన నేమి, అంతకు పూర్వపువైన నేమి-లోటు లేదు; కాని సుస్థితిలో నున్నవి మాత్రము చాల తక్కువ. శాసనశిలలు కొన్ని ప్రాకారములలోని కెక్కియు, కొన్ని అరుగులలో దూరియు, వేఱొక కొన్ని సోపానములలో చేరియు, మఱికొన్ని కత్తులు మొదలైనవి నూరు సానరాళ్లుగను, సజ్జలు, కొఱ్ఱలు మొదలైనవి దంపుకొను రోళ్లుగను మాఱియు నాశన మగుచున్నవి ఇది యత్యంత విషాదకరమైన వృత్తాంతము. రాయలసీమనివాసులు వీటి భద్రపఱుపక ఇంకను ఇట్లే నిరాదరించినచో ఇంతవఱకు నిలిచియున్న శాసనశిలావశేషములు కూడ అంతర్ధానములై దేశచరిత్రకు చాల భంగము వాటిల్లగలదు. ఈ విషయమును గమనించి చరిత్రాభిమానులైన రాయలసీమవాస్తవ్యులు శ్రద్ధవహింతురు గాక!

---

## అది—

కొంపెల్ల జనార్దనరావుగారు

అది కికురించు తీయని స్వప్నశకలమా?—
పొదువునే యిటు తారి పొడవు తడవులు మిగాఱి?
ఎద ప్రోఁదలంపుల యిరుల తానక మాసె,
స్రిదలి రాలిన కోర్కె వేదుఱుల్ చలియింప?

అది స్వప్నశకలమే అయిన, తా వరియించి
మది మాధురులచాయ మలఁగిపో, నలరిపో,
సిగపూలదరుల వాసించి యా తలఁపులు
సెగలు తాఁకని యూర్పుసెలఁ దోఁగి, విరియవే!

అది కికురించు, తీయని స్వప్నశకలమై,
మదిఁ బ్రామిపుచ్చి సమ్మదకైతవచ్ఛాయ:
తొలఁచి సత్యానుభూతులు నిజప్రాభవో
చ్చల తమోగీతికాచయము ప్రోసుకపోవు!

---

దోమలబాధను తప్పించుకొనుటకుపాయము

హాయిగా సుఖనిద్రను పొందుడు, మంచిఆరోగ్యము గలుగును. ప్రపంచమందు నన్నికెక్కిన మా

# దోమ తెరలను

కొనుడు. గట్టి అల్లికనూలుచే తయారొనర్పబడినవి. అందముగా తయారొనర్పబడినవి.

సైజులు:—

| పొడుగు. | వెడల్పు. | ఎత్తు. | చదరపుగళ్లు. | గుండ్రపుగళ్లు. |
|---|---|---|---|---|
| 6 అ. | 3 అ. | 4½ అ. | రు. 5-8-0 | రు. 6-6-0 |
| 6 ,, | 4 ,, | 4½ ,, | ,, 6-8-0 | ,, 7-2-0 |
| 7 ,, | 3½ ,, | 5 ,, | ,, 7-10-0 | ,, 8-6-0 |
| 7 ,, | 5 ,, | 5 ,, | ,, 8-4-0 | ,, 9-8-0 |

ప్యాకింగు ఉచితం. పోస్టేజి ప్రత్యేకం.

ఎట్టిసైజువనైనను ఆర్డరిచ్చిన 24 గంటలలో తయారొనర్చి పంపగలము.

**The Union Trading Co.,**
166, Harrison Road. (C/4). Calcutta.

---

## ఒక అద్భుతనివారిణి

ఒలుబీజము, వాపు, అంత్రవృద్ధి, గొంతుమీద గలుగు పెద్దకాయ వగైరాలకు అద్భుతనివారిణి.

పక్షము దినములలో స్పష్టముగా గుణము తెలియును, ఒకనెలలో పూర్తిగా గుణము గలుగును. గుణమిచ్చిన తరువాత బహుమతి పుచ్చుకొనబడును. అప్పటి పైన ఆయుర్వేద ఔషధములు దొరకును.

Kaviraj K. K. SEN, Kavirajan,
20, Upper Circular Road, Calcutta.

---

## ఆత్మకథ

(గాంధిమహాత్ముని స్వీయచరిత్రము.

ప్రథమసంపుటము

క్రౌన్‌సైజు, పుటలు ౨౫౦

మేలయిన కాగితము ముచ్చటలు గూర్పు అచ్చు.

(వెల ఒకరూపాయ మాత్రమే)

తపాలఖర్చులు ప్రత్యేకము.

ఆంధ్ర గ్రంథమాల,
నెం. 7, తంబుశెట్టివీధి, మద్రాసు.

---



## బలహీనముగా నున్నట్లున్నది

సేనటోజనుతో నూతనశక్తిని తెప్పింపుము

సేనటోజను వాడిన కొద్దివారములలో బలారోగ్యములు రెండును చేకూర్చును.

పూనాలో సుప్రసిద్ధమైన డాక్టరు బి. యస్. యన్. యిట్లు వ్రాసెరి.

"కాయిలాపడినవారికి తిరిగి నరముల పుష్టిని సత్వముగలిగించుటకు సేనటోజను చాల ఉపయుక్తమైనది. మలేరియా వ్యాధి గ్రస్తులకు మంచి ఆహారము."

సేనటోజను సేవించిన మీరుకూడ బలిష్టులై శక్తిమంతు లగుదురు. కొలదివారము లుపయోగించినంతనే బలారోగ్యములను చేకూర్చి ఆనందాబ్ధియందు నోలలాడించును

# SANATOGEN

మంచి టానిక్ ఆహారము

కెమిస్టు లందరివద్దను దొరకును

తయారుచేయునప్పుడుగాని ప్యాకుచేయునప్పుడుగాని చేతులతో నంటబడదు (4)

నందలూరు వీరశిలా విగ్రహములు (చూ. పు. ౪౩౮)



౧



౨



౩



సౌమ్యనాథస్వామి ఆలయ శిథిలప్రాకారము నందలూరు (చూ. పు. ౪౩౭)



సౌమ్యనాథస్వామి ఆలయవిమానము (చూ. పు. ౪౩౭)



౨. ఎఱ్ఱగుడిపాటి ధనుర్వీరవిగ్రహము

# హిందూ ధర్మము*

కామరాజు హనుమంతరావు గారు

[దాని మూలతత్త్వము—మతసాంఘికసమస్యల నది పరిష్కరించు విధానము]

నిరంతర పరిణామము జెందుచున్న ప్రపంచమె సర్వమును గాదు.

ప్రపంచము శాసనాధీనమై పరిపూర్ణస్థితి జెందగలిగియుండుటనుబట్టి అది ఏ వస్తువునందుగాని, ఏ వస్తు సముదాయమునందుగాని పరిపూర్తి నొందనట్టి సత్యస్వరూపుడయిన పరమాత్మునిపై నాధారపడియున్నదని తెలియుచున్నది. ప్రపంచరూపమున గాకపోయినను, ప్రపంచమునందు పరమేశ్వరుడు గలడు. పరిణామవిధానమందలి ముఖ్యశ్రేణులేవియు ఆయన సృష్టివ్యాపారమునకు మేరలు గావు. చైతన్యమునో, ఆత్మజ్ఞానమునో సృజించుటకు పూనుట మాత్రమె గాక, ఆయన సదా సృష్టికార్యము సలుపుచుండును. ప్రాపంచికమును,ప్రపంచాతీతమును అని ద్వంద్వము లేదు. పరమాత్ముడు ప్రాపంచికమునందు వేరూని దానిని వికాసము నందించు శక్తిస్వరూపుడై యున్నాడు. దృగ్గోచరమును నశ్వరమును అయిన ప్రపంచమునందలి యనంత విభిన్నత, దృగ్గోచరుడును నశ్వరుడును గాని పరమాత్మునిచే పోషింపబడుచు కాపాడబడుచున్నటుల నిరూపించి జీవనరహస్యమును వ్యక్తపరచు పరిజ్ఞానమే హిందూధర్మతత్త్వము.

దుష్టత్వము, దోషము, కురూపము సృష్టిలో నుత్తమావస్థలు గావు. శిష్టత్వము ఏస్థితి నుండి ఏస్థితివరకు వర్ధిల్లగలదో దుష్టత్వము సూచించును. సౌందర్యము యొక్క సగము వికాసము కురూపమున గాన్పించును. సత్యమార్గమందలి మజిలీనె దోషము కనపరచును. ఆయవస్థలన్నియు గడచిపోవును. సంపూర్ణబహిష్కారార్హుడుగ ఏ మానవుడును దుష్టుడై యుండడు; పూర్తిగ ఏయభిప్రాయమును దోషయుతమై యుండదు. ఒక మానవాత్మయైన ఈశ్వర నిర్దిష్టమగు గమ్యస్థానము చేరలేదేని, అంతవరకు విశ్వము పరాజయము నొందినట్లే. ప్రపంచములో నే యొక యాత్మయు నితరాత్మలను పోలియుండదు గాన, అత్యంత దుష్టాత్మ యయినను వినాశము జెందిన తన్మూలమున ఈశ్వర కార్యక్రమమునందు లోప మేర్పడును. నరక మనునది లేదు. ఏలయన, ఈశ్వరుడులేని ప్రదేశము గలదనియు,ఆయన ప్రేమకు వశముగాని పాపములు గలవనియు నిర్ధారణ యగును. ఈశ్వరుడు వాస్తవముగ నపారకరు

---

* తత్త్వజ్ఞాన విశారదులగు ప్రొఫెసరు యస్. రాధాకృష్ణన్ యమ్.ఏ. గారు ఆక్స్‌ఫర్డు విశ్వవిద్యాలయములో నొసంగిన అప్టన్ మహోపన్యాసముల సారాంశము.

లాభుడైనయెడల, సర్వమానవులకు ముక్తిగలు
గుట నిశ్చయము. కాని ముక్తి సంఘటిల్లు
వరకు, మానవులయందు దోషమును అపరి
పూర్ణతయు నుండును. నిరంతర పరిణామయుత
మగు విశ్వములో దోషమును దుష్టత్వమును
క్రమక్రమముగ క్షీణించుచునే యున్నను, అవి
యనివార్యములు.

మతవిషయమున, హిందూధర్మముఆధ్యా
త్మికజీవనమును ఆధారము చేసికొని ధర్మాను
భవము సిద్ధాంతమునందు వివిధరూపముల ప్రక
టితమగునని చాటును. ప్రపంచమునందును,
మానవజీవితమునందును ఈశ్వరుడు ప్రధాన
సత్యమని గ్రహింపబడువరకు, ఒకదృష్టాంతము
తరువాత మరియొక దృష్టాంతము కనపరుప
బడును. తన తోటయందలి మొక్కలు ఈశ్వ
రుడు మొలిపించినవనియు, తోడి మనుజుని
తోటలోని మొక్కలు పిశాచముచే నాటబడి
తనచేత ఎంతశ్రమతోనైన నిర్మూలింపబడవల
సినవనియు తలంచునట్టి ద్వైతభావజనిత మగు
విశ్వాసమును హిందూధర్మము త్రోసిపుచ్చు
ను. శ్రేష్ఠమునకు శ్రేష్ఠతమము విరుద్ధముకా
దను సత్యమును పాటించి హిందూధర్మము
అనుభవముయొక్క సమస్త బాహ్యరూపము
లను అంగీకరించి వానిని ఉచ్ఛస్థితికి దెచ్చును.
దోషము కఠినదండనములవలన గాని హింసా
నిర్బంధములవలన గాని నివారింప బడక జ్ఞాన
ప్రబోధము మూలముననె క్రమముగ నిర్మూ
లన మగును.

ధర్మ మనుసరించుటలో, కొందరు పర
మేశ్వరుని ప్రత్యక్షముగ దర్శింపగోరుదురనియు,
కొందరు తత్సంబంధమగు యాథార్థ్య మంత
యు తెలిసికొన ప్రయత్నించుచు నానందింతు
రనియు హిందూధర్మము అంగీకరించును. కొం
దరు ప్రవృత్తియందును, కొందరు నివృత్తి
యందును శాంతిని బడయుదురు. ప్రత్యేకసామ
ర్థ్యములు గలిగియున్నను, అందరు ఏకదైవ
మును పొంద నభిలషించుచున్నారు గాన, వారి
వారి మార్గముల వారు తమ యేక గమ్యస్థాన
మును జేరుటకు సర్వజనీన ధర్మము తోడ్ప
డును. మనము ప్రత్యేకముగ గలిగియున్న దాని
కి సర్వప్రాముఖ్యము నీయదగదు. బ్రహ్మచర్య
ము, గార్హస్థ్యము, సన్యాసము—వీనిలో దేని
మూలముననైన పరిపూర్ణత జెందనగును.
సర్వమును ఏకరూపమున జూచు సంకీర్ణదృష్టి
సరియైనది గాదు. ప్రపంచములో విశుద్ధమాన
వునియొక్క పవిత్రజీవన మొకటి యుండిన, పతి
వ్రతయగు భార్యయొక్క నిశ్చాంచల్యముగాని
శిశువుయొక్క ఆడంబరము లేని అమాయకత్వ
ముగాని అనావశ్యములు గానేరవు. వివిధజీవి
తములయొక్క పరిపూర్ణతయు ఈశ్వర ప్రేరి
తమె. "ఎయ్యది ఘనమును శ్రేష్ఠమును సుంద
రమును శక్తివంతమును నైయున్నదో,
అయ్యది నా తేజోంశమునుండి వెలువడునని
తెలిసికొనుము."

(భగవద్గీత—10-41.)

వ్యక్తిజీవనము ఒక్కకాల పరిమాణము
గాక కాలవిభాగముల పరంపర యని కర్మ

సిద్ధాంతము మనకు చెప్పుచున్నది. జీవనయాత్రయొక్క గమ్యస్థానము మనము చేరువరకు నూతనావకాశములు మనకు కలుగుచుండును. మన మవలంబించు చరిత్రసిద్ధములగు నాచారవ్యవహారములు మన పూర్వకర్మఫలితములై యుండును. నిరంతరాయముగ ప్రవర్ధమానమగు నేకజీవనమందలి నిమ్నోన్నతావస్థలె నరకస్వర్గములు. వాని ననుభవించు వ్యక్తుల కవి బాహ్యములు గావు. పాపవిసర్జనద్వారమున పావనత్వము సిద్ధించును. బాధ పాపముయొక్క ఫలము. పాపము మనపుట్టుకతోడను, పుణ్యము పరులు మనకొరకు శ్రమపడుటవలనను,లభించునవి యని మనము తలంపనక్కర లేదు. ఎట్టిజీవితము మనకు ప్రాప్తమగునో దానియందే మన విధిని మనము నిర్వర్తింపవలెను. జీవనవృత్తిని నిర్ణయించుకొనుటయందు మనలో పలువురకు స్వేచ్ఛ లేదు.వంశపరంపరాగత గుణములు, శరీరారోగ్యము, మానసిక శక్తులు మన కేవి లభించునో వానిని పూర్తిగ సద్వినియోగము చేసికొనుటకు మాత్రము స్వాతంత్ర్యము గలదు. ఎట్టి సామర్థ్యమయినను, ఎట్టివృత్తియయినను,చక్కగా నుపయోగింపబడినచో, మనలను కేంద్రస్థానమునకు గొంపోవును.

భార్యాభర్తలు పూర్తిగ అన్యోన్యమగు శారీరిక మానసిక అధ్యాత్మిక సంబంధమును కలిగియుండుటకు యావజ్జీవిత వివాహానుబంధము అత్యుత్తమ సాధనముగ కనుపరుపబడినను, భిన్నములయిన ఆదర్శములు, అభిరుచులు, అభ్యాసములు, ఆశయములు కలిగిన జనులు తమ అభ్యున్నతికి తగినటుల ఇతరవిధములయిన వివాహములు చేసికొనుట కనుజ్ఞనీయబడెను. శాంతప్రవర్తనమువలనను, అతిసాహసపూర్వక ప్రయత్నముతోడను, వివాహము సుఖదాయకముగ చేయనగును. స్వభావములందు అననుకూల్యము గలదను కారణముచే, వివాహవిచ్ఛేదము న్యాయమయినయెడల, మనలో అనేకులు వివాహములను విచ్ఛేదము చేసికొనవలసి యుండును. స్త్రీలు నిర్వహించు కార్యములు పురుషులు నిర్వహించుకార్యములకు భిన్నములై యుండగా, స్త్రీలు పురుషులకన్న తక్కువయనుట కెట్టి హేతువును గాన్పించదు. వర్ణభేదము మిక్కిలి అరిష్టదాయకముగ పరిణమించినను, కొన్ని సహేతుకములయిన సిద్ధాంతములు దానికి మూలాధారములుగ నున్నవి. ఆదిమ వాసులని మనము నిరసించువారి యెడ మనము సానుభూతి కలిగియుండవలెను. నిమ్నజాతులయందలి జీవశక్తులను అంతరింపజేయుట గాక, వానిని గౌరవించి పెంపొందించుటయె నాగరకజాతుల క:ర్తవ్యము. సంఘము వేర్వేరు తరగతులు గల సమిష్టిజీవి. మానవ ప్రవృత్తులు గుణమునందునురీతియందును భేదించుచుండును. కాని ప్రతిప్రవృత్తియు సర్వమానవప్రయోజనమునకు సాయపడునంతవరకు, అది విలువగలదియె. ఒక్కొక్కమాదిరి ప్రవృత్తిద్వారమున వృద్ధి నొందింపబడవలసిన ఒక్కొక్క మాదిరి స్వభావముండును. ఏకకాలమున ఎవ్వడును

ఉత్తమభక్తుడును, ఉత్తమ చిత్రలేఖకుడును, ఉత్తమతత్త్వజ్ఞుడు కాజాలడు. ఒక్కరీతిని స్పష్టముగ గాన్పించు ప్రతిజీవితమును కొన్ని హద్దులు గలిగి ప్రత్యేకముగనుండును. దానికి అవి యితరవిధములయిన యభివృద్ధులు కలుగనీయవు. పాటుపడు ప్రతివ్యక్తియు తన విధి కృత్యము ద్వారమున తనయందు గర్భితములై యున్న శక్తులను వర్ధిల్లజేసి లోకసంగ్రహమునకు తోడ్పడు సేవగా దానిని చేసికొనవలయును. ప్రతి విధికృత్యము నేర్పుతో సాధింపబడవలసిన వృత్తియు మానవసేవయునై యున్నది. ఏకత్వమును గుర్తించు తీవ్రసద్బుద్ధి కొరవడి భిన్నజాతులు ఒక్కటిగ బంధింపబడక పోవుటచే మనయందు జాతిసంఘర్షణములు ప్రబలుచున్నవి.

ఇవియె హిందూధర్మముయొక్క కొన్ని మూలసూత్రములు. నేడు హిందూధర్మము జీవించియున్నయెడల, అవియె అందునకు కారణము. కాని దాని జీవశక్తి బహ్వల్పముగ నున్నది. ఉబుకుచుండు జలవలె ఒకప్పుడు జీవశక్తి యుండినచోట, సోమరితనము ప్రబలినది. నేడు మనము కొట్టుకొనిపోవుచున్నాము గాని ముందునకు సాగిపోవుటలేదు. మన కాళ్ల దగ్గరకు మన భావ్యభ్యున్నతి రానున్నదని యెదురుచూచుచున్నాము. జీవశక్తి అభావమైనది; ఆధ్యాత్మిక పతనము ప్రాప్తించినది. రాజకీయముగ మనకు కలుగుచువచ్చిన మార్పుల మూలమున, పరిణామ సూత్రములను విస్మరించినారము. హిందూ నాగరకతవిజృంభించియుండిన సుదినములలో, సముద్రమును దాటుట, వలస రాజ్యములు స్థాపించుట, లోకమునకు జ్ఞానము గరపుట, లోకమునుండి జ్ఞానము బడయుట—ఇట్టివి సాధించుచు అది జీవముతో నుత్తేజితమై యుండెను. అత్యున్నతస్థితికి వచ్చిన ప్రపంచజాతులలో దేని నాగరికతకును అది ప్రకృతిశాస్త్రము లందును, చిత్రకళలందును, వర్తకవ్యాపారములందును, కడచిన అయిదు శతాబ్దములవరకు వెనుకబడి యుండలేదు. నేడు మనలను జూచి మనమే భయపడుచున్నాము. కావున ఆత్మసంరక్షణమునకై మన మతముయొక్క బాహ్యాచారములను పట్టుకొని పెనగులాడుచున్నాము. దేని మూలమున ప్రాణమును కాపాడుకొన యత్నించుచున్నామో ఆయాచారములే దాని వృద్ధికి అడ్డువచ్చుచున్నవి. వృక్షముయొక్క లోపలి భాగము ఎంత సజీవముగ నుండునో దానిని కాపాడు బెరడును అంత సజీవముగ నుండవలెను. వృక్షము పెరుగుట కది యాటంకముగ నుండరాదు. అంతరజీవ బలమున కనుగుణముగ నది విస్తరింపవలెను.

మానవాభివృద్ధియందు ఒకస్థితికి అర్హమును యోగ్యమును అయినట్టి సంస్థ, మనము మరియొక స్థితి పొందినప్పుడు అనర్హమును అనర్థదాయకమును అగును. ఇది సనాతన పద్ధతియని సంస్కరణమున కాటంకముగ పూర్వాచారపరాయణులు పెట్టు ఘోష, దార్శనిక జ్ఞానమునకును, ఆచరణమునకును, అభిరుచులకును, నీతులకును, శాసనములకును,

సంఘమునకును, నడుమ నున్నట్టియు ప్రాచీన హిందువులు స్పష్టముగ గ్రహించినట్టియు పరస్పర సంబంధమును నిరూపించు ముఖ్యసిద్ధాంత విషయములను గమనింపదు. లెక్కింప శక్యము గాని శతాబ్దములనుండి హిందూ దేశమునందు కాలము ఒకేవిధముగ నున్నదనియు, సృష్టి ప్రారంభమందుండిన మహాసముద్రము వెంబడి పోయిన నాటినుండి ఎట్టిమార్పును కలుగలేదనియు తలంచుట కేవలము పొరపాటు. ప్రాచీనముతో సంబంధమున్నటులనే కాలమునకు పరివర్తనము కూడ గలదు. యజ్ఞయాగాది హీనకర్మలతో గూడిన వైదిక మతమును అతిక్రమించిన స్వచ్ఛమగు నాధ్యాత్మికోద్యమము యొక్క ఫలితములే ఉపనిషత్తులు, ఉపనిషన్మతము, సిద్ధాంత రాద్ధాంతములందు శుష్కించి వాదప్రతివాదముల యొక్కయు కలహముల యొక్కయు నుద్రేకముచే ధర్మసంబంధమైన స్వాతంత్ర్య భావమును కోల్పోయినప్పుడు, సత్యముయొక్క సరళతను నైతికనియమముల యొక్క గాంభీర్యమును బౌద్ధమతము జనులకు బోధించెను. దాదాపుగ నాకాలమందె ధర్మవితర్కములు సేయు బుద్ధిచేతను, శుష్కజ్ఞానార్జనముచేతను ధర్మము అమానుషమైన విపరీతపాండిత్యముగపరిణమించికష్టసాధ్యమగు నా నిక్కష్టపాండిత్యము బడసిన విద్వాంసులు అత్యంత గర్వభాయిష్ఠులయినపుడు, హృదయ పారిశుద్ధ్యముగలవా రెల్లరకు స్వర్గకవాటము లను భగవద్గీత తెరచెను. కర్మిష్ఠులు సజీవ ధర్మమును పట్టి కర్మకలాపములందు బంధింప గలిగినప్పుడు, యథార్థప్రవక్తలగు వైష్ణవ శైవ భక్తులును, శంకర రామానుజులవంటి దార్శనికులును, సచేతనుడైన పరమేశ్వరుని యుపాసన సలుపుటకు జనులను హెచ్చరించిరి. మధ్వ చైతన్యులు, బసవ రామానందులు, కబీరునానకులు, కలిగించిన ధర్మోత్సాహము అసాధారణము. జనులలో ప్రబలుచువచ్చిన విశ్వాసములనుగాని ఆచరణములను గాని పరిశీలించినచో, ఏకరూపము గలిగి యెట్టిమార్పు జెందని నిశ్చల హిందూధర్మమను నట్టిది కానబడదు. హిందూధర్మము నిశ్చలస్థితిగాక సంచలనము; పరిమితమగు ప్రబోధముగాక ప్రవర్ధమానమగు సాంప్రదాయము. జ్ఞానవిషయమునగాని, సంఘవిషయమున గాని భవిష్యత్కాలమున ఎట్టి క్లిష్టసమస్య ఎదుర్కొనినను, దానిని హిందూ ధర్మము పరిష్కరింపగల దని గత చరిత్ర వలన మనకు రూఢియగుచున్నది.

కొన్ని శతాబ్దముల దీర్ఘ కాల విలంబనము తరువాత, హిందూధర్మము తిరిగి స్వజనశక్తిని వ్యక్తపరచుచున్న కాలములో మనము నేడు జీవించుచున్నాము. మన పురాతన మతమును నూతనదృష్టితో పరీక్షించుటకు మొదలిడినారము. మనసంఘము కదలికను జెందుచున్నట్లు తెలిసికొనుచున్నారము. శుష్కించి నశించినదియు ఛేదింపవలసినదియునగు సరణ్యమెంతయొ గలదు. హిందూధర్మ మూలసూత్రములు త్యజింపక, సంచలనమందుచు నెక్కువ క్లిష్టముగ గాన్పించు నేటి సాంఘికపరిస్థితుల యక్కరలకు తగినటుల వానిని మరల ప్రతిపా

దించుటయె యావశ్యక మని హిందూధర్మము యొక్క తత్వమును, దాని యాచరణ విధానమును నేడుద్బోధించుచున్న హిందూ నాయకులు నమ్ముచున్నారు. హిందూ ధర్మము యొక్క పూర్వచరిత్రయందు అనేకపర్యాయములు జరుగుచువచ్చిన కృషియె యాప్రయత్నము. క్రొత్త పరిస్థితులందు సామరస్యము సమకూర్చుటయె నేడు జరుగుచున్నపని. వేరులు లోతుగ ప్రాకినప్పుడు వృక్షము నిదానముగ పెరుగును. కాని చీకటిలో చిన్నదీపము వెలిగించువారు కూడ ఆకాశ మంతయు ప్రకాశమానము చేయుటకు సాయపడుదురు.

---

## భారతాభివృద్ధికై యాధునికమతములు

శ్రీ విక్రమదేవవర్మ గారు

సీసమాలిక

భారతదేశంబు పరదేశములతోడఁ దులఁదూఁగి వెలుఁగొందవలయు ననిన
నబలలు లౌక్యవిద్యావతు లగుటయె తగు విధానమని కొందఱి మతంబు
తరుణులకెల్ల స్వాతంత్ర్యంబు లొసఁగుటె తగువిధానమని కొందఱి మతంబు
విధవలకుం బూని పెండ్లిండ్లు సేయుటె తగువిధానమని కొందఱి మతంబు
బాల్యవివాహంబు వడి రూపుమాపుటె తగు విధానమని కొందఱి మతంబు
వివిధమతకులుల పెండ్లిండ్లుజరుగుటె తగు విధానమని కొందఱి మతంబు
అందఱు నొకచోట నారగించుటసుమ్ము తగువిధానమని కొందఱి మతంబు
ప్రజలందఱును నేఁతబట్టలంగట్టుటె తగువిధానమని కొందఱి మతంబు
పరదేశవస్తువు వాడకుండుటసుమీ తగువిధానమని కొందఱి మతంబు
ప్రాఁతపద్ధతులను బాటింపకుండుటె తగువిధానమని కొందఱి మతంబు
క్రొత్తసంఘంబులంగూర్చుటే నిజముగాఁ దగువిధానమని కొందఱిమతంబు
పెద్దచిన్నయనెడి భేదశూన్యంబు సూ తగువిధానమని కొందఱిమతంబు
ఎన్న భారతదేశాభివృద్ధికొఱకు - వలసెడి విధానములఁ దగఁ దెలియనట్టి
జనుల మస్తిష్కసంభవాశ్చర్యకర మ-తంబు లివియని యింకఁ గొందఱి మతంబు.

---

# చీనా స్త్రీ స్వాతంత్ర్యస్వరూపము

ఓగేటి వెంకటసుబ్బయ్య శాస్త్రిగారు

ఆసేతు హిమాచలపర్యంతము భారతదేశమునందు స్త్రీలలో సంచలనము గలిగినది. దేశమునందలి ప్రజలలో సగముకంటె పైగానున్న స్త్రీజనము విద్యావిహీనమై, పశుప్రాయమై యున్నంతవరకు భారతదేశమునకు ముక్తిలేదని యెల్లెడలను గ్రహింపబడుచున్నది. బాల్యవివాహముల యెడల మోహము తగ్గుచున్నది. ప్రౌఢావివాహముల యెడ నాదరము హెచ్చుచున్నది. వితంతూద్వాహములు ప్రబలుచున్నవి. పురుషులతో పాటు స్త్రీలకు వారసత్వపు హక్కులుండవలెనని యాందోళనము సాగుచున్నది. వేయేల స్త్రీస్వాతంత్ర్యోద్యమము సర్వతోముఖముగా వర్ధిల్లుచున్నది. ఇట్టితరి భారత నారీమణులును, స్త్రీస్వాతంత్ర్యోద్యమాభిమానులును భారతదేశమున కావల స్త్రీజనాభివృద్ధికై జరుగుచున్న ప్రయత్నముల నరయుచుండుట సంభావ్యము.

ఇటీవల పాశ్చాత్యదేశములందువలెనే ప్రాచ్యదేశములందును, స్త్రీలలో ప్రచండసంచలనము కలిగినది. తమ బురఖాలి వావలయుంచి పురుషులతో పాటు స్త్రీలు సంచరించుటకు తురుష్కదేశము దారిజూపెను. తీవ్రసంఘసంస్కారియగు అమనుల్లాప్రభువు కెమల్ పాషా మార్గము ననుసరించి ఆఫ్గనిస్థానమును రెండవతురుష్కముగా మార్చజూచెను. చీనా, జపాను, భారతదేశములందుగూడ స్త్రీ స్వేచ్ఛాభిరుచులు ప్రబలముగా వీచసాగెను. విదేశప్రజల నిరంకుశత్వము నంతేయు, ఈ విదేశీయుల యందనుండి తమప్రజల యోగక్షేమముల నరయజాలని మాంచూరాజుల నిరంకుశ వ్యర్థ ప్రభుత్వమునుండియు తప్పించుకొని జాతీయప్రభుత్వమును స్థాపించి సర్వతోముఖాభివృద్ధిగాంచినచీనాస్వాతంత్ర్యోద్యమము నుగూర్చి వివరించుటయే ఈవ్యాసముయొక్క ఉద్దేశ్యము.

౧౯౧౧ వ సంవత్సరమున చీనాదేశము ప్రజాస్వామ్య మయ్యెను. అంతకుపూర్వము నిరంకుశప్రభువులగు మాంచూసంతతివారు రాజ్యముచేయుచుండిరి. వీరి కాలములో చీనాప్రజల యవస్థ దుర్భరముగా నుండెను. ఈదురవస్థనుండి తప్పించుకొనుటకై చీనా స్వాతంత్ర్యోద్యమాచార్యుడగు డాక్టర్ సన్‌యాట్ సేనుగారు విశ్వప్రయత్నములు చేసిన విషయములును, ఆ ప్రయత్నముల ఫలితముగా చీనాప్రజాస్వామ్యము స్థాపింపబడుటయు, చీనాచరిత్రను గమనించుచున్న వారికందరకును తెలియును. సన్‌యాట్ సేనుగారి ప్రయత్నమునందు చేయూతనొసంగి, చీనా స్త్రీ స్వాతంత్ర్యమునకు పునాదులను వేసినది వారి ధర్మపత్ని. భర్తతోపాటు విదేశములను దర్శించి, అచ్చటిస్త్రీల యుద్యమములను గమనించి యామె తనదేశీయులను సవ్యమగు మార్గములయందు నడిపెను ఆమె విద్యావతి, విజ్ఞానవతి, ధీర, వీరమాత, చీనాప్రజలకు ప్రేమాస్పద. ఆమె నాయకత్వమున నడుపబడు ఉద్యమము క్రమక్రమముగా వృద్ధినొంది యీకాలమున ఫలపుష్ప పల్లవశోభితమగు మహావృక్షమువలె విజృంభించినది.

చీనాప్రజాస్వామ్య స్థాపనమునకు పూర్వము స్త్రీల యభివృద్ధికై ప్రయత్నము లేమియు జరుగలేదని కాదు. పాశ్చాత్య మతబోధకుల యాజమాన్యమున కొన్నికొన్ని పాఠశాలలు స్థాపింపబడెను. చీనాలో మొదటిపాఠశాల ౧౮౪౪ వ సంవత్సరమున క్రైస్తవమత ప్రచారకులచే స్థాపింపబడెను. ౧౮౪౪ నుండి ౧౮౬౦ వరకు యింకా ౧౧ పాఠశాలలు స్థాపింపబడెను. ౧౮౯౫ వ సంవత్సరమున దేశీయులచే పాఠశాల స్థాపింపబడెను. ఈ పాఠశాలలవలన కొంచెముగా లాభమున్నను స్త్రీల ఆచారవ్యవహారములను, సాంఘికదురాచారములను మాన్పుట కవి సమర్థము కాకుండెను. భారతదేశమునందువలె చీనాదేశమునందును ఆచారముయొక్క నిరంకుశత్వము హెచ్చు. స్త్రీలెల్లప్పుడు తమ గృహముల లోనేయుండి పనిపాటుల చేయుటయేగాని బయటికి

వచ్చుట అరుదు. ఆడుపిల్లలు పుట్టగానే వారిపాదములు పెరుగకుండ బంధింపబడుచుండెను. స్త్రీలు పాఠశాలల కేగి విద్య నేర్చుకొనుట అవసరముమాలిన పనిగా గాన్పించుచుండెను. చీనాప్రజాస్వామ్య స్థాపనానంతరము ఈస్థితి సంపూర్ణముగా మారెను. ఇప్పుడు చీనాస్త్రీలు రాచబాటలయందు ధైర్యముగా నడువగలిగియున్నారు. శిరోజములను కత్తిరించి పాశ్చాత్య సాంప్రదాయముల ననుసరించి యుడుపులను ధరించగలరు. రిక్షాలలో వెళ్లగలరు. పురుషులతోపాటు స్త్రీలును పాఠశాలల కేగి విద్యాభ్యాసము చేయగలరు. పూర్వాచార ప్రాబల్య మింకను కొంతయున్నను జాతీయప్రభుత్వమువారి చట్టముల మూలకముగను, స్త్రీజనాభివృద్ధియందు పురుషులు చూపుచున్న శ్రద్ధవలనను అభివృద్ధి చాల గలదు. పదిసంవత్సరముల క్రిందటి స్థితికిని యిప్పటిస్థితికిని సహస్రాంశము భేదమున్నదని చీనావారే ఆశ్చర్యమగ్నులగుచున్నారు.

చీనాప్రజాస్వామ్యము స్థాపింపబడిన యనంతరము పురుషులతోపాటు స్త్రీలకును విద్యాసౌకర్యముల నొసంగుచు విద్యామంత్రి యీక్రిందిప్రకటనము గావించెను.

"చీనా ప్రజాస్వామ్యము సుస్థిరముగను, బలీయముగను నుండవలెననినచో ప్రజలలో విద్యాభివృద్ధి గలుగవలెను. కావున పురుషుల విద్యతోపాటు స్త్రీలవిద్య రెండిటను మనము అత్యంతశ్రద్ధ వహించవలెను. పాఠశాలలలో నేర్చుకొను సామాన్యవిద్యతోపాటు సాంఘికవిద్యకును మన మేర్పాటులు చేయవలెను."

ఈ ప్రకటన చేయునాటికి స్త్రీవిద్య కొంతవరకు అభివృద్ధియయ్యెను. ౧౯౧౨ వ సంవత్సరమున కొంతమంది స్త్రీలు చేరి ప్రభుత్వసేవయందును, విద్యావివాహాదుల యందును పురుషులతోపాటు స్త్రీలకును సమాన హక్కులుండవలెననియు, బానిసత్వమును నిర్మూలము గావింపవలెననియు, పురుషుడు లంజెల నుంచుకొనుట మాన్పింపబడవలెననియు నాంకింగులో తాత్కాలికముగా స్థాపితమైన ప్రభుత్వమునకు మనవిచేసికొనిరి. కాని ౧౯౧౯ వ సంవత్సరమువరకు అభివృద్ధి హెచ్చుగా లేకుండెను. చీనాదేశములో ప్రబలిన అంతఃకలహముల వలన నీ యుద్యమమునకు అంతరాయము కలిగెను.

చీనా స్త్రీ స్వాతంత్ర్యోద్యమమును గురించి విచారించుటకు అంతర్జాతీయ శాంతిస్వాతంత్ర్యసంఘము వారు ౧౯౨౪ న సంవత్సరమున నొకచిన్న సంఘమును చీనాదేశమున కంపిరి. ఈ సంఘము చీనాలో ప్రఖ్యాత పట్టణములగు షాంగే, నాంకింగ్, పెకింగ్, హాంకో, కాంటన్ మొదలగు పట్టణములను దర్శించి తమ యభిప్రాయములను ప్రచురపరచిరి. వీరి వ్రాతలవలన చీనాయందు ప్రాథమికవిద్యయందువలెనే మాధ్యమిక, ఉన్నతవిద్యలయందుగూడ చాల యభివృద్ధిగలిగినట్లు తెలియుచున్నది. వారు దర్శించిన యొక ప్రాథమికపాఠశాలయందు బాలురును, బాలికలును కలసి ౩౮౦ మంది యుండిరి. బాలికలు ౬-౧౪ సంవత్సరముల యీడుగలవారు కూడ వచ్చుట విద్యాభ్యాసము చేయుచుండిరి. ఉపాధ్యాయులు కొందరు స్త్రీలుగాను, కొందరు పురుషులుగాను ఉండిరి. కాని ప్రధానోపాధ్యాయి మాత్రము స్త్రీయే. బాల బాలికలు కోలాటము వేయుచు, పాటలుపాడుచు మిక్కిలి సంతోషముగా నుండిరి. విద్యాబోధ దేశీయభాషయందు జరుగుచుండెను.

ఈసంఘమువారు దర్శించిన యింకొక పాఠశాలలలో ౧౪౦౦ బాల బాలికలుండిరి. నవీనపద్ధతులపై చీనాస్త్రీలు వారికి విద్యగరపుచుండిరి. ౪౦౧ మంది ఉపాధ్యాయులలో ౨౦౦, ౯౦ మంది స్త్రీలుండిరి. చీనాస్త్రీలకు ఉన్నతవిద్య గరపు బాధ్యతను అమెరికా సంయుక్తరాష్ట్రములు నిర్వహించుచుండెను. ఆ దేశమునందు శిక్షనొందిన ఉపాధ్యాయినులు తమ దేశమునకువచ్చి తమ స్త్రీలలో విద్యాప్రచారము గావించుచుండిరి కాని యిప్పుడు చీనాలోనే అనేక విద్యాలయములు వెలసినవి. యంచింగ్ విశ్వవిద్యాలయములో స్త్రీలు చాల మంది యున్నారు. వారి సంఘముకూడ నచ్చట బలీయముగా నున్నది. షాంగే విశ్వవిద్యాలయమునందు గూడ స్త్రీవిద్యార్థినులు పెక్కురు గలరు. పరీక్షకు బోయిన

# సింహళద్వీప యాత్ర చిత్రములు



౧. ధనుష్కోటివద్ద బోటుమెయిలు, సింహళమునకుపోవునది.



౨. కాండీపట్టణము-పర్వతముపైనుండి చూచిన దృశ్యము



౩. కాండీపట్టణపు సరస్సు



౪. బొటానికలుతోటలు-కాండీపట్టణము



౧. విక్టోరియా మెమోరియల్ భవనము-కలకత్తా

కోట్లకొలది వెచ్చించి కట్టిన చలువరాతికట్టడము. ఇందు ఆంగ్ల ప్రముఖుల తైలవర్ణచిత్రములు కొన్ని కలవు. ఇది చూడదగినది.



౨. జైన దేవాలయము-కలకత్తా

దీనికి పరశురామమందిర మనియు పేరు గలదు. చక్కని ఉద్యానములు, అందమయిన కొలకులు చుట్టు గలిగి యిది మిగుల హృదయంగమముగ నుండును.



3. సహస్ర స్తంభ దేవాలయమునందలి నంది
హనుమకొండ



౪. సహస్ర స్తంభ దేవాలయము-గర్భగృహము
హనుమకొండ



౫. సహస్ర స్తంభ దేవాలయమంటపము-
(శిథిలము)
హనుమకొండ

౧-౨. ఏ. యస్. ఆర్ ఫోటో స్టూడియో చిత్రములు. 3-౫. శ్రీ ఏ. వి. రామచంద్రరావుగారి చిత్రములు.

౧౯౦౦ లో మొదటి ౫ స్థానములను స్త్రీలలంకరించి పురుషులకన్న రేం విషయములయందును స్త్రీలు తక్కువ కారని ప్రపంచమునకు చాటిరి.

విద్యాబోధయందువలె సాంఘికసమస్యల యందును స్త్రీలు మిక్కిలి శ్రద్ధవహించి పాటుబడుచున్నారు. రోగులకు సేవజేయువారి సంఘము (Nurses-association) చీనాయందు ప్రశంసనీయమగు కృషి సల్పుచున్నది. మొదట నీసంఘము పాశ్చాత్యులచే స్థాపింపబడినను దీనిలో నిప్పుడు ముప్పాతికవంతు చీనాస్త్రీలే యున్నారు. క్లిష్టమగు ఆరోగ్యసమస్యలను వీరు పరిష్కరించి, ప్రజలలో ఆరోగ్యము వృద్ధియగునట్లు విశేష ప్రయత్నములు చేయుచున్నారు. ఇందుకై చీనాయందు ౧౨౫ పాఠశాలలు కలవు ౧౯౨౭ వ సంవత్సరమునందు విదేశీయ సేవకులందరు పాఠశాలలలోనుండి వెళ్లిపోవలసిరాగా వానినన్నింటిని నిర్వహించి, చీనా స్త్రీలు ప్రశంసనీయముగా ప్రవర్తించిరి. చీనాలో స్త్రీడాక్టరులు చాలమంది గలరు. వీరు దేశమునకు చేయుచున్న సేవయు మిక్కిలి ప్రశంసాపాత్రము. కాంటనులో ౧౮౯౯ వ సంవత్సరమున హాకెట్ మెడికల్ కాలేజి స్థాపింపబడెను. స్త్రీక్రైస్తవ మెడికల్ కాలేజి గూడ వైద్యవృత్తికి స్త్రీలను తయారుచేయును. ఈ కళాశాలలుగాక ఐరోపాఖండము నందును, అమెరికా యందును అసంఖ్యాకములగు స్త్రీలు వైద్యవిద్య నభ్యసించి తిరిగివచ్చి దేశసేవచేయుచున్నారు. క్రైస్తవయువజన సంఘము మిక్కిలి ప్రశంసనీయమగు కృషిసల్పుచున్నది.

షాంగేలో కర్మాగారములయందు పనిచేయు స్త్రీల శోకవిద్యాలయము కలదు.

నల్లమందు, యితర మత్తుపదార్థముల యుపయోగమును మాన్పించుటకై ౩౬ సంఘములు పనిచేయుచున్నవి. న్యాయవాదినులు కొందరున్నారు. పారిశ్రామిక విషయములలో శ్రద్ధవహించి పనిచేయువారును పెక్కురు కలరు.

రాజకీయముగా స్త్రీలు పురుషులతో పాటు సమానహక్కులు బడయుటకు చీనాయందు జరుగుచున్న ప్రయత్నములు, ప్రశంసనీయములు. చీనా విప్లవము రాజకీయసమానత్వమునకై స్త్రీలు చేయుచున్న కృషికి దోహద మొసంగెను. ౧౯౨౨ సంవత్సరమునందు స్త్రీలహక్కులకై ప్రయత్నించుసంఘము (Women's-rights association) స్త్రీలఎన్నికల అధికారము సాధించుటకై మరియొకసంఘము (Women suffrage movement) స్థాపింపబడెను. చీనాస్త్రీల యాశయములేవో యీ సంఘములు ప్రచురించు కరపత్రములలో స్పష్టముగా తెలియుచున్నవి. వాని నీక్రింద చేర్చుచున్నాము.

౧. భిన్నభిన్నములుగా నున్న స్త్రీస్వాతంత్ర్యోద్యమముల నేకముచేయుట.

౨. పురుషులకును స్త్రీలకును సమానముగ విద్య నొసంగనట్లు ప్రయత్నములు చేయుట.

౩. వృత్తులను వ్యాపారములను అవలంబించుటకు స్త్రీలకును పురుషులకును సమాన సౌకర్యముల నొసంగునట్లు ఆందోళన సలుపుట.

౪. న్యాయశాస్త్రమునందు స్త్రీ పురుష తారతమ్యములను పాటింపకుండ చేయుటకు తీవ్రముగ ఆందోళన చేయుట.

౫. స్త్రీలకును పురుషులకును కూలినాలియందు తారతమ్యము లేకుండచేయుట.

౬. గర్భిణుల యొక్కయు, ప్రసూతల యొక్కయు రక్షణము.

౭. బాలురను బాలికలను కర్మాగారములలో పనిచేయ కుండునట్లు చేయుట.

౮. స్త్రీ కార్మికసంఘములకును, కర్షకసంఘములకును సరియగు కట్టుదిట్టములను చేయుట.

౯. స్త్రీలు పురుషుల కణగి మణగి యుండవలెనను ఆచారమును నిర్మూలము గావించుట.

౧౦. బహుభార్యాత్వమును మాన్పుట.

౧౧. బాల్యవివాహములు మాన్పి చిన్నప్పుడే పిల్లలు అత్తవారియింటికి బోయి కాపురము చేయు నాచారమును మాన్పుట.

౧౨. స్త్రీలకును పురుషులకును ఒక్కనైతిక ప్రమాణమునే కోరుట.

ఈ కోర్కెలను మహిళాసంఘములు వ్యాసముల ద్వారా ప్రచారము చేయుచున్నవి. ఈ వ్యాసములలో కొన్ని భాగములను చదివినచో చీనాయందు స్త్రీల ప్రయత్నము లెట్లున్నవో స్పష్టము కాగలదు. ఒక్క వ్యాసము నందిట్లున్నది.

"మానవులందరును స్త్రీ పురుష భేదము లేక నీతి శాస్త్రమును శాసనమును అనుసరింపవలసి యున్నది. అట్టియెడ స్త్రీల కొక నైతిక ప్రమాణమును, పురుషుల కొక నైతిక ప్రమాణమును యెందులకు విధింపబడుచున్నవి? పురుషుల స్థైర్యశౌర్యాదిగుణముల నడంచుటకు స్త్రీ స్వాతంత్ర్యోద్యమము ప్రారంభింపబడలేదు. నైజమగు స్త్రీ స్వభావమును వికారము నొందించుటకుగాని, కుటుంబబాధ్యతలనుండి స్త్రీలను తొలగించుటకుగాని ఈయుద్యమ మేర్పడియుండలేదు. భగవంతునిచే స్త్రీలకు ప్రసాదింపబడిన శక్తిసామర్థ్యములను సరిగా ప్రకటించుటయే ఈ ఉద్యమముయొక్క ఉద్దేశము కావున నీకోజునుండి స్త్రీలకును పురుషులకును గనపరుపబడుచున్న భేదమును నిర్మూలముగావింప స్త్రీలు పూనుకొనవలెను."

ఇతర దేశముల యందలి స్త్రీస్వాతంత్ర్యోద్యమములను గ్రుడ్డిగా నవలంబింపరాదని యీ వ్యాసములో మరియొక భాగము చీనాస్త్రీలను హెచ్చరించుచున్నది.

ఇంకొక వ్యాసమునం దీక్రింది ప్రబోధము కలదు.

"పురుషులతోపాటు స్త్రీలును అభివృద్ధినొందనిచో శరీరములో సగభాగము వ్యాధిగ్రస్తమైనట్లుండును. సంఘము యొక్క శాంతి సౌఖ్యములకు గూడ ప్రతిబంధకము కలుగును."

ఈ వ్యాసములో చివరభాగమునందు స్త్రీ పురుష నైతిక తారతమ్యమును గూర్చి యీ విధముగా నున్నది.

"'శీలము' అను పదము స్త్రీలయెడల వర్తించునప్పు డొక యర్థమును, పురుషులయెడల వర్తించునప్పుడు మరియొక అర్థమును గలిగియుండు నా దేమి? స్త్రీ లనుసరింపదగిన సన్మార్గమును పురుషుడు తిరస్కరింపదగునా? పురుషునికి యోగ్యమైన ప్రవర్తనమును స్త్రీ నిరసింపదగునా? నిజమగు శీలము స్త్రీ పురుష భేదము లేక యందరచేతను అనుసరింపదగినదే. పయోముఖ విషకుంభమువలె బయటికి సరిగా కనబడుచు లోపల చెడ్డగానున్న దానిని స్త్రీలును పురుషులును నిరాకరింపదగుదురు.

ప్రస్తుత సమయమున స్త్రీలకును పురుషులకును ఒక్క నైతికప్రమాణ మేర్పరుచుట మిక్కిలి యవసరము. భూతదయ, సన్మార్గగమనము, దాక్షిణ్యము, విశ్వాసము, మర్యాద, పవిత్రత మొదలగునవి పురుషులతోపాటు స్త్రీలకును ఆవశ్యకములే. ఈ సుగుణములకు వ్యతిరేకముగా సంచరించువారు స్త్రీలైనను పురుషులైనను సంఘము ఖండించవలసియున్నది."

ఈ వ్యాసమునందే మరియొకచోట చీనాలో వ్యభిచారము లంజరికము ప్రబలుటవలన జాతికి కలుగుచున్న అనర్థములను వివరించుచు ప్రభుత్వము వారు తన్నివారణోపాయము నాలోచించి సంఘమును కల్మషరహితముగా నొనరించవలెనని ప్రార్థన కలదు.

స్త్రీల యభివృద్ధికై ప్రభుత్వమువారు తమ ధర్మమును నిర్వర్తించవలెనని మూడవవ్యాసము కోరుచున్నది. కాని వ్యాసములో స్త్రీలు స్వయం కృషిచేసి యభివృద్ధి నొందవలెనని యీక్రింది విధమున ప్రబోధము కలదు.

"కేవలము ప్రభుత్వమువారిపై మాత్రమే స్త్రీజనాభివృద్ధి యాధారపడి యుండదు. ఆచారము, సహవాసము మీదగూడ చాలవరకది యాధారపడి యుండును. అభివృద్ధి నిరోధకములును, దుర్మార్గములును నగు

పూర్వాచారము లన్నియు స్త్రీస్వాతంత్ర్యమును నిరోధించును. కాని సోమరితనము, మూఢత్వము, క్రొత్త జీవిత విధానమును కోరుటకు ధైర్యము చాలకుండుట మొదలగు అలవాటులు పూర్వాచారములు కావు గదా! ఈ అలవాటులే చాలమట్టుకు మన యభివృద్ధిని నిరోధించుచున్నవి."

స్త్రీల నిరంతర ప్రచారమువలన జాతీయ ప్రభుత్వమువారు పురుషులతోపాటు స్త్రీలయొక్క హక్కులను గమనించిరి. దాదాపు ౨౦ కోట్ల స్త్రీలు ప్రబోధము గాంచినచో వారి కోర్కెలను నిరాకరింపగల వారెవ్వరైన నుందురా? ఇప్పుడు పురుషులతోపాటు స్త్రీలకును సామాన్యవిద్య, శారీరకవిద్య, వృత్తివిద్య యొసంగబడుచున్నవి. చీనా క్రిటిక్ అను పత్రికలో 'స్త్రీలతోపాటు పురుషులకుగూడ న్యాయశాస్త్రమునందు, ఆర్థికవిషయములయందు, విద్యయందు, సాంఘికవిషయములయందు సమానత్వ మొసగబడిన'దను ప్రకటన ప్రచురింపబడినవి. స్త్రీల హక్కులను ప్రభుత్వమువా రంగీకరించినను ఆచరణయందుమాత్రము సమానత్వమింకను సమకూర లేదు. అనేకవేలసంవత్సరములనుండి పూర్వాచారములచే బంధింపబడిన దేశములో నొక్కసారిగా మార్పువచ్చుట కష్టము గదా! పోయినసంవత్సరము ఒక స్త్రీ తన అన్నదమ్ములతోపాటు భాగమునకై కోరగా షాంగేరాష్ట్రమునందలి కోర్టువారు స్త్రీ కోర్కె నంగీకరించుచు తీర్పుచెప్పిరి.

చీనా శాసననిర్మాణసభయందు స్త్రీలుగూడ కొందరు కలరు. వీరిలో చీనా ప్రజాస్వామ్యప్రభుత్వాధ్యక్షుడు చాంకేషేకుగారి సతి, సోంగ్ చెంగ్ కన్య ముఖ్యులు. చీనా స్త్రీస్వాతంత్ర్య సమరమునందు కేవలము స్త్రీలే గాక పురుషులుగూడ సంపూర్ణామోదము జూపి, కృషిచేయుచుండుట సంతోషప్రదము. పురుషుల సాయము లేనిది స్త్రీ లింత శీఘ్రముగా నభివృద్ధి గాంచి యుండరు. ఈ విషయమును భారతీయులు గమనించి, స్త్రీ జనాభివృద్ధి యెడల శ్రద్ధవహించి పని చేయుట సంభావ్యము.

---




రంగం: పల్లెటూరు

బల్లరు: తమరు మాదొరగారితో డిన్నరు—

ఉద్యోగి: ఆఁ ఆఁ. ఇదిగో పీకు రూపాయి యినాం రొవరితోను చెప్పకు.

---








# భారతీయచిత్రరచన-కొన్నివిశేషములు

తలిసెట్టి రామారావు గారు, బి. ఏ., బి. యల్.

3

సాంసారిక సుఖములు వాంఛనీయములు కావనియు, ఆధ్యాత్మిక సుఖములు వాంఛనీయములనియు తలచు భారతీయ చిత్రకారుడు తనభావములను చిత్రరచన యందు ప్రవేశపెట్టి యితర దేశము లెరుగని క్రొత్త రుచులను ప్రపంచమునకు నేర్పెను. యోగాభ్యాసమునందును, భక్తియందును ఆధ్యాత్మిక రూపము ముఖ్యముకాన చిత్రములందును ఇట్టి రూపములకే ప్రధానస్థానము నిచ్చెను.

పాశ్చాత్య చిత్రకారుడు దేహచలనము వలన జీవితశక్తిని ప్రదర్శించును. హైందవచిత్రకారుడు అంగములచలనమును జూపక ఆధ్యాత్మిక శాంతిని ప్రదర్శించును. ఇందువలననే బుద్ధదేవుని విగ్రహమున మనకెట్టి చలనమునుకాన రాదు. ఐనను ఈ మహాపురుషుడు నిజముగు శక్తితో నిండియున్నటుల మనకు స్ఫురించును.

బుద్ధభగవానుడు తపస్సు వలన స్థూల దేహమున కృశించియున్నను ఆధ్యాత్మిక శక్తితో నిండియుండుటచే నితడు కృశించినటుల ఒకటిరెండుచోటుల దప్ప మరెచ్చటను ప్రదర్శింపబడలేదు. సిద్ధులను పుష్టి కల అంగములతో వ్రాయవలెనను నియమము ఏర్పడెను. విష్ణువు పరివారముతోనున్నటుల వ్రాయవలసి వచ్చినయెడల ఆధ్యాత్మికదృష్టియందు విష్ణువు పరివారముకంటె గొప్ప కనుక విష్ణువుయొక్క విగ్రహమును పెద్దదిగను, తక్కిన విగ్రహముల నుచిన్నవిగను వ్రాసెను. ఒక శిల్పచిత్రమున మాయాదేవికంటె యామె పరుండియున్న శయ్య చిన్నదిగకలదు. మాయాదేవి చిత్రమునకు ముఖ్యము. శయ్య పరిస్థితులను జూపుటకు మాత్రము కాన దీనికెట్టి ప్రాముఖ్యము లేక పోయెను.

ఇట్టి దృక్పథము కలచిత్రకారుడు బాహ్యసౌందర్యమును విశేషముగ సరకుజేయడు. కాని సౌందర్యప్రదర్శనమును మానుకొనుట యాతని యుద్దేశము కాదు. అవకాశము కలుగునప్పుడెల్ల సుందరవిగ్రహములను వ్రాయునే కాని ఆధ్యాత్మికదృష్టిని జూపుటకు సౌందర్య

ప్రదర్శన మాటంకము కలుగజేసిన, దానిని విడనాడును కాని ఆధ్యాత్మిక దృష్టిని మాత్రము మానడు. సౌందర్యమునకు కారణమేమి? ఇది కలుగజేయు మనోవికార మెట్టిది? దీనివలన మన మెట్టి నీతిని నేర్చుకొనగలము? సౌందర్యము వికారములకు గల తారతమ్యమును మనుజు లేల పాటింపవలెను? బాహ్యసౌందర్యమునకు ఆధ్యాత్మిక సౌందర్యమునకు గల సంపర్క మెట్టిది? ఇట్టి సమస్యలు మనస్సునగల హిందువులలో నొకడగు చిత్రకారుడు ఎట్టిచిత్రమును వ్రాయునో పాఠకులే యూహింపనగును. కాని స్త్రీ శక్తి యొక్క ప్రాముఖ్యమును గ్రహించి, అబలలగు స్త్రీలకు గౌరవమిచ్చి వారి సౌందర్యమును అనేకవిధముల బ్రదర్శించి, భారతీయ చిత్రకళయందు చిత్రకారుడు వారి కత్యద్భుతమైన ఉన్నతస్థానము నిడెను. చిత్రకారునకు స్త్రీల సౌందర్యమే కాదు, ప్రపంచమునగల అన్నివస్తువుల సౌందర్యము తన యాధ్యాత్మికచింత కవసరము కనుక స్త్రీ సౌందర్యమునెడల నీతనికి ప్రత్యేకముగ అభిమానముకాని, అసహ్యము కాని లేదు. మానవప్రపంచము నలంకరింపజాలువారు స్త్రీలు కనుక వీరితో తన చిత్తరువుల నలంకరించుటకు వెనుదీయడు.

స్త్రీనిచిత్రము వ్రాయునప్పు డెల్లనీతడామెను నవయౌవనవతిగ బ్రదర్శించెను. పెండ్లికాని బాలికలుండుట కుటుంబమునకు కళంకముకాన పెండ్లియై కాపురముచేయు స్త్రీలనే యీతడు వ్రాసెనని హేవెలుగారు వ్రాసిరి. ఇది సరి కాదనితోచుచున్నది. బ్రాహ్మణాదులగు కొన్ని జాతులలోతప్ప తక్కిన జాతులందు రజస్వలానంతర వివాహములు కలవు. తక్కినవారి సంఖ్యకంటె రజస్వలానంతర వివాహములు కల జాతులసంఖ్యయే భారతభూమియందు హెచ్చు. ప్రాపంచిక సుఖమును ప్రసాదించుస్త్రీలు యౌవనవతులు. ఆధ్యాత్మిక చింతను బుట్టించువారు యౌవనవతులు. ప్రపంచమున కలంకారముగ నుండువారు యౌవనవతులు. చిత్రకారు డీకారణమువలన యౌవనవతులనే సదా తనచిత్రములందు వ్రాసెనుకాని హేవెలుగారు చెప్పిన దానివలన గాదు.

తనభావమును ప్రదర్శించుటకు ప్రకృతి దృశ్యపు నియమము లీతని కాటంకము కలుగజేసినచోటుల వాటిని లక్ష్యపెట్టక తనచిత్తరువులను వ్రాయుటకు వెనుదీయలేదు. చిత్రమున భావమన్నిటికంటె ముఖ్యము. ఇది లేని చిత్రము నిస్సారము. ఇందు కళాకోవిదున కడ్డునదేది? తన ప్రపంచము వేరు; సృష్టి వేరు. ప్రకృతి నాశ్రయించి సదా వ్రాసినయెడల చిత్రకారుని పని 'కేమెరా' (Camera) చేయగలదు. భావవైశాల్యమునందును, భావగభీరతయందును, సృష్టిజేయుటయందు సృష్టికర్తయొక్క యుద్దేశమును, ప్రాపంచిక శక్తులమహిమను ప్రదర్శించుటయందు చిత్రకారుని గొప్పదనము కలదు. ఏవోనియమము లీయుద్దేశమున కాటంకము కలుగజేయునప్పుడు వీటిని పాటింపక పోవుటయే కళాకోవిదునకు, కళలకు, ప్రపంచమునకు శ్రేయస్కరము.

ఒకచోటనుండి ఏదృశ్యమునైన చూచి న కొన్నివస్తువులు కనబడును. దగ్గరనున్న వస్తువులచాటున నున్నవస్తువులు కంటికి కాన రావు. వీటినికూడ ఒకేచిత్రమున బ్రదర్శించుట కవసరము కలిగినయెడల హైందవచిత్రకారుడు కొన్ని నియమములైనను పాటింపక యన్ని వస్తువులను వ్రాయును. ఐరోపాచిత్రకారుడు నియమములకు బద్ధుడై తన భావమును సంపూ ర్ణముగ బ్రదర్శింపకపోవును.

"రాసమండలి" అను చిత్ర (చూడు చి. ౧) మీా విషయమును వ్యక్తపరుపగలదు. శ్రీకృష్ణుడు, రాధ, చుట్టును నాట్యము చేయుచున్న స్త్రీలు కనబడుట యవసరము. చిత్రకారుడు దృష్టి నియమములను విడనాడి, యీా చిత్రమును రచించి, మన కెట్టి యా నందమును గూర్చెనో చూడుడు. ఈ వ్యక్తులన్నియు మనకు కానవచ్చినగాని యీా సుందరదృశ్యము ఈ యానందము లభింపదు. చుట్టును నిలువబడి చూచుచున్న స్త్రీలకు ప్రాముఖ్య మంతగ లేదు. వీరి విగ్రహములు మ నకు పూర్తిగ గనబడుట యవసరము. చుట్టును లెక్కలేనంతమంది నిలువబడి యున్నారన్న భావము కలిగిన చాలును. ఇందువలన చిత్ర కారు డిచ్చట నియమబద్ధుడైనాడు.

హల్లీసకమను నృత్యమునుగూర్చి బాఘ్ విహారములందు గల చిత్రమునందు నిట్టి స్వేచ్ఛ యే కానవచ్చుచున్నది. నియమముల ననుస రించి రచించినయెడల మధ్యను నాట్యముచేయు



హల్లీషకము

చున్న వ్యక్తి సంపూర్ణముగ గానరాదు. చుట్టును నాట్యముచేయుచున్న యీా సుందర వ్యక్తులలో కొందరు కానరాకపోయియుందురు. ఐరోపాచిత్రకళా విమర్శకుల కిట్టిస్వేచ్ఛ అన హ్యకరమగు గాక. మన రచనావిధానములు వారికి బోధపడక మన చిత్రములను తూల నాడుదురు గాక. ఇంతటి చక్కని చిత్రములు లభించుచుండ మనకీ నియమములేల? హైందవ చిత్రకారుల ధైర్యము, హైందవ చిత్రకళ యొక్క గొప్పతనము, వ్యక్తిత్వము ఎంతయు కొనియాడదగినవి.

చరిత్రను, కాలమునుకూడ కొన్నిసమయ ములందు హైందవ చిత్రకారుడు పాటింపడు. కాని యిట్టి యవసరము తరచుగా కలుగదు. కాన నీ విషయ మంత ప్రాముఖ్యమును వహిం చలేదు.

హిందువునకు అలంకారము నందు ప్రీతి హెచ్చు. లలిత కళలం దీవిషయము బాగుగ

కనబడును. మన ప్రబంధములందు కానబడు అలంకారములు భారతేతర భాషలందు కానరావు. భారత దేశపు కవుల భావనకు అంతము లేదు. అలంకార మెంత క్లిష్టముగనున్నను విడనాడక తన యుద్దేశమున కనుకూలమైనయెడల గ్రంథమున చేర్చును. సంగీతమునందును ఆలాపన, అలంకారము విరివిగ కలదు. చిత్రలేఖనమున నీ యలంకారమునెడల గల ప్రేమను వ్యక్తపరచుటకు మితిలేని యవకాశము కలదు. అజంతచిత్తరువులందేమి, రాజపుత్ర చిత్రములందేమి స్త్రీలను, జంతువులను, పక్షులను, ఫలపుష్పములను, లతలను విరివిగ నుపయోగించి చిత్రకారుఁడు యీ యలంకారమున క్రొత్త రుచులను జూపెను. చిత్తరువుచుట్టు నొక లత లేనిది యీతనిచిత్తరువు పూర్తికాదు. చిత్తరువును మనుష్యులతో నింపెను. చెట్లున్న వాటిమీద పుష్పము లుండవలెను. పెంపుడుజంతువులున్న వాటికి నగలుండవలెను. స్త్రీలున్న వారి శిరోజములకు పుష్పములు, ముత్యాల హారములు ఉండవలెను.

భారతీయ చిత్రరచనయందు రేఖ ప్రధానము. ఈతనికి భావప్రదర్శనమే ముఖ్యము. కనుక రక్తమాంసములను జూపు స్నాయువులఛాయను పాటింపలేదు. నీడయు (Shade) అనవసరము. రాజపుత్రచిత్రములన్నియు చిన్నవి కాన నిట్టివెలుతురు-నీడలకు (light & shade) అవకాశముకూడ లేకపోయెను.

కాని ఛాయయొక్క ప్రాముఖ్యము నీతడు గ్రహింపకపోలేదు. కావలసినచోటులందు చక్కగ, లావణ్యముగ ఛాయను సూచించి చిత్తరువు నెంతయో యాహ్లాదకరముగ జేసెను. నీడ యుండవలెనను నియమమునకు బద్ధుడై చిత్రమునకు కళంకమును కలుగజేయలేదు.

రూపపటములన్నియు ముఖమున సగము భాగము కనబడుటగలదు. ఛాయయొక్క సూచనకలదు కాని యెన్నడును ప్రాముఖ్యమును వహించలేదు. నీడలవలన ముఖసౌందర్యము చెడుననియు రూపము బాగుగ కనబడుటకు నీడ యనవసరమనియు హైందవచిత్రకారుడు తలచును.

ప్రపంచమున నేదేశమునను కానరాని విశేషము హైందవ చిత్రరచనయందు కలదు. లలితకళలన్నియు నొకే విధముగ భావము ప్రదర్శించును కాన సంగీతము వ్యక్తపరచు భావము, అది పుట్టించు మనోవికారము చిత్రములును పుట్టింపగలవు. ఈ సంపర్కమును గ్రహించి సంగీతము ననుసరించి చిత్రములను వ్రాయుట రాజపుత్రచిత్రకారుడు సాధించెను. ఈచిత్రములకే రాగిణీలని పేరు. ఇవి భారతీపాఠకులకు పరిచితములే. తోడిరాగ మొక మనోభావమును పుట్టించును. అట్టి భావమునే పుట్టింపజాలునట్టి చిత్తరువునకు 'రాగిణి తోడి' అందురు. రాగములు, వీటి కుపరాగములు మొదలగునవనేకములు కలవు. వీటిని గూర్చి కొన్నికథలుకలవు. ఈ కథలనే సాధారణముగ చిత్రములుగ భావము పోకుండ వ్రాసిరి. మనో

హారమగు రాగిణీచిత్రములు ఉత్తర హిందూ దేశమున ననేకములు కలవు.

వ్యక్తుల ప్రాముఖ్యము కొరకు, పరిస్థితులను జూపుటకు ఐరోపాచిత్రకారుడు చెట్లను సరస్సులను వెనుకభాగమున వ్రాయును. ఇట్టివి చిత్రమునకు అక్కరలేని యెడల వ్రాయుట నిస్సారమనియు వ్యక్తులులేని ప్రకృతిచిత్రమును వ్రాయుటవలన ప్రయోజనములేదనియు భారతీయ చిత్రకారునియభిప్రాయమగుటచే నీతడు ప్రకృతిచిత్రములను వ్రాయుటలేదు కాని ప్రకృతిని మాత్రము విడనాడలేదు. సూచనగా చెట్లను, ఇండ్లను, పొలములను, కొలనులను, నదులను వ్రాసెను. కొన్ని చిత్రము (చూడుడు చి. ౨) లందుమాత్రము చెట్లు మొదలగునవి మనోహరముగ నున్నవి. ప్రకృతిని వ్రాయుటయందు కాంగ్రచిత్రకారులు ప్రవీణులు.

రాజపుత్రచిత్రకారుడు ఫలములనుపుష్పములను చక్కగవ్రాయుచుండెను. కాని యీ రచనయందు చైనా జపాను దేశముల రచననను కరించుటచే హైందవ వ్యక్తిత్వము విశేషము కానరాదు.

జంతువులయెడల హిందువునకు ప్రేమ హెచ్చు. ఈతడు వ్రాసిన జంతువుల చిత్రములందు వాటియందు గలగౌరవము, భూతదయ బాగుగ వ్యక్తమగుచున్నవి.

భారతీయ చిత్రకారుడు ప్రకృతి నియమములను కొన్ని సమయములందు పాటింపకపోయినను, వాటిని మాత్రము సదా దృక్పథమున నుంచుకొనును. బాహ్యప్రపంచము మిథ్యయని యీతడెంత చెప్పినను మనుజులను గాని, జంతువులనుగాని వ్రాయునప్పుడు రూపును చెడుపలేదు. ఒకొక్కప్పుడు వాటి అంగసౌందర్యము ఆశ్చర్యమును కలుగజేయును. ఈతనికి భావమెటుల వాంఛనీయమో, రూపము నిట్టిదియే.

అలంకారములతో చిత్రము నెంతనింపినను ప్రతిభాగమును చక్కగసమర్చి, చిత్రముయొక్క యైక్యమును చేకూర్చి ధన్యుడయ్యెను. ఏచిత్తరువునకైనను ఐక్యము ముఖ్యమని యీతడు బాగుగ గ్రహించెను. కొన్ని నియమములను సరకు జేయకపోయినను ఈ యైక్యమును చేకూర్చిన యీతని భావనాశక్తి కొనియాడదగినది.

హిందువునకు భక్తి రెండవ ప్రాణము. ఇది లేనిది యీతని జన్మమున నొక వెలితి, నిస్సారము కలుగును. ఇందువలననే యీతని చిత్రము లన్నిటియందును భావమునందు, తాను వ్రాయు వ్యక్తులందును, జంతుజాలములందును భక్తి కానవగును.

ఇట్టి మహోద్దేశములతో నిండియున్న చిత్రరచనను విడనాడుట ఆత్మ వినాశకరము. భారతీయచిత్రకళ భారత దేశమునకు గౌరవము తేగలదనియు, భారతజాతీయతను నిలువబెట్టుటకు సహాయపడగలదనియు విదేశీయకళావిమర్శకులుకూడ గ్రహించిరి. మనచిత్రరచన ఐరోపీయుల కెటుల తగదో, వారిరచనయు మనకు తగదు. భారతీయచిత్రరచన యిప్పటికిని సజీవమై యుండుటయేకాక మున్ముందు వింత విధమున ప్రబలము కాగలశక్తితో నిండియున్నది. దీనిని జాతీయ సంస్థగ గ్రహించి కాపాడుట మంచిదని భారతీయులు గ్రహింతురు గాక!

---



౧. రాసమండలము

శ్రీ నానాలాల్ చమన్‌లాల్ మెహతాగారి 'ఇండియన్ పెయింటింగ్' అను గ్రంథమునందలి ౧౧వ చిత్రమునుండి.



౧. ప్రేమశయ్య

శ్రీ నానాలాల్ చమన్‌లాల్ మెహతాగారి 'ఇండియన్ పెయింటింగ్' అను గ్రంథమునందలి ౧౩వ చిత్రమునుండి.

పవడపు గెంపులే పడుచు ప్రాయపు తీవుల నందగింపఁ గ్రొం
జివురుబెడంగు కెంబెదవిఁ జిర్నవ్వుబంతులు చిందులాడ నగ్
గవుగిటఁ జేర్పరా! రసికనాయకియందు వచించు మోహినీ!
యెవతెవో నీవు? యిట్టు లుడికించెద వీ మునిమాపునంజలన్.

విప్పినకావిమోవి మురిపింపఁగ నీ కరుణాస్రవంతిలోఁ
దెప్పలుఁ దేల్చి నా ప్రణయదీప్తి జ్వలింప ననుగ్రహింపవే?
ముప్పిరిగొన్న మోహమున ముంచుచు నీ విరహానలంబునన్
ద్రిప్పలుపెట్టి నన్నుఁ గరుణింపవొ యెవ్వతె వీవు మోహినీ!

అంచు నా వగలాడిఁ బ్రశ్నించినంతఁ - గలువపూవులు తోరణాల్ గట్టుచుండఁ
గ్రేఁగనులఁ జూచి తలను బంకించి యామె - చీరకుచ్చిళ్లు కాళ్లపై జీరువాడ.

కలకలమంచు నవ్వులొలుకన్ గలహంసమువోలె గిల్కుటం
దెలు ఘలుఘల్లుమ్రోయ నరుదెంచి చెయిం జెయిఁ జేర్చి యేమిరా!
వలపులరాయడా! మరపువచ్చెనె? నేటికియంచు వాలుచూ
పుల పువుటమ్ములన్ బరపి మూర్ఛను ముంచుచు నామె యిట్లనున్.

నవకంపుఁబాడపు టెండల విచ్చు కెందమ్మి తీయ తేనియ లాస్వాదించినావు
చిగురాకువిందులో వగ రెక్కియున్న కోయిలకన్నె పాట పాడించినావు
బిడియంపుపొంగులో నడగినజవరాలి కౌమారప్రాయము కొల్లగొట్టినావు
పడుచుకన్నవిరాళి ప్రల్లదంబులునింపి విరహగీతము లాలపించినావు
మధుకుమారిక ప్రేమ సామ్రాజ్యమందుఁ - బెంచి పెద్దఁ జేసి పోషించినావు
నవకవీ! యేల దాఁగియున్నావొ గాని - కానరాఁడవ్యొ నీచెలికాఁడుకూడ.

విచ్చిన పూలనావ నడిపింపగ నెచ్చెలి కర్ణధారియై
వచ్చుటఁ జూచి సిగ్గుపడి స్వైరవిహారమునల్ప నింకపో

వచ్చునటంచు హంసముఁ బంపిన నీ కవితామతల్లి నేఁ
డెచ్చట నున్నదోయి కనుపించుటలే దెటుపోయి చూచినన్.

లేతగులాబిచెక్కిట చలింపనిసిగ్గుల రక్తిమంబులో
పూతలుపూయ నిగ్గు వడఁబోసిన ముద్దులపాప నిద్దపున్
గైతలుఁజల్లి కీర్తిలతికన్ దిశలందు వెలుంగు యౌవన
స్నాతకులైన సత్కవుల భావము రంజిలఁ జేయ వేమిరా!

అంచు ననంతవిభ్రమ సమాకులచిత్తుఁడనైన నన్ను వీ
క్షించి కటాక్షముల్ పఱపి చెంకిలనేటికి యౌవనంబు పు
ష్పించిన నేడహో ప్రణయ భిక్షువనైరసరాజ్యమందుఁ గ్రీ
డించుము సద్యశస్సులు గడింపుమటంచు వచించె నామెయున్.

..................................................................

నిద్రించెన్ గవితావధూటిక విపంచీరావముల్ లేవు ని
ర్నిద్రాంధ్రావని మేలుకొల్పినది లేనే లేదు కానీ గృహా
చ్ఛిద్రంబుల్ విషమింప యౌవనకళల్ జీర్ణించెఁ దప్తాశ్రువుల్
ముద్రాశిల్పములట్లు నా హృదయ ముద్బోధించు నెల్లప్పుడున్.

కంటనీరొల్కుచుండు నేకాంతసీమ - కుళ్లికృశియించు మందభాగ్యునకు నాకు
భగ్నమనిమండు శిఖిశిఖాపటలిమధ్య - దగ్ధమైపోవు యౌవనోత్సాహ మబల.

ఈమనోవ్యథలందుఁ గృశించి కాల - మెటులో గడుపుచుండెడి భాగ్యహీనుఁ డబల
కలముచేపట్టి కవితల కమ్మదనము - విప్పి రసికశేఖరుల మెప్పింపఁగలఁడె?

కాని దేశంబులందుఁ జీకాకుపడుచు - చివికి జీర్ణించిపోవు నెచ్చెలినిఁ గాంచి
ఒడలు కంపింప హృదయ ముబ్బూఁత లూగ - నెన్నఁటికి శాంతిలేక దుఃఖించుచుండు.

జారు కన్నీటిముత్యాలసరులతోడ - సిగ్గుమాలిన నా సొదల్ చెప్పికొనఁగ
ఔననక కాదనక మాయమయ్యె నవుర! - యెంతటక్కులమారిరా! యీ వధూటి.

---

# ఒక పురుషరత్నము

(పిట్టువజ్రము)

ఆంధ్రవిశారద తాపీ ధర్మారావుగారు

"న రత్న మన్విష్యతి మృగ్యతే హి తత్"
(వెదకఁబడుఁగాక రత్నంబు వెదకఁజనునె)

అని కుమారసంభవములోని యర్థాంతరన్యాసము గనినప్పు డాహా! యని యానందించుట యంతయు, నాదికవు లాడిన మాటలయందు మనకుఁగల యాదరంబు నెఱుక సేయును. కాళిదాస మహాకవియెడఁ గల గౌరవమున మన విమర్శకులు గాదన కూరకున్నారు గాని, నేఁటి యొకకవియే యిటు వ్రాసినచో, నీపాటికి వాని కపక్షదోషము నాపాదించి, ప్రాపంచిక చరిత్రజ్ఞానరహితుఁడని కవిని దిసంకులఁగొట్టి, వాని గ్రంథపత్రములు చక్కెరపొట్లములు గట్టుటకు మాత్రము యోగ్యములగు నని పత్రికాముఖంబుల బయలు వీటలువాఱ ఘోషింపకుందురా! కాని, ప్రపంచమున సిరినిఁబోలు రత్నంబు లెన్నింటిని మనము జూచుచున్నను, సిరియు ననుభవయోగ్యులగు వారిని వెదకికొనుటయుం దప్రమత్తత నుండుటయు నొకింత పరిశీలనవలనఁ దృగ్గోచరంబు గాకమానదు. కావుననే కదా! సప్రయత్నులను నెందఱినో గికురించుకొని పోయిపోయి యైశ్వర్యములు కేవలాప్రయత్నులగు మానవుల నయాచితంబుగఁ జేరి పెంపొందించుటఁ జూచుచున్నారము. ఈ లక్షణము రత్నముల యందుంగూడ నున్నది. అభాగ్యుల కందియు నందక, సుధీలు తమ్ము దన్నికొని పోవుచున్నను గాళ్లఁ జెనఁగి బిమ్మక యీ జీవరత్నము లద్భుతచర్య నీలోకంబున విహరించుచున్నయవి. పాపము! కాళిదాసుఁడు నేఁటి పదునేనువందల వత్సరంబులు పశరీరుఁడయి జీవించి యుండిన యెడలఁ దన కుమారసంభవమున కొకసవరణపట్టికను వ్రాసి ముద్రింపించి యుచితంబుగ నీభారతలోకమునఁ బంచి పెట్టియుండును. ఏలయనిన, నంతకాలమునకు, మహాద్భుతంబులగు రెండు వజ్రముల చిత్రచరిత్రము నీహైందవభూమిఁ గరతలామలకంబుగఁ గాంచియుండును. ఈ హీరరత్నంబులు పావనకృష్ణవేణీ నదీప్రాంతంబున నాంధ్రావనియందు లభించి, చిత్రవిచిత్రగతుల నానాదేశంబులఁ బర్యటనంబుఁ గావించి, సర్వసర్వంసహా సార్వభౌముల హస్తమస్తకంబుల కెక్కి, లోకంబున నక్కజంబగు మన్నన నందుచున్నవి. ఈరత్నరాజములఁ జూచినవారలే తమ జన్మ సార్థకమయ్యెనని సంతోషించుచుండ, నింక నవ్వానిని గాఢాదిగఁ గల్గియున్న మహాభాగుల యదృష్టం బేమనదగును?

వానిలో నొక్కటియగు కొల్లూరువజ్రము హిందువులనుండి గోలకొండ తురుష్కులకడకును, వారినుండి మొగలు చక్రవర్తులయొడకును, వటనుండి పారసీకులచెంతకును, బిదప నాంగ్లేయులనొద్దకుం బోయి, 'కాంతిశైల' మని యర్థమునిచ్చు కోహినూరు అను నామంబున జగద్విఖ్యాతిం గాంచినయట్లు బలువు రెఱుంగుదురు. ఈరత్నమునకుఁ దొలుతటి నామము కొల్లూరువజ్రమనియే యుండెను. ఢిల్లీని ముట్టడించునప్పుడు నాదరుషా యీ రత్నమును జూచి యాశ్చర్యమునంది, పేరు నడిగి "కొయిలూర్! (కొల్లూరనుటకు) కాదు కోహినూర్ (కోహ్-ఇ-నూర్ _ నూర్ = కాంతి, కోహ్ = కొండ, ఇ = షష్ఠీప్రత్యయము) అనవచ్చును అని నామకరణము నొనరించెను. ఇదియే ౧౮౫౧ లో లండను మహానగరమున జరిగిన సర్వదేశవస్తు మహాప్రదర్శనమున స్వర్ణమయమగు నొక్కపంజరములోనుండి నానాదేశాగత ప్రేక్షకుల కనుల మిఱుమిట్లు గొల్పుచుండెను. అటుల పంజరమున నేఁబది వత్సరములుండిన యనంతరము ౧౯౦౧ సప్తమేడ్వర్డు సార్వభౌముఁడు దీనిని దన ప్రే

యనియగు నలగ్జాంద్రా మహారాణిగారి పట్టాభిషేక కిరీటాగ్ర రత్నరాజముగ నొనర్చెను. ఆ కిరీటమున వజ్రములు బంగరువఁగాక వెండిని కట్టఁబడి, సంఖ్యకు ౩,౯౭౧ గలవు. వానికిని, నా కిరీటధారిణికిని మాత్రమే కాక యాంగ్లేయ సామ్రాజ్యమున కంతటికిని వన్నెఁ దెచ్చుచు మన కొల్లూరు వజ్ర మగ్రస్థానము నలంకరించుచున్నది. ఇటుల మహాసామ్రాజ్యము నేలు చక్రవర్తి పట్టపుమహిషియొక్క యుత్తమాంగముపై నెక్కు రత్నరాజము చింకిగుడ్డలను, బంజరంబులను, దొంగలచేతులను నిలుచునా! ఈ కోహినూరు * తన కర్హమగు స్థానము నెమకికొనుచు నచ్చోటికిఁ బోయినదనిన నందు దోసమేముండును?

ఇట్టి యద్భుతచరిత్రము నే గల యింకొక్క యమూల్య రత్నమున కాంగ్ల దేశమునను, నావలనున లోకమం దంతటను, నేఁడు "పిట్టువజ్ర" మని పేరు గలదు. ఈ పిట్టుదొరయును 'వజ్రపుపిట్టు' Diamond Pitt అని చరిత్రలయందు ప్రఖ్యాతిఁబడసెను. "మణి నా వలయం వలయేన మణిః" ఈ పేరులను బట్టియే యీ మహావజ్ర విషయమును పిట్టుదొరచరిత్రము నొక్కటిగ నల్లికొనియుండు ననుట గ్రహింపనగును. వజ్రమునుగూర్చి యెఱుంగఁగోరు మనకు, పిట్టుదొరచరిత్ర మప్రస్తుతమయ్యును దడవవలసివచ్చును. అటుల నొనర్చినచో దాదాఁపు రెండువందల సంవత్సరములకుఁ బూర్వము మన దేశములో నాంగ్లేయప్రముఖు లెట్టులఁ బ్రవర్తించుచుండిరో తెలిసికొను నవకాశము గల్గునుగదా యని కొంత యుత్సాహముగూడ నుండకమానదు.

ఈతని నామధేయము థామస్ పిట్టు. ఈతని వంశమున నీవల జనించినవారు గొందఱత్యున్నత పదవులనందిరని చరిత్రలఁ జదువువారలకుఁ దెలిసియే యుండును. ౧౬౫౩ న సంవత్సరమున జనించిన యీతనికి ధనమునందాశ మెండుగ నుండుటం జేసి, యిరువదిసంవత్సరముల వయసునకే, యెట్టి దుండగములకు నెంత దౌర్జన్యమునకయిన నీతఁడు సాహసించుచు, చట్టములకు విరుద్ధముగ నీదేశమునకు వచ్చి స్వీయవ్యాపారమునకుఁ బూనుకొనెను. రెండుమూడుసారు లీతని నిండియావర్తకసంఘము వారు బంధించి బలవంతముగ నింగ్లాండునకు బంపివైచిరి. ఆ రోజులలో నీదేశమునందలి దొరతనమువారును నింగ్లాండునందలి యధికారులు నీతఁడు పరమదుర్మార్గుఁడనియుఁ § గడుతెంపరి యనియు విశ్వసించి చర్యనడుపుచుండెడివారు. కాని, యతివిచిత్రముగ ౧౬౯౭ వ సంవత్సరమున నీతఁడు మదరాసునకు గవర్నరుగ నుండుట కర్హుఁడని వర్తకసంఘము తీర్మానించికొనెను. అవాఁటికి నీతఁడు 'దుష్ప్రవర్తనఁగల మొఱకు' అని వర్తకసంఘమునందొక భాగహారిగనుండిన సర్ జోషియా చైల్డు దొర తన యసమ్మతినిఁ జూపెను. (Roughling immoral man) అయిననేమి థామస్ పిట్టుగారు జార్జికోట గవర్నరుగా ౭-౭-౧౬౯౮ మొదలు ౧౮-౯-౧౭౦౯ వఱకు పరిపాలించుటకు మన రాజధాని కేతెంచిరి. అప్పుడు వీరికి సంవత్సరమునకు రెండువందల పౌనులు వేతనమును, వర్షమునకు నూఱుపౌనుల విరాళమును, నిటకు వచ్చుటకు బ్రయాణవ్యయమునకు నూఱుపౌనులును మాత్రమిచ్చుచుండిరి. పండ్రెండుమాసములకు గవర్నరుగారికి మున్నూఱు పౌనులు ముట్టుచుండెను. దాదాఁపు మాసమునకు మూఁడువందల రూపాయిలు మాత్రము. గవర్నరుగారికి ధనాశ, ముక్కోపము, పరులను (కన్నబిడ్డలను సైతము) నమ్మకుండుట మొదలగు గుణము లొకదానికన్న నొక్కటి విశేషముగ నుండెను. తనతోఁ గుమారుని, రాబర్టుని, వెంటఁబెట్టుకొని వచ్చి, యాతనిచే నీదేశమునందే కాక చీనాదేశమునందు సైతము మదరాసు జనులతోఁ గూడి వ్యాపారముఁ జేయించుచు లాభము నందుచుండెను.

---

* ఈ కోహినూరునుగుఱించి విశేషము నెఱుంగఁగోరువారు బెజవాడ-పుష్కరిణీపత్రికను నేవ్రాసిన విపుల వ్యాసము గాంచనగును. ఆంగ్లమున "బాల్" "బెర్నియర్" "స్యూయల్" లోనగువారు వ్రాసినవానినిఁ జూడనగును.

§ Leadenhall Street Magnates wrote "he being a desperate fellow and one that, we fear, will not stick at doing any mischief that lies in his power."

ఇట్లులుండఁగా నీ గవర్నరు వచ్చిన రెండుసంవత్సరములలోఁగానే యీతనికొక "పెద్దబేరము" చిక్కినది. అదియే యీ పిట్టువజ్రము. పాప మీ గవర్నరుగారు తాము వ్రాసిన జాబులన్నిటి యందును నీవజ్రమును "పెద్దబేరము Grand Concern" అనియే వ్యవహరించిరి గదా! అంతియేకాదు; వారి జీవితమునకంతకు నిది పెద్దబేరమే. ఈవజ్రవిషయమును విడఁదీసిన నీ పిట్టుదొర యిండియాలోఁగాని యింగ్లాండునగాని చేసిన ఘనకార్య మెక్కుటియు లేదు. కావుననే వజ్రమును దన పేరును శాశ్వతముగ నైక్యమునందెను.

ఈ రత్నరాజ మీతనికెట్లు చిక్కెనో యీ విషయముమాత్రము తనమిత్రుల సాహాయ్యముతో నీతఁ డతిచమత్కారముగ వెలిఁబడనీయ లేదు. కాని యాంగ్లేయ కవిపుంగవుఁడగు పోపుదొర తన నీతిపద్యములలో

> Asleep and naked as An Indian lay
> An honest factor stole a gem away;
> He pledged it to a knight, the knight had wit.
> *So robbed the robber, and was rich as Pitt.

అని మన పిట్టుదొరను మనసున నుంచుకొని వ్రాసిన దాని వలన నీసంగతి కొంచెము గూఢమైన దని తెలిసికొన నగునుగదా.

ఇంతియకాక, ఎడ్విన్ స్ట్రీటర్ తన "ప్రపంచమునందలి పెద్దవజ్రములు" అనుపుస్తకమున నీ పిట్టువజ్రమును గుఱించి వ్రాయుచు నుపోద్ఘాతముగ "ఈ వజ్రచరిత్రప్రారంభమును గూర్చి చెప్పుకొను నీక్రిందివిషయమునందుఁ దగిన సత్యము లేదని సందేహించుట కేవల మకారణము" అని వ్రాసెను. ఇంకనా "చెప్పుకొను విషయ"మో యిట్లున్నది. "ఇది ౧౭౦౧ వ సంవత్సరమున కృష్ణా నదీతీరమునను్న పర్టియల్ గనులలో నొక బానిసవానికిఁ జిక్కినది. దాని నా బానిసవాఁడు, తనకాలున నొకగాయము నేసి యాగాయములో దానిని దాఁచికొనెనఁట. (కొందఱు గాయములో కాదు, గాయమునకుగాఁ గాలునఁజుట్టిన గుడ్డలలో నని యందురు. కాని వజ్రముప్రమాణము ౪౧౦ కారెట్లు (=౫౬౦ రతులు) ఉండుటవలన గుడ్డలలో నుంచెననుటయే సరియగును) దానితో నా బానిసవాఁడు సముద్రతీరమునకుఁ దప్పించుకొనిపోయి, యొక యింగ్లీషునావికున కద్దాని నిచ్చెదనని చెప్పి తన్ను బానిస లుండని యేదేని యొక స్వేచ్ఛాదేశంబున జేర్చుమని కోరెను....ఆ యాంగ్లేయ నావికుఁడు వల్లెయని తనపడవ నెక్కించికొని మార్గమధ్యమున మెల్లఁగ నా రత్నమును జేఁ జిక్కించుకొని, యా బానిసను సముద్రమునఁ దిరుగఁద్రోసెను. పిదప నా నావికుఁడు, కొందరు చెప్పునట్లు, థామసుపిట్టునకు వేయిపౌన్లకమ్మెను..." కాని, యీ 'చెప్పుకొను విషయమును' స్ట్రీటరుగారు కొంచెము మార్చి "నావికుఁడు జమ్‌చందను నొక పెద్దరత్నవ్యాపారికి ౧౦౦౦ పౌన్ల కమ్మఁగా నాతఁడు పిట్టునకు ౨౦,౦౦౦ పౌన్ల కమ్మెను" అని ప్రకటించిరి. ఇయ్యది యభిమానప్రేరితము గాదనుట కష్టముగదా.

ఈ వజ్రమును సంపాదించిన విధానము సందేహాస్పదమని చెప్పుటకు మఱియొకటి కలదు. జార్జికోటలో నే పిట్టుగవర్నరుగారి చేతిక్రిందనే లెఫ్టినెంటు ఫ్రాన్సిసు సీటన్ అను నొక తెంపరి యుండెను. గవర్నరుగారివలెనే యీతఁడు నింతకుమును పవిత్రపదార్థములకుగా శిక్షింపఁబడిన వాఁడే. ఈతఁడు పిట్టుగారు వజ్రములను సంపాదించుట యంతయు నెఱిఁగి పరులకుఁ జెప్పుచుండెడి వాఁడని గవర్నరుగారి కీతనిపై ప్రియము లేక, సమయము చిక్కినప్పుడెల్ల నీతనిఁ జిక్కులబెట్టుచు, నీతనిగూర్చి వ్రాయరాని చెడ్డమాటలను వ్రాయుచుండుట వారి కలవాటు పడెను. ఒక నాఁడు పిట్టునకును సీటనునకును జరిగిన సంభాషణను గూర్చి పిట్టువ్రాసిన విషయము నిందు పొందుపరచుచున్నాఁడను.

* ఈ కడపటి చరణమునకు పాఠాంతర మొక్కటిగలదు: "So kept the diamond, and the rogue was bit". పద్యమున కర్థము: 'ఒక కార్మికుఁడొకరత్నమును దొంగిలించి యొకరౌతుదగ్గర పెట్టెను. బుద్ధిగలరౌతు వానిని మోసముచేసి పిట్టువలె ధనికుడాయెను'

"ఇది ఆగష్టు రెండవ తేదీ సాయంకాలము (౧౭౦౭) అయిదుగంటల వేళప్పుడు సీటన్‌తో నేను ఆలోచనా మందిరమున మాటలాడితిని. అపుడు నేను 'పాపయ్యను ప్రధానద్విభాషిగాఁ జేయుటకుఁ నేను ౫౦౦ వరాలను పుచ్చుకొంటినని నీవు చెప్పితివా?' యని ప్రశ్నించితిని. ఆతఁడు (సీటను) దానికి గుదని యొప్పికొని, నేను పిట్టు చేయుచున్న ప్రతిసంగతియును, మాటలాడిన ప్రతిమాటయు నా సేవకుల మూలమున బయటఁబడుచున్న దనియు, నిచట నెవ్వరును నన్ను మిత్రభావముతోఁ జూడరనియు (నిర్భయముగ) జెప్పెను. అంత నేను 'నేను కొనిన వానిని గుఱించియు నమ్మినవానిఁ గూర్చియు నిష్టమువచ్చిన చోటులకెల్ల మాటలాడ నెట్లు సాహసించితివి. నా వ్యాపారములను నీవెట్లు తెలిసికొనఁగలిగితివి?' అని ప్రశ్నించితిని. దానికాతఁడు తన కన్ని సంగతులను దెలియబరచు మంచి యేర్పాటు లున్నవనియు, నింక నాకు సందేహముండిన దానినిఁ దీర్చుటకు తానే నన్ను కొన్ని ప్రశ్నముల నడుగనిచ్చువలయుననియు నన్నుఁ గోరెను. నేనడుగుమంటిని; నంతవాతఁడు 'నీవు కొనిన యొక పెద్ద వజ్రమును గూర్చి రాబర్టు (కుమారుఁడు) నీకు వ్రాయలేదా?' యని నన్నడిగెను. నేనది యబద్ధమని * యంటిని. తరువాత నాతఁడు "ఒక మనుష్యుఁడు నీకడ కొక వజ్రము అయిదు లక్షల డాలర్ల కమ్మవచ్చుటకు సంతోషమును దెలుపరాలేదా?" యని యడిగె. 'అసత్యము.' పిమ్మట నాతఁడు 'దక్కనునుండి యిద్దఱు మనుష్యులా వజ్రము నిచ్చివేయవలయుననియడుగ నీదగ్గఱకు రాలేదా? వానిలో నొకనికి రాగానే ౧౧ రూపాయిలును, రెండవవానికి పోవునపుడు ౧౫౦ రూపాయిలును నీవీయలేదా?' యని నన్నడిగెను.

"అసత్యము, ఒక్కఁడే వచ్చెను. వాఁడు వచ్చి దొంగవలెఁ గాన్పించినందున వానిని ఫలాకాగారములోఁ జెఱలోఁ బెట్టించితిని అని నేనంటిని."

ఇదియంతయు గవర్నరుగారు తవచేతితో వ్రాసిన విషయము. అటుపిమ్మట సైతము నింగ్లండు సభలో గవర్నరుగారి యెట్టయెదుట నివియు మఱికొన్నియుఁ జెప్పఁగ గవర్నరుగారికి కోపము వచ్చినట్టు గూడ నివర్నవము లున్నవి. దీనినిఁ బట్టియు సంపాదనయందు కొంత కల్మషమున్నయట్లు తేటపడుచున్నది గదా.

పిట్టు గవర్నరు పదవిని విడిచి పెట్టిన తక్షణము అడిసన్ అను తరువాతి గవర్నరుగారికి, విలియం ఫ్రేజరు, థామస్ ఫ్రెడెరిక్కు (ఇద్దఱును పిట్టుగారి సహోద్యోగులు) సూరప్ప యను వర్తకుఁడును గలిసి "పిట్టు అన్యాయముగ నా మహారత్నము నార్జించె" నని యొక 'మహాజరుఁ' బంపుకొనిరి. ఈ మహాజరు గూడ విచారణ సెయఁగక యెటనో యడుగంటెను. తరువాతి గవర్నరులు ఇదియంతయు విస్మృతి సాగరమున ద్రోయుదము.... "buried in oblivion" అని తీర్మానమును సభలో చేసికొనిరి. ఇంత వృత్తాంతముండిన నధికారులొక్కరును నీ పిట్టుగారిని సమాధానముఁ గోరలేదు.

స్వదేశమునకు బోవునపు డింగ్లాండునకుఁ దిన్నఁగఁ బోవక నార్వేలోని బెర్గన్‌పట్టణమునకు ౧౭౧౧ మే ౩౦ వ దినమునఁ బోయి పిట్టు చేరెను. అచ్చట తన యంతరాత్మకు సమాధాన మిచ్చుచున్నాఁడో యనునట్లు పెద్దగాథను ౧౭౧౦ జూలై ౨౯ వ దినమున వ్రాసియుంచెను. తన మరణానంతరము పదునేడు సంవత్సరముల వెనుక ౧౭౪౩ లో దానివృత్తాంత మాంగ్లేయ ప్రపంచమునకు దెలిసెను. అప్పు డందలి యంశములను గాదను వా రా యింగ్లాండున నెవ్వరును లేకుంటచే నదియే వాస్తవమని మిత్రు లానందించిరి. ఆగాథయందు పిట్టుగారు జమునందు వెంకటచెట్టి యను నిద్దఱుదగ్గఱ నా వజ్రమును ౪౮౦౦౦ వరాలకుఁ గొనినయట్టుల వ్రాసియున్నారు. ఇంక సందేహమున కెడముండునా!

కాని మహాప్రకృతితత్వ మత్యద్భుతము గదా! పిట్టుగారు తన కుమారుని రాబర్టును మహారత్నముతో నింగ్లాండునకు బంపునపుడు, పరమరహస్యముగ నంప వేయి ప్రయత్నములనుచేసి 'అబ్బాయీ, అచ్చట స్త్రీ పనుగాని

---

* నిజముగ నాతఁ డిట్లు వ్రాయుట కలదు. ఇండియానుండి యా వజ్రము నతిరహస్యముగ నింగ్లాండునకుఁ గొనిపోయిన రాబర్టునకును గవర్నరుగారికి ననేకో త్తరప్రత్యుత్తరములు నడచెను.

ఆల్వరెజ్ గాని (ఈ పెద్దబేరమున తనకు సహాయము చేయుటకు దానెన్నుకొనిన యిరువురు మిత్రులు) దీనిని లనుగూర్చి ప్రశ్నించినయెడల ౧౩౦,౦౦౦ వరాలాయెనని నీవు చెప్పవచ్చును' అని సిద్ధముచేసి పంపెను. ఏ గణితశాస్త్రపద్ధతిని గూడ ౪౭౦౦౦౦,౧౩౧౦౦౦౧ కానేరదు. పిట్టుగారి గణిత మసాధారణమే యగును. తానే న్యాయముగ నీవజ్రరాజమును గొనియుండిన నిట్టి ముందెత్తు చూచికొను నవసరమేమున్నది? అంతన నింత యాత్మవ్యాఘాత మేటికిఁగలుగును? పక్రమార్గవమే యయినచో దివాన్ సాహతుల్లాఖాన్ "తనదగ్గరనుండి యన్యాయముగఁ దీసికొనిన వజ్రరాజము నిప్పింపఁవలయు" నని ౧౭౧౦ లో దొరతనమువారికి వ్రాసికొననేల? (పాపమా మనవిరయుఁ ఏదియో యంతయు చిందఱవందఱగ నున్నది. మాకేమియు బోధపడలేదు, అని లండను నుండి చెన్నపట్టణమునకును, చెన్నపురినుండి లండనునకును తిరిగి నడుమ నేచోటనో యంకరించిపోయెను.) అప్పుడును గూడ పిట్టుగా రీసమాధాన గాథను వెలిచేయలేదు. చిత్రము గదా!

ఎటులనయిననేమి వజ్రమును సంపాదించినది మొదలు దాని నమ్మినంతవఱకును పిట్టుగారు పడిన యాందోళనము నిక్కముగ నవకాశము గలిగినవారు చదువవలసిన విషయమే. ఎన్ని జాబులు, ఎన్ని యూహలు, ఎంత యాశ. ఈ ౪౧౦ రతుల మహాకాంతివంతమగు వజ్రరాజమునుఁ జెన్నపురిని తనచెంతనుండిన యంతకాలమును పిట్టుగారు తనకాలిజోడు మడిమలో గోయిచేసి దాని యందు దాఁచికొనియే తిరుగుచుండిరి. ఇప్పటికిని పిట్టు సంతతివారు నెల్లర్ దొరచే వ్రాయఁబడిన, పిట్టుదొరగారి చిత్రపటమునుఁ జూపి 'ఆకాలిజోడు మడిమలోనే వజ్రమును దాఁచిరని చూపించుచుందురఁట. తరువాత నీవజ్రమును రాబర్టుచేత నింగ్లండునకుఁ బంపెను. అహో యెంతజాగ్రత్త! రాబర్టున కెన్నినిబంధనలు. ప్రయాణమున నంతయుఁ గదలఁగూడదు. త్రాఁగఁగూడదు. స్నేహితులు వచ్చినంతవఱకును నోడ విడిచి క్రిందికి దిగఁగూడదు. కారెట్టు ౧ కిని పౌ ౧౫౦౦ (=౧౫౦౦౦ రూపాయలకు) దక్కువకన్నఁడు నమ్మవని యెంత నమ్మిక! కొనుటకు జర్మనీచక్రవర్తియు, ఫ్రాన్సుసార్వభౌములు యని యెంత వితర్కము! ఇంగ్లండున నీవజ్రమును కోపుదొరకు సానపట్టుటకిచ్చిరి. ఆతఁడే ౪౧౦ కారెట్ల వజ్రము కోఁతయయిన వెనుక ౨౮౧ కారెట్లు మాత్రము నిలుచునని చెప్పినపుడు, కారెటు ౧-కి రు ౧౫౧౦౦ చొప్పున కెంతయగునో యని పిట్టుదొర యెంత గణించి, గుణించెనో యెవ్వరెఱుఁగుదురు. కోసివైచిన ముక్కలను గొన్నివేల పౌన్లకు కుమారుఁడే యమ్ముచుఁ సానఁ బట్టించుచుండెను. ఆ కోఁతనుబట్టి చూడ ౧౪౧ కారెట్లకన్న నెక్కుడు నిలువదని కోపుదొర చెప్పెనని రాబర్టు తెలియ వ్రాసినపుడు ౨౮౧ పోయి ౧౪౦ కూ యని పిట్టున కెంతకోపము! అపుడు రాబర్టునకును కోపునకును పిట్టు వ్రాసిన లేఖలయందెంత నిప్పులుఁ రాల్చుట! కారెటు ౧-కి రు. ౧౫౦౧౦ లకు దక్కువపోఁగూడదని యెన్నిసారులు నొక్కినొక్కి వ్రాయుట; అంతయు నొకమహాకవి కల్పించిన చిత్రకథవలెఁ గాన్పించునుగాని, యథార్థమగు నొకయంశము వలెఁ దోఁపదు.

ఎట్టులయిననేమి యించుమించుగ ౧౪౦ కారెట్ల తూనికఁగల యీ వజ్రరాజ మినుపపెట్టెలలో నుండి, ౧౭౧౭ వ సంవత్సరమువఱకు, ననఁగా, పిట్టుదొర గవర్నరుపదవిని వీడి తనపెద్దబేరమునఁ గార్యనిర్వాహకుఁడయిన రేడువత్సరములవఱకును చెల్లలేదు. జర్మనీస్పెయిను ఇంగ్లాండు మొదలగు కెన్నియోదేశముల నద్దాని నమ్మ యత్నించి పిట్టు దాని యాకారపరిమితులం దెలుప నిర్మించిన స్ఫటికములతో నతిజాగరూకతఁ దిరిగెను. తుట్టతుదకు ౧౭౧౭ లో ఫ్రాన్సుదేశమున ఆర్లియన్సుప్రభువు Duc d'Orleans (అప్పటిరీజెంటు) దాని నిరువదిలక్షల లివర్లకు (అనఁగా ౧౩౫౦౦౦ పౌన్లకు=రు.౧౩౫౦౦౦౧౦ పదునైదులక్షల రూపాయలకుఁ గొనుటకు సమ్మతించెను. ఆపైకమున నూటికయిదుచొప్పున వర్తకరుసు మిచ్చుటకు పిట్టు దానెంత మండెను! అట్టి రుసుము నడుగుట యన్యాయమగు రాక్షసకార్యమఁట—Hellish and unjust demand పాప మేయుసాధునో మోసముచేసి తాను పదునైదులక్షల రూప్యముల నందుట యేమియో యోచించికొనఁడు.




# బెంగాలు కెమికల్సువారి 3 దివ్యౌషధములు

## అక్వపిక్చోటిస్ కాంక్

అజీర్ణవ్యాధి, మందాగ్ని మొదలైన ఉదర సంబంధమైన వ్యాధులకు దివ్యౌషధము. నిత్యము భోజనానంతరం సేవించిన కలరా రానీయకుండ కాపాడగలదు.




## పికోటిస్ బిళ్లలు

అక్వపికోటిస్ కాంక్ వలె బిళ్లలు తయారైనవి. ఒకబిళ్ల సేవించినవెంటనే బాధ నివారణమగును.




## లిక్విడ్ ఎక్స్ట్రాక్ ఆఫ్ కాల్మెగ్

లివర్ సంబంధమైన వ్యాధులకు గుణమివ్వగలదు. పెద్దలుకూడ సేవింపదగినది.

బెంగాల్ కెమికల్ వారిచే తయారైన ఔషధములనే కోరుడు. మట్టపురకం కొనకుడు.

**బెంగాల్ కెమికల్ అండ్ ఫార్మస్యూటికల్ వర్క్సు లిమిటెడ్, కలకత్తా.**



చిత్రము 3. గుట్టలకు నడుమ లోయలో నున్న వాణీవిలాస సాగరమువద్దకు రాళ్లు మొదలయిన [illegible]కములను , తాటివంతెనపై కొనిపోవుట యిందు గాన నగును.



చిత్రము ౪. మూడవ చిత్రమున గల త్రాటివంతెన యిట్లు మొదలుపెట్టును.

ప్రభువులు నాలుగులక్షలు తోడ్తోడన యిచ్చివైచిరి. తక్కినదాని నప్పుడీయఁజాలక, ఫ్రాన్సుసామ్రాజ్య రాజాభరణములను నాలుగుకట్టలుగఁ గట్టి ముద్రలనిడి, కుదవయుంచి, యాఱుమాసముల కొక్కదానిని, సొక్కము చెల్లించి, తిరుగఁ దీసికొనుచు ఋణమునుండి నిముక్తులయిరి. అమితమగు నీ ధనముతోడను, చెన్నపురంబున నున్నయప్పుడు సంగ్రహించిన యింక ననేకములగు వజ్రములవలని లాభములతోడను నీపిట్టు మహాధనికుఁడయి తనవంశీయుల నెల్లంత గౌరవార్హులుగ నొనరించెను.

ఇంక నీపిట్టు వజ్రమున్ననో, ఫ్రాన్సురాష్ట్రి స్వాధీనమయిన వెనుక, ౧౮౧౪ లో ౧౮ వ లూయీ మహారాజ పట్టాభిషేక కిరీటము నలంకరించెను. తరువాత, నా రాష్ట్రమునఁ గలిగిన మహావిప్లవమున కనంతరము, ప్రజాసంఘ మధికారము నందినప్పుడు, ౧౮౮౭ లో, విక్రయించివైవఁ దీర్మానము చేసిన రాజకుటుంబాభరణపట్టికయందు నీరత్నము పేరుగలదు. కొనఁగలశక్తిఁ గలవారెవ్వరును లేకుండుటచే నారత్నరాజ మావిక్రయస్థలముననే చాలకాలముండెను. అటులుండఁ గొందఱు దొంగలారత్నమును మఱికొన్నినగలను దొంగిలించుకొని పోయిరి. వారారత్నము నమ్మజాలక యొక చిన్నయింటిలో నొకమాలమును ద్రొల్చి దానఁ బూడ్చియుంచిరి. ప్రజాధికారులు మహాప్రయాసతో కొన్నినాళ్లకావల దానిని పట్టుకొని ఫ్రాన్సుజాతీయ కోశాగారమున నుంచిరి. నాఁటినుండి ౧౮౦౪ వఱకు నచ్చటనే యుండెను. జగద్విఖ్యాతుఁడగు నెపోలియను సార్వభౌమ పట్టాభిషేకము పారిసునగరమున నోటర్‌డేము (Notre Dame) లో జరుగునపుడు, పిట్టు వజ్రరాజము సార్వభౌముని కత్తిపిడియందు స్థగితమయి పట్టాభిషేకమున కంతకును వన్నెఁదెచ్చెను. శాత్రవులు నెపోలియను సార్వభౌముని ఎల్బాదీవికిఁ దఱిమిన, నాతని పట్టమహిషి నగరము విడిచి పాఱిపోవునపుడు తనతో నెత్తికొనిపోయిన యాభరణ రాజిలో నీరత్నమొక్కటి. ఈ మహారాణి తండ్రియగు నాష్ట్రియా దేశపుచక్రవర్తి(ఫ్రాన్సిస్)యారత్నము నామెకడనుండి తీసికొని ౧౮ వ లూయీమహారాజునకుఁ బంపెను. ఆతఁ డద్దానితో నానందించుచుండ, నంతలో నెపోలియను సార్వభౌముఁ డెల్బానుండి తిరిగివచ్చుట సంభవించెను. తోడనే ౧౮ వ లూయీ వజ్రముతోఁ బలాయనుఁడయ్యెను. ఆవెనుక, వాటర్లూ మహాసంగ్రామమున నెపోలియను ఘోరాగ్రేసరుఁడు శాత్రవకరంబులఁ జిక్కి, కొఱలఁగోల్పోయిన మహావ్యాఘ్రమువలె విన్నదనంబు నందిన యప్పుడు, ౧౮ వ లూయీరాజు పిట్టువజ్రముతో మగుడ పారిసుపట్టణమున కేతెంచెను. ౧౮౩౦ లో ౧౦ వ ఛార్లెస్ మహారాజ పట్టమహోత్సవమున నారత్నకాంతులు చూపఱుల లోచనముల నుత్సవమునిచ్చెను. ఫ్రాన్సుదేశమున ద్వితీయ సామ్రాజ్యము Second Empire అంతరించిన వెనుక, రాష్ట్రపయోగము కొఱకుగా రాజాభరణముల నమ్ముటకు ప్రజాధికారులు మరల నిశ్చయించిరి. కాని కొనఁజాలినవారు లేకుంటచే నీరత్నరాజము నేఁటికిని లోవర్ Louvre లోనే సుఖమున నున్నయది.

అతిలోకపరాక్రమ ధని పేరెన్నికగాంచిన నెపోలియను వీరావతంసముని హస్తస్పర్శనంది యాతని కలంకారంబుగనుండు నదృష్టముగల యీ పిట్టువజ్రము కానిసవానికిని, మహాలోభికిని కైవసముగ నుండునా? ఆశించినవార లెందఱో యుండిన నీరత్నరాజము, కనులుండి వెదకికొనుచుఁ బోయెనా యనునట్లు, నాగలకండలకుం జిక్కకపోయి యపమానయశో ధురంధరుం జేరికొనెను గదా. కృష్ణానదీప్రాంతము నందలి పర్తియలు Purtial గను లేవ - ఫ్రాన్సుదేశమందలి వీరశిఖామణియేఁడి? ఇచ్చోటను గూడ రత్నరాజము వెదకికొనుచునే యోగ్యునిఁ జేరబోయెననిన దోసముండునా? ఆహా! విధిచేయిదము లెంత యద్భుతములు!

కోహినూరు రత్నముకన్నను పిట్టువజ్ర మిప్పుడు (కోఁతయయిన తరువాత) మూప్పదికారెట్లు పెద్దదియే యయినను, కాంతిసంపదను కోహినూరుతో సమము గాదని రత్నగుణవేత్త లుగ్గడించిరి. ఇంక మీఁద నీరత్నరాజము లెవ్వరిచే నేమేమి నాటకంబుల నాడింపఁనున్నవో; తా నేమివేసములు వేయనున్నదో; యీశ్వరసంకల్ప మెట్టులున్నదో యెవ్వ రెఱుఁగఁగలరు!

---

# శాలివాహన సప్తశతి

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారు

(రెండవశతకములోనివి ఇదివఱకు ప్రకటింపఁబడనివి మఱికొన్ని పద్యములు.)

చిన్నవాఁగువెల్లి జిక్కి కొట్టుకపోవు
పొదుగుకట్టవోలె నడుమ నడుమఁ
దగులుకొనెదు; మనస! తప్పక యెవ్వఁడో
కడకు నిన్నుఁబట్టి కాల్చివైచు.

మహాదేవుఁడు. ౨-౫

వలపమాట యెవఁడు తెలిపెనో యెఱుఁగనే!
వానిమనసు పాడుగాను! నేఁడు
విన్న మొదలు విసముగొన్నట్లు కోడలి
యవయవంబులెల్ల నవయసాఁగె.

మిఅంకుఁడు. ౨-౧౧

తొలుకాన్పువేళఁ గలనొ
ప్పులు పడఁగాలేక ముగుద 'పొండు! మగని మా
టలు చాలుఁజాలునా'కని
పలుకుచు నవ్వించె నచటివారల నెల్లన్.

అణురాఅఁడు. ౨-౨౭

దానిపై నీకు వలపు; నీపైన నాకు;
నిన్ను నదియొల్ల; దొల్లవు నన్ను నీవు;
చిన్నవాఁడవు; నీకేమి చెప్పఁ? బ్రేమ
పలువికారము లనియెడి పలుకు నిజము.

ఉజ్జిఅఁడు. ౨-౨౬

పిలువనిండు దానిపేరుతోనే నన్ను;
పలికి ఫలములేదు చెలియలార!
అతనితోడ నేమి యనకుఁ; డెంతైనను
ఒక్కమనసుతోడ నున్నఁజాలు.

కుసుమరాయఁడు. ౨-౩౧

పెద్దవఁగల్గుదాఁక నేడ్చెను; మేను కృ
శింపఁగల్గుదాఁకఁ జెడి కృశించె;
ఉసురుగల్గుదాఁక నూర్చె నిట్టూర్పు లా
బిడ్డ, నీదు వలపు వెఱ్ఱిపట్టి.

వేరసత్తి. ౨-౪౧

సమసుఖదుఃఖులగుచుఁ గా
లము గడచినకొలఁదిఁ బ్రేమ లావుగ మను నా
లు మగలలో మొదలెవ్వరు
సమసిన నది బ్రదుకు; బ్రదుకుచావితరులకున్.

వంధరంకుఁడు. ౨-౪౨

సోఁగకన్నుల నెవరిని జూతు? మెవరి
తోడ మొఱవెట్టుదుము సుఖదుఃఖములను?
ఎవరితో నవ్వులాడుదు? మెందుఁగన్నఁ
బామరులు నిండియున్న యీపాడుకొంప.

మేఘనాదుఁడు. ౨-౬౪

ప్రత్తిచేను మున్నవలసి మంచిదినాన
మడక పూజచేయఁ దొడఁగినపుడు
కోర్కులాత్మ గుబులుకొన గడగడమని
వడఁకఁ దొడఁగెఁ గాఁపుచెడిపె కేలు.

కహిలుఁడు. ౨-౬౫

సొగసులీను దయితమొగమును జూచుట
యది యమూల్యసౌఖ్య మట్టులుండె;
పొలఁతి యుండు పల్లె పొలిమేర చూచినఁ
జాలుఁ, గన్నుదోయి చల్లబడును.

? ౨-౬౭

మత్తగజకుంభములఁ జిక్కు ముత్తియముల
తోడవులను దాల్చు నవతుల నడుమఁ జూడు,
నెమలియీఁకల సొమ్ములు నెత్తిఁ జెరివి
పొగరుగొని పోవుచున్న దాబోయపడుచు.

పోటిసుఁడు. ౨-౮౮

వంకరచూపులఁ జూచుచు
వంకర పల్కులను బల్కి వంకరనడతల్
వంకర నవ్వులఁగలుగు శ
శాంకముఖుల వలపు పుణ్యసాధ్యము కొడుకా!

వప్పసామి. ౨-౮౧

గాలిఁ గదలిన చెవిమీఁది కలువనుండి
కంట రాలిన పుప్పొడి కడకు నూఁదు
నవ్వు డాళలు దీఱ ముద్దాడు భాగ్య
శాలి వెవఁడుర నీవు నిర్జరులలోన?

పాలితుఁడు. ౨-౮౬

ఊరకేల నన్ను నోదార్చెదవు? కొఁగి
లించికొమ్ము; కినుక లేదు నాకు;
వెఱ్ఱివాఁడ! నీకు వెతఁబెట్టునేని యా
మానమైన నాకుఁ బూననేల?.

మిత్రాంగుఁడు. ౨-౭౮

అలిగిన సజ్జనులగు వా
రల మనసులుఁబోలె నీ శరత్కాలమునన్
వెలుపల వేఁడిగలిగి లో
పలఁ జలువలనొప్పఁ గంటివా పెనుఁగొలఁకుల్.

విగ్రహరాయఁడు. ౨-౭౬

పాదపతనవేళఁ బొంజీల కొండ్లలోఁ
జిక్కుకొన్న ప్రియుని చికురములను
వెలఁది మెల్లమెల్ల విడిపించుటయె యల్క
కరఁగిపోయెననుచు నెఱుకపఱిచె.

అనంగుఁడు. ౨-౭౭

ఎరవు తెచ్చుకొన్న తెఱఁగున వసముగా
కుండఁ జేసిన యిట్టియొసలు గలిగి,
అమ్మ! తప్పులెన్ని యతఁడుచేసిన నట్టు
లలుగ నేర్తు నవ్వులాటకైన?

పావస్థిలుఁడు. ౨-౯౫

ఊరినిండ వయసువారు; ప్రాయము; ముదు
సలి మగండు; నవ వసంత వేళ;
ప్రాతఁవడిన కల్లు చేతనున్నది; యింకఁ
జెడక చావఁగలమె చెప్పవమ్మ?

హాలుఁడు. ౨-౯౮

[మూఁడవ శతకములోనివి కొన్ని పద్యములు]

ఒకరు చెప్పెడు మాట లట్లుండనిమ్ము;
నీదు హృదయంబె యిచ్చోట నీకు సాక్షి;
అలిగి చీవాట్లుపెట్టుటకైనఁ దగిన
యంత నెయ్యంబు లేదు నాయందు నీకు.

వాహావుఁడు. ౩-౧

ఇచ్చకొలఁదిఁ బరువులెత్తెదు; దుర్లభుఁ
డైన వానికొఱకు నాసపడెదు;
అకసంపుఁ ద్రోవలందుఁ దారాడుచుఁ
బాడుమనస! విఱిగిపడెద వెపుడొ!

ప్రవరసేనుఁడు. ౩-౨

అద్దమందు నీడయట్లుగా నెవ్వని
యాత్మ నొరుల వగపులంటుకొనవొ,

అట్టివానితోడ నత్త! యేగతిఁ జెప్ప
వచ్చు మనసు వేయివ్రక్కలయిన ?.

రాయవగ్గఁడు. ౩-౮

'గడువు సమీపించినఁ బని
చెడునో'యని మిగుల వెఱచి చెలికత్తియ లి
ప్పుడు గోడమీఁది గీఁతలఁ
దుడిచెద రొకరెండుమూఁడుదొంగతికమునన్.

పుణ్యభోజయుఁడు. ౩-౬

నీదుమోముతోడ నిండు పున్నమనాఁటి
చందురుండు పోలఁజాలఁ డనుచు,
వేఱు తెఱఁగుఁ గూర్పఁగోరిపోలె విధాత
వానిఁ ద్రుంచుచున్నవాఁడు చెలియ!.

రాహుహస్తి ౩-౭

ఎదురుపడి ముందునకుఁ జని
పదపడి వెనుదిరిగి ప్రియుఁడు పలికిన మోహో
న్మద దృష్టులె నాపాలికి
మదనశరము లమ్మ యెవరిమది కెక్కెనన్.

వాహవరాయఁడు. ౩-౧౩

చందురుండు మోము సాటియా; నందలి
మోవి తీయ మమృతమునకు సాటి;
కురులువట్టి తమిని గొసరి కైకొనియెడు
సకియముద్దు కేమి సాటి? చెపుమ.

వాహవరాయఁడు. ౩-౧౩

తీపి సుమీ నీకన్నను
నాప్రాణమె నాకు; నినువినా నిలువంగా
నోపదది; కాన బాలక!
కోపము వలదంచు వేఁడికొనవలె నిన్నున్...

హాలుఁడు. ౩-౧౪

ఎట్టివేళఁగాని యెట్టిచోటులఁగాని
కీడుగలిగినపుడు, గోడమీఁది
బొమ్మవోలెఁ బెడమొగమ్ము వెట్టని వాని
చెలిమి చేయవలయుఁ జేసికొన్న.

పాలితుఁడు. ౩-౧౭

చిన్నవాఁడ! నిజము చెప్పెద వినుము; వ
సంతమాసమున కసాధ్యమేది?
మూరుకొనియు నెత్తుగోరంట పూఁదావి
దారి యింతయేని తప్ప దతివ!

దేవరాయఁడు. ౩-౧౯

సకియ యింటి తడికసందులలో నెల్ల
బెళుకుఁ గనులు వరుసఁబెట్టి కనుచు,
నీవు త్రోవఁబట్టి పోవఁ, బంజరమందుఁ
బక్షివోలెఁ గానవచ్చె నపుడు.

అరికేసరి. ౩-౨౦

ఇంటి తడికమీఁద నెదమోపి, నిలువని
తనువు బొటనవ్రేళ్లకొనల నిలిపి,
వనిత యెంతచూచినను నీవు గానరా
వేని యేమిచేయు నింకఁ జెపుమ?

బ్రహ్మచారి. ౩-౨౧

దయితుఁ దఁచి పెల్లియయి పొంగి పొరలెడు
బాష్పధార జాఱిపడునొ యనుచు,
వెఱచి, మోముద్రిప్పి, తెరువరియిల్లాలు
దివ్వె దెచ్చియిచ్చె తెరఁగుఁగంటె?

బ్రహ్మచారి. ౩-౨౨

తులువలు వలదు, సుజనులును
వలవదు, మాకెపుడు నడిమివారలె మేఁ; లా
తులువలను జూచినను సా
దులఁజూడకయున్న నొక్కదుఃఖమె కలుగున్.

హాలుఁడు. ౩-౨౮

కలికి! సహజముగా నిండుఁగనుల వానిఁ
జూచెదవు గాని యరగంటఁ జూడకమ్మ!
అతనిఁ జక్కఁగఁ జూచిన యట్టులగును;
నీవు నొకముగ్ధవనుచు మన్నింత్రు జనులు.

మకరందుఁడు. ౩-౨౫

అలుక మెయిఁ బగలంతయుఁ బలుక కింటి
పనుల ముగియించి, నా తప్పు వలని వగపు
లెంతయున్న నాయడుగుల చెంత రేయి
చెలియ శయనించు తెలిఁగును దలఁచికొందు.

విచ్ఛముఁడు. ౩-౨౬

"సొగసుకాఁడ! నీదు మగువ సుశీలయై
మేము చెడిపెలగుట కేమి హేతు
వనెదవో" వచింతునామఱి? నీవంటి
పరువమైన మగఁడు దొరకఁ డెందు.

అణులచ్ఛి. ౩-౨౭

ఆతఁ డూరు గాలునపుడు నాచేఁ జేత
మగువ! నీరుకడవ మార్చికొనఁగ,
ఇంటిలోని యాస్తియెల్లఁ గాలినఁగాని.
మదికి సంతసంబె యొదవె నాకు.

శేచ్ఛలుఁడు. ౩-౨౯

ఆకులును గొమ్మలును లేక యడవినడుమ
బొట్టిమోడుగ నెందైనఁ బుట్టవచ్చుఁ;
గాని నరలోకమున దానకాంక్షగలిగి,
రసికుఁడై, పేదయై, పుట్టరాదు మూవె.

ఆసముసాహుఁడు. ౩-౩౦

చనిరా చెలికత్తియ; లా
యనువగు పొదరిండ్లు మోడులై మిగిలెను; పో
యెను వయసు మాకు; వేఱులు
తునిఁగి తెగియెఁ బ్రేమ; దానితో నేమింకన్?.

నిరుపముఁడు. ౩-౩౨

ఎడఁబాటున విషమైయే
ర్పడుఁ; జెంగటనున్న నమృతరసమై సుఖమున్
గడుఁగూర్చు; బ్రహ్మ రెండున్
దొడఁగి సరిగఁగలిపి చేసెనో యీచెలియన్?.

హాలుఁడు. ౩-౩౫

ఒకరినొకరు చూడకుండిన వేళారి
నిలిచియున్న గట్టివలపుగూడ,
కొడుక! కాలమేఁగుకొలఁది దోసిటిలోని
నీరువోలె మెల్ల జాఱిపోవు.

బహురసుఁడు. ౩-౩౬

'అమ్మ! తేలుగుట్టె'నని చేతులను వీచు
చిన్నదానిఁబట్టి చెలులు జాణ
లదిగొ, మగని కనులయెదుటనే కొంచుఁబో
యెదరు జారవైద్యునిల్లుసేర!

మల్లసేణుఁడు. ౩-౩౮

దొరకకుండ నేఁడు దొరకిన చెంగావి
చీరగట్టి కాఁపువారి కోడ
లదిగొ చిన్నదయ్యె నడఁగక తిరిగెడు
విరివియైన యూరివీధులందు

పుణుహుఁడు. ౩-౪౧

[సశేషము]

# సింహళద్వీపయాత్ర

శ్రీమతి తాడూరి రమణాబాయమ్మ గారు

సింహళద్వీపమును గూర్చి గాని అక్కడ చూడదగిన స్థలములను గురించి గాని నేనిదివర కెన్నడును నాంధ్రభాషయందు నే పత్రిక యందును నే గ్రంథమందును చదివి యుండ నందున యిటీవల మధ్యంధ్రజనపమేత ముగా నేనొనర్చిన సింహళద్వీపప్రయాణము వలన గలిగిన అనుభవములను ఆంధ్రలోకమున కెరుకపరచు నుత్సాహముతో నే నీ చిన్ని వ్యాసమును వ్రాయుట కెట సించినది. ఇదివరకు నా వలెనే అక్కడ సంగతు లేవియు తెలియని మన యాంధ్ర పాఠకుల కిది తద్దర్శన కౌతూహలము గలిగించునెడల నేను కృతార్థురాల నౌదును.

ఆసేతుహిమాచల పర్యంతము గల హిందువు లసంఖ్యాకముగ శ్రీ రామలింగస్వామివారి దర్శన భాగ్య నిమిత్తము రామేశ్వరము వచ్చుచు పోవుచుందురు. సేతు స్నానముచేసి తాముచేసిన పాప రాశినుండి విముక్తిని బొందుటకుగాను హిమాలయప్రాంత నివాసులు గూడ వ్యయప్రయాసముల కోర్చి అచ్చటికి విచ్చేయు చుందురు. కాని అక్కడకు మిక్కిలి సమీపమునందే యుండి ప్రకృతి సౌందర్యమున కాటపట్టైన సింహళద్వీపము దిలకించుట కా తీర్థ యాత్రికు లేల సంకోచించెదరో కారణము చింత్యము. నాకు జూడ సింహళమునకు బోవువారు సముద్రప్రయాణము చేయవలసి యున్నది గనుకను, మనపూర్వు లది నిషేధించుటను బట్టి సముద్రయానము మనహిందూ తీర్థయాత్రికులలో ననేకులకు ధర్మశాస్త్ర విరుద్ధముగా ప్రవర్తించుటకు మనసొప్పక వా రట్లు చేయకున్నారని తోచుచున్నది. నేనిక ముందు వ్రాయు నియమములను బట్టి రామేశ్వరమునుండి సింహళమునకు రెండు మూడు గంటల ప్రయాణమే గనుకను, ప్రస్తుతకాలములో నక్కడకూడ బ్రాహ్మణ భోజనశాల లనేకములున్నవి గనుకను కుల భ్రష్టత కలుగునన్న శంక యిరువదవ శతాబ్దమునందున్న మనము పాటింప నక్కరలేదని నా మనవి. భగవద్దర్శనము మనల నెటుల నానందింపజేయునో యటులనే తత్సృష్టి వైచిత్ర్యములలోనిదగు ప్రకృతి సౌందర్యముగూడ మనల నానందింప జేయు ననుట తథ్యము. కాబట్టి సేతుస్నానార్థము పోవువారు రామేశ్వరముతో పాటు సింహళమునకు గూడ పోయి యచ్చట మాత్మని యనుపమాన సృష్టి వైచిత్ర్యదర్శనానందమును అనుభవింప వెడలెదరు గాక.

మద్రాసు నుండి సింహళమునకు యెటుల బోవలెను?

మదరాసులో రాత్రి సుమారు 7 గంటలకు బోటు మెయిలు రెక్కినయెడల రెండ్పటను మార నవసరము లేక ఆ రైలు మరునాడు సాయంకాలము 4½ గంటలకు ధనుష్కోటి చేరును. సింహళమునకు బోవువారి సౌకర్యము నిమిత్తమై సముద్రమువీూద పొగబండి ఆగుటకుగాను వంతెన కట్టబడి యున్నది. బండి సరిగా ఆ వంతెన మీదకే పోవును. రైలుబండికి సమీపమునందే సింహళమునకు పోవు స్టీమరు నిల్చియుండును. కావున ప్రయాణీకులు ధూమశకటమునుండి దిగి వెంటనే తమ రాకకై యెదురు చూచు చుండెడి పొగయోడలోనికి ప్రవేశించెదరు.

## స్టీమరు ప్రయాణము

సాధారణముగా సాయంసమయమున సముద్ర మల్లకల్లోలముగా నుండును గావున వాయులల తాకుడు వలన పెద్దస్టీమరు సహితము చిన్ని నావవలె యిటు నటు నూగ లాడుచుండును. పొగయోడలోని ప్రయాణీకులు ఆ యూపునకు తాళజాలక వాంతిచేసుకొను వారును, యితరులు వీక్షించదరేమో యను శంకచే అంచున నిలబడి వెనుకకు దృష్టిని మరల్చి తమ పనిని

ముగించువారును, వాంతిచేసికొనువారిని జూచి తదితరులలో కొందఱు తాముట్టి యూపునకు లోబడుదుమను భ్రాంతిచే వారలను హాస్యము జేసి స్వల్పకాలములో తాముకూడ నట్టి స్థితికే వచ్చు వారును నగుచుందురు. మఱి కొంతమంది కన్నులు తిరుగునేమో యను భయమున స్టీమరు నడచునంతకాలము తమ నేత్రములకు విశ్రాంతి యిచ్చి రేవుచేరిన తరువాత ధైర్యశాలులవలె తమ దృష్టుల నలుగడల ప్రసరింప జేసెదరు. స్టీమరులోని నౌకర్లు చిన్న చిన్న 'బకెట్టులను' చేతి బట్టుకొని తిరుగుచు వాంతి చేసికొనువారికడ్డ వాని నుంచెదరు. ప్రతిదినము స్టీమరులో పనిచేయు నుద్యోగస్థులకు, నౌకర్లకు తప్ప తదితరులకు ఓడపై నడచుట అశక్యము. అట్లు నడువ యత్నించువారు మత్తుపదార్థము సేవించినవారివలె తూలిపోవుచు ఒక్కొక్కప్పుడు క్రిందపడుటకూడ సంభవించును. ఈ విధముగా స్టీమరు 2 గంటల కాలము ప్రయాణము జేసి 7½ గంటలకు తలైమన్నారురేవు జేరును. ఓడలోనికి డాక్టరువచ్చి ప్రతి ప్రయాణికుని ఆరోగ్యము పరీక్ష జేయును. 'కస్టమ్సు' యుద్యోగస్థులు సామానులను తనిఖీచేసెదరు. ఈ రెండు పరీక్షలు ముగిసిన పిమ్మట ప్రయాణికులు తమ తమ సామానులతో పొగయోడను విడలి దానికి సమీపముననే సిద్ధముగా నున్న కొలంబో రైలులోనికి ప్రవేశించెదరు. తలైమన్నారునుండి రైలు రాత్రి 8 గంటలకు బయలుదేరి మఱునాడు ఉదయము 8 గంటలకు కొలంబో స్టేషను జేరును.

## కొలంబో పట్టణము

కొలంబో సింహళద్వీపమునకు ముఖ్యపట్టణము. ఇచ్చటనే గవర్నరుజనరల్ నివసించును. ఈ పట్టణము పశ్చిమ సముద్రపు టొడ్డుననున్నది. ఇచ్చట విక్టోరియాపార్కును బహుచిత్ర విచిత్రవస్తువులచే నింపబడియున్న మ్యూజియమును గలవు. "క్వీను స్ట్రీటు" (Queen Street) కడు విశాలముగా నుండి యిరుప్రక్కల సుందరసౌధములతో నలరారుచుండును. ఇచ్చట భోజన సౌకర్యార్థము చక్కని హోటళ్ళు (Hotels) గలవు. అందు (Galle face) "గల్లెఫేస్" హోటలు అనునది యెక్కువ ప్రాముఖ్యము వహించియున్నది. ఈ పట్టణమున గల హార్బరునందు ఆశియా, ఆస్ట్రేలియా, అమెరికా, ఆఫ్రికా, యూరోపా మొదలగు ఖండములనుండి వచ్చు యోడలు నిలుచును. లంకాద్వీపమున నుండు యినుపదారులన్నియు యీ పట్టణమునుండి నలుప్రక్కల వ్యాపించియున్నవి. ఇచ్చట "ట్రాముకారుల" వసతి, "టెలిఫోనుల" యేర్పాటును గలవు. ఇచ్చటి ప్రజలు వంటకములను "గ్యాసు" (Gas) మూలమున తయారుచేసుకొందురు. ఒకగదిలో ఒకే స్థలమున అయిదారు "గ్యాసు" పొయ్యి లుండును. ఆ పొయ్యిలకు ఒక అగ్గిపుల్లను గీసి ముట్టించిన చాలును. అది 'స్టౌవ్' (Stove) మాదిరి వెలుగును. ఈ ప్రకారముగా యేక కాలమున సర్వపదార్థములను పక్వము చేయవచ్చును. బహుస్వల్ప కాలములో యీ 'గ్యాసు' మూలమున వేడి నీళ్లను బడయవచ్చును. ఇచ్చట పాలను పితికిన వెంటనే సీసాలలో పోసి సీలుచేసెదరు. ఈ ద్వీపము హిందూదేశమునకు సమీపముననే యున్నప్పటికిన్ని యిట్టి సౌకర్యములలో యిది విదేశమును పోలి యుండుట ఆశ్చర్యకరముగ నున్నది.

కొలంబోపట్టణములో "సుర్థానా" యను యొక్క భాగమందుండు ప్రతి విశాలసుందర భవనమునకును ముందు వెనుకలు ఖాళీస్థలములను గలిగి యుండి అందు పెంపబడు పుష్పలతలు, క్రోటన్సు మొదలైన పలువిధములైన మొక్కలు చూపరులకు నేత్రానందము కలిగించును. అచ్చటి సౌధములు విడి విడిగా నిర్మింపబడి యుండుటవలన పరిశుభ్రమైన గాలియు, వెలుతురును గలిగియుండి మిక్కిలి ఆరోగ్యకరములై నివాసయోగ్యములుగా నున్నవి. ఇచ్చట నుండు రైల్వేస్టేషనునకు గంట గంటకు కొలంబోస్టేషను నుండి పొగబండ్లు వచ్చుచు పోవు చుండును.

## సిలోనులోనివిలువరాళ్లు తదితరచిత్రవస్తువులు

ఈ దేశమున గల ప్రకాశవంతములగు సుందరమైన విలువరాళ్లు కొలంబోలోనే విక్రయించెదరు. దీనికి

సమీపముననే "రత్నపురి" యను మఱియొక పట్టణము కలదు. దీనియందు రాళ్లగనులు విస్తారముగా గలవు. "రత్నపురి" నామము సార్థకము చేసుకొనుటకో యన నిది నవరత్నగర్భితమై యొప్పుచున్నది. శ్రీరామచంద్రుడు రావణునితో యుద్ధము చేయునపుడు సీతాదేవి యీ రత్నపురి యందే యుండి యుద్ధమును తిలకించుచుండె నని యొకపురాణగాథ కలదు.

ఇచ్చట యీత పోక మొదలైన చెట్లనారలతో "మనీపర్సులను", బుట్టలను, పెట్టెలను అతి నాజూకుగా తయారుచేసెదరు. ఇంతటి నాజూకు పనులను మన దేశమునం దిచ్చటను గానము. ఇందులకే పట్టణము మిక్కిలి ప్రసిద్ధిగాంచినది. కొబ్బరిపెంకుతో నగిషీపనులు గల సజ్జలను చేయుట, తాబేలుచిప్పతో హారములను, ఏనుగువెంట్రుకలతో ఉంగరములను తయారు చేయుట మొదలగు ననేక చిత్రవస్తునిర్మాణములమూలమున స్వదేశపరిశ్రమము లభివృద్ధి పొందుటయేగాక వేల కొలది బీదకుటుంబములకు జీవనాధారమై యితరులకు నాదర్శప్రాయమై యొప్పుచున్నది.

## సూర్యాస్తమయము

తూర్పు సముద్ర తీరవాసులము, ఆంధ్రులమైన మనము భానూదయము నేకాని భూగర్భమున కేగు భానుని యస్తమయ మెన్నడును పరిస్ఫుటముగా దర్శింపజాలము. కొలంబోపట్టణము పశ్చిమతీరమున నున్నది గావున మనము సముద్రపుటొడ్డున కేగునపుడు సకలంకయును తన ప్రచండకిరణములను ప్రసరింపజేసి యలసిసొలసి విశ్రాంతి నిమిత్తమో లేక, యీ భానుడెప్పుడు గ్రుంకునా యెప్పుడు తమ ప్రకాశమును వెలువెలు వెదజల్లుదమా యని నిరీక్షించుచున్న తారకాగ్రహముల సంతోషపెట్టుటకో యనునట్లు మనము జూచుచుండగనే సూర్యుడు క్షణికములో నదృశ్యుడగును.

## కాండిపట్టణము (CANDY)

ఆ దేశమున పేర్కొనదగినది మఱియొకటి కాండిపట్టణము. సింహళమునకు కొలంబో ముఖ్య పట్టణ మగుటకు పూర్వము కాండి రాజధానిగా నుండెను. ఇది కొలంబో పట్టణమునకు డెబ్బది మైళ్ల దూరమున మూడున్నరగంటల రైలుప్రయాణమున నున్నది. ఆ పట్టణమునకు ధూమశకటముపై పోవునపుడు ఒకప్రక్కన మిన్నుముట్టుచుండెడి పర్వత శిఖరములను, వేరొకవైపున నగాధమైన లోయలను, మనము తిలకించినపుడు మనకు గలుగు నానందాశ్చర్యములను ననుభవింపవలసినదేగాని వ్రాయ వలని గాదు. ఇనుపదారి అనేక పర్వత గుహలలో నుండి వేయబడియున్నది గాన ఒక్కొక్కప్పుడు గుహలో ప్రవేశించి బయటికి వచ్చునప్పటికి దాదాపు పదినిమిషములు గూడ పట్టును. ఇక యీపట్టణ సౌందర్యమేమని చెప్పగలను! ఎచ్చట జూచినను సుందరగిరులే! ఏవైపు దృష్టి నిగిడ్చినను మనోహర పుష్పలతాదులే! ఏమూల తిలకించినను ఉద్యానవనములే! ఎటువీక్షించినను రత్నకంబళ్లు పరచినటుల పచ్చిక మైదానములే! ఆపట్టణమధ్యమున నొకవిశాలమగు సరస్సు, దాని నడుమ నొక చిన్నద్వీపము, దానిమీద పలురకములగు వృక్షలతాదులు — ఇవి అన్నియు ఆ నగరసౌందర్యమును మఱింత యినుమడింపజేయుచున్నవి. ఈ నగరమున వన్నెకెక్కిన రెండుగిరులు కలవు. ఈ రెండు కొండలమీదను గుండ్రముగా చుట్టుచుట్టి శిఖరములవరకు పోవుబాటలు గలవు. బండ్లను, మోటారులను కూడ నా కొండమీద నడిపించెదరు.

ఆ పర్వతములలో నొక దానిమీద రబ్బరుతోటలు విస్తారముగా పెంచబడుచున్నవి. తచ్ఛిఖరముపైనెక్కి చుట్టునున్న నగరమును వీక్షించిన ఆనగరములోని గృహములన్నియు కుప్పపోసిన బొమ్మరిండ్ల వలెను నడుమనున్న యా పెద్దసరస్సు చిన్నకొలను పోలికగను, చిన్న చిన్న మొక్కల సమూహము పచ్చని తివాసీలు పరచినటులను గానవచ్చును.

రెండవపర్వతముపైనగూడ ననేక వృక్షలతాదులు గలవు. ఈ గిరి నధిరోహించినపుడు గజేంద్రమోక్షములో పేర్కొనబడిన గిరి యిది యేమోయని హృదయమునకు తట్టకమానదు. అందులో పేర్కొనబడిన వృక్షము లన్నియు యీ పర్వతోపరిభాగమున నలరారుచున్నవి. ఈ పర్వత శిఖరమునకు చుట్టును మహావెలి నది



౨. లక్నో ప్రభుత్వభవనమున నున్న కేంద్రశిల్పాలంకారముయొక్క— కుడివైపు

ప్రవహించుచున్నది. గజేంద్రమోక్షములో వర్ణించినటు లీనదిలో ప్రత్యహము ఏనుగు లనేకములు గుంపులు గుంపులుగా వచ్చి స్నానము చేయుచుండును. ఈ కొండ మీద టీ, కోకో, మిరియాలు, తమలపాకులు మొదలగు వాని తోటలు విస్తారముగా కలవు.

ఈ పట్టణమున (Palareniya Botanical garden) "పేలరేణియా బొటానికల్ గార్డన్" అను పేరితో నొక ఉద్యానవనము కలదు. దానిలో సుమారు రెండు లక్షల చెట్లవరకు నుండును. ఒకచెట్టును పోలిన మరియొక చెట్టుగాని, ఒకతీగను పోలిన మరియొక తీగగాని యందుండవు. "యూకలిప్టస్" (Eucalyptus), "సింఖోనా" (Cinchona), చందనము మొదలగు వృక్షములు వానిలో ముఖ్యముగ పేర్కొనదగినవి. ఏలకులు, లవంగములు, జాజికాయ, జాపత్రి మొదలగునవి యన్నియు పచ్చిదిగూడ దొరకును. ఈ తోటయందు ఉత్పత్తియగు ప్రతివస్తువును జూపుటకు దాని మధ్యమున నున్న "మ్యూజియము"లో చేర్పబడియున్నవి. అచ్చట ప్రదర్శింపబడు వస్తువులనుబట్టి యీ యుద్యానవనౌన్నత్యము మరింత స్పష్టమగుచున్నది.

## బుద్ధదేవాలయము

ఈ నగరమునగల చారిత్రికపు కట్టడములలో నెల్ల బుద్ధదేవాలయము అత్యంతప్రాముఖ్యమును బడయును. ఇది మూడువేల సంవత్సరములక్రిందట నిర్మింపబడినదనియు, అంతకుపూర్వమిందు పార్వతీవిగ్రహము లున్నటులను చెప్పుకొనెదరు. ఈ దేవాలయమునందు బుద్ధదేవుని నిర్యాణానంతరము పార్వతీవిగ్రహములను తీసివేసి బుద్ధదేవుని పవిత్రమైన పంటి నొకదాని నచట భూస్థాపితముజేసి యప్పటినుండియు నిది బౌద్ధుల వశమునందుండుచు వచ్చెననియు తెలియుచున్నది. పూర్వకాలమున మూడుసంవత్సరముల కొకసారి యీ పవిత్రమైనపంటిని బహిర్గతముచేసి తీర్థప్రజలకు జూపించెడివాడుక యుండెడిదట. ప్రస్తుత మా దేవాలయమును మరింత విశాలముగా నిర్మించు నిమిత్తము కావలసిన నిధిని గూర్చుటకు సంవత్సరమున కొకమారు ఆపంటిని ప్రదర్శించుచు, చూడవచ్చిన ప్రతిమనుజునివద్ద మూడురూపాయలు రుసుమును వసూలుచేయుచున్నారు. అంతటి వ్యయమునకైనను పాటింపక ప్రజ లనేకులు వేనకువేలుగావచ్చి కరుణామయుడును, శాంతస్వరూపుడును, త్యాగశీలుడునునైన యీ బుద్ధదేవుని పంటిని నేత్రపర్వముగా గాంచి ధన్యులగుచున్నారు.

## లంకాద్వీపమున నివసించెడు ప్రజలు

ఆ ద్వీపమున నివసించెడు ప్రజలు సింహళీయులనబడుదురు. వారియొక్క మాతృభాష సింగళభాష. ఈ భాషకును సంస్కృతమునకును విశేషసంబంధము కలదు. వారు బౌద్ధమతస్థులు కనుక అచ్చట బుద్ధదేవాలయములు మెండు. హిందువుల దేవాలయములు తక్కువగా గలవు. కొలంబోపట్టణమున నవీనముగా నిర్మింపబడిన బౌద్ధదేవాలయము వారి శిల్పనైపుణ్యమును వేయినోళ్ల కొనియాడుచున్నది. అందలి నడిమిభాగమున సుమారు ౧౦ గజముల పొడవుగల మూడు బుద్ధవిగ్రహములున్నవి. బుద్ధదేవుని యొక్క శాంత కరుణ రసములు ఆ విగ్రహములలో ఉట్టిపడుచున్న వనుటకు సందియము లేదు. ఆ దేవాలయముచుట్టును అసంఖ్యాకములగు బుద్ధవిగ్రహములును, ఆయనజీవితమును దెలిపెడు చిత్రములును గలవు. జనులు ప్రతినిత్యము వచ్చి ఆ మహామహుని పాదపూజచేసి పోవుచుందురు. ఆద్వీపమున ఇప్పటికి బౌద్ధసన్యాసులు విశేషముగా కలరు.

అది ఉష్ణప్రదేశమగుటచే దుస్తులను విశేషముగా ధరించ నవసరము లేదు. పురుషుల విధమువలెనే స్త్రీలుకూడ అయిదుమూరల వస్త్రములను ధరించెదరు. జాకెట్టులను మాత్రము అధికముగా ఉపయోగించెదరు. ప్రస్తుత నవనాగరికులు చిన్న చిన్న కండువాలను కూడ ధరించుచున్నారు. అచ్చట కొబ్బరి విశేషముగా పండుటచే పరిశుద్ధమైన నారికేళతైలము ఉపయోగించుట వలన, వారల శిరోజములు నిడివిగాను, ఒత్తుగాను, పట్టుకుచ్చులవలె మెరయుచుండును. అన్నివిధముల చేతను సింహళము సౌందర్యరాశివలె నొప్పుచున్నది. కాబట్టి యది దర్శనీయమైన ప్రదేశమై యున్నది.

## రాజుగారి యోడ

ఏదైన నొక కాగితమును క ఖ గ ఘ వలె నలు చదరముగా చేయవలసినది. దానిని క ఘ, ఖ గ అను మూలలకు మడచి విప్పవలయును. క ఖ గ ఘ అను మూలల నాలుగింటిని మధ్యమందు ర వద్దకు మడచి చిత్రము 2 నందువలె చేయవలసినది అప్పుడు చ ఛ జ ఝ అను చిన్న చదరమొకటి యేర్పడును. మరల చ ఛ జ ఝ అను మూలలను వెనుకప్రక్కగా చదరము యొక్క మధ్యభాగమునకు మడువవలెను. అప్పుడు చిత్రము 3 నందువలె మరిన్ని చిన్న చదరము 1, 2, 3, 4 అనునది యేర్పడును. చిత్రములు 2, 3 లందు గల చుక్కలగీతలు కాగితపు పూర్వపు స్థితిని తెలుపును. తక్కిన చిత్రములందు చుక్కగీతలు విప్పబడిన మడతల గుర్తులను తెలుపును. 1, 2, 3, 4 మూలలను అడుగు ప్రక్క నొకటిగా చేర్చి పట్టుకొని క ఖ గ ఘ లను మూలలను తెరచిన యెడల నాలుగవ చిత్రమునందలి 'నాలుగు గిన్నెల గుత్తి' వచ్చును. రాజుగారి యోడను చేయులోపల నిట్టివి యనేక ఇతరరూపము లేర్పడగలవు. వాటినన్నింటిని బాలురు చక్కగా గమనించుచు పోవలసినది. నాలుగు గిన్నెల తర్వాత కాగితమును మరల మూడవ చిత్రమునందలి చదరముగ స్థితికి తెచ్చి 1, 2, 3, 4 మూలలను క ఖ గ ఘ అను మూలలందు ప్రక్కనే, నడిమికి మడువవలెను. అప్పుడు చిత్రము 5 నందువలె ట ఠ డ ఢ అను చదర మేర్పడును. ఈ చదరము న్యాయముగా 1, 2, 3, 4 అను చదరమునకన్న చిన్నదిగా నుండవలసియున్నను బాలురకు చక్కగా తెలియుటకొఱకు పెద్దదిగా వ్రాయబడియున్నది. ట ఠ డ ఢ అను చదరమును బోరగిలవేసిన యెడల దానిలో నణగి నాలుగు చిన్నచదరములు కనబడును. వాటియందు ట అను మూలకు చేరిన చదరమును మధ్యభాగము నుండి ఎత్తి పైకి మడచినయెడల ఆఱవ చిత్రమునందలి రూప మేర్పడును. ఇదియే బెంచి. పైరీతిగనె ట వద్ద చదరమునకు చేరుగా క్రిందనుండు ఢ వద్ది చదరమును మడచినయెడల 7 వ చిత్రమునందలి అరిచొక్కాయి (Waist coat) వచ్చును. అటు పిమ్మట మడువబడిన ట ఢ మూలలను అట్లనే యుంచి ఛ, జ అను మూలలనుపట్టుకొని చక్కగా ప్రక్కలకు లాగి విప్పినయెడల చిత్రము 8 యందువంటి రూపము వచ్చును. ఈ రూపమునందలి 1, 1 అను భాగములను అడుగు ప్రక్కగా చేరునటుల ఛ ఢ అను చుక్కలరేఖపై మడచి పట్టుకొనవలెను. అదేవిధముగా 2, 2 అను భాగములనుగూడ నడుగుప్రక్క చేరునటుల ఠ జ అను చుక్కల గీతపై మడచి ఈ రెండు మడువబడిన భాగములను చిత్రము 9 యందువలె ఛ జ అను మూలలను క్రిందికి వంచిపట్టినయెడల కోటు (చొక్కాయి) యేర్పడును, పిమ్మట ఢ అను భాగమును ట అనుభాగముతో చేరునట్లు మడచిన, చిత్రము 10 యందలి లాగు (నిజారు లేక పరాయి) రూపము వచ్చును. పిమ్మట కాగితమును చిత్రము 8 యందువలె విప్పి ట ఢ భాగములను గూడ ఛ జ మూలలందువలె చక్కగా విప్పిన యెడల 11 వ చిత్రమునందలి రూపము వచ్చును. ఇదియే పూర్వపు రెండవ చిత్రమునందుండిన స్థితి. ఇందలి చుక్కగీతలు ఇం దేర్పడిన మడతల గుర్తులను తెలుపును. పిమ్మట 8 వ చిత్రమునందు ఛ ఢ ఠ జ లను లాగును చేయుటకై మడచినరీతిగనే తక్కిన చ ఝ అను మూలలను గూడ మడిచిన యెడల మేజాపై బఱచు గుడ్డ (Table cloth) అగును. తర్వాత మేజాగుడ్డయందలి ఛ చ అంచునున్న ఝ జ అంచునున్న చదరము యొక్క అంచునకు వచ్చునట్లు మడచి పిమ్మట చదరమును




1, 2 రేఖమీద వెనుకకు మడువవలెను. 13 వ చిత్రమునందువలె జ ఝ, చ ఛ అంచులను కొంచెము ఎడముగా విప్పినయెడల జంటపడవ వచ్చును. జంటపడవయందలి క ఘ మూలలను బయటికి లాగిన, 14 వ చిత్రమునందలి రూప మేర్పడును. చ ఘ ఛ అనుమూలలను నడిమికి ఒకచోట చేరునట్లు వెనుకకు మడువవలెను.

అదే రీతిని వెనుకప్రక్కనుండు మూలలనుగూడ మడచిన యెడల 15 వ చిత్రమునందుండు రూపము వచ్చును. 13 వ చిత్రమునందలి ట ర అను మూలలే 14 వ చిత్రమునందు ద ధ అని గుర్తించబడియున్నవి. చిత్రము 15 నందలి త థ అంచును ద ధ అంచు పైకి మడచినయెడల 16 వ చిత్రమునందలి రీతిగ పైకపుసంచి (Money purse) ఏర్పడును. పైకపుసంచిని విప్పి 17 వ చిత్రమునందలిరీతిగ చేసినయెడల త్రొట్టి వచ్చును. తొట్టి యొక్క పైయంచులను మరల మధ్యకు 18 వ చిత్రమునందువలె మడువవలసినది. పిమ్మట పైరూపమునందలి ఒక్కొక్క సగమును మరల వెనుకకు సగమునకు మడచిన యెడల 19 వ చిత్రమునందలి రీతిగ మడక యేర్పడును. తర్వాత 1, 2, 3, 4 అను అంచులను వెనుకకు విప్పినయెడల 20 వ చిత్రమునందలి రూపము వచ్చును. ఈ రూపమునందలి 1, 3 అంచును 2, 4 అంచు పైకి వచ్చునట్లు సగమునకు మడచిన యెడల 2, 4 స్థితికి లేవలెను. పిమ్మట సమ మూలలను రెండుచేతులలో పట్టుకొని నెమ్మదిగా వెలుపలికి లాగినయెడల 22 వ చిత్రమునందలి రూపము వచ్చును. దానిని తల క్రిందుగా త్రిప్పి 1, 3 సందులయందలి క గ మూలలను బయటికి లాగిన యెడల 23 వ చిత్రమునందలి రాజుగారి యోడ వచ్చును. దీనికే రాజురాణీయోడ యని కూడ పేరు.






## విద్యార్థికి వ్రాయబడిన లేఖ

[క్రింద వ్రాయఁబోవునది విలియమ్ హేజ్లిట్ అను నాంగ్లరచయిత అప్పుడే నూతనముగఁ బాఠశాలకుఁ బంపఁబడిన తన పుత్త్రినికి వ్రాసిన లేఖకు అనువాదము. ఇది 1930 సం॥ రమున జరుపఁబడు స్కూలు ఫైనలు పరీక్షకు నియమింపఁబడిన ఆంగ్ల పఠనీయగ్రంథ ఖండములలో నొకటి.]

ప్రియమైన బాలకునకు,

నీవిప్పుడు పాఠశాలయందుఁ బ్రథమప్రవేశ మొనర్పఁబోవుచున్నావు. ఇది ప్రాపంచిక జీవనమునకుఁ బ్రథమసోపానమని చెప్పవచ్చును. నా శరీరస్థితి యంత తృప్తికరముగ లేకపోవుటచే నే నింకఁ జిరకాలము జీవింతునని చెప్పలేను. అందుచే నా శక్తికిఁ దగిన నీతిబోధయు జీవితాదర్శబోధయుఁ జేయఁదలఁచి యీ లేఖ వ్రాయుచున్నాను. ఇది నీ కాదర్శప్రాయముగ నుండుటయే గాక నన్నుఁ గూర్చి జ్ఞాపకచిహ్నముగఁ గూడ నుండునని నమ్మి దీనిని వ్రాయుచున్నాను. దీనివలన నీకు ఘనముగ మేలు చేయఁజాలకపోయినను నా యనుభవమునుఁ బట్టి నా పొరఁబాటులు నీ వొనర్పకుండునట్లు చేయఁగలనను నమ్మకముతో దీనిని వ్రాయుచున్నాను.

మనము ప్రథమమున నీ పాఠశాలకొఱకుఁ బోవుచుండినప్పుడు మార్గములో నీవు "పాఠశాలలోని ప్రజ లందఱును అననుకూలురును, మూర్ఖులునై యుందు" రని పలుమాఱుఁ జెప్పుచుంటివి. ఇది చాల తప్పు. ఎప్పుడును భవిష్యత్తును గూర్చి సదాలోచనయే చేయుచుండుట పరమోత్కృష్టమని పెద్దలు చెప్పుదురు. ఏవిషయమును గూర్చి గాని దాని దౌష్ట్యము నీ కనుభవసిద్ధముగ గోచరించునంతవఱ కది నిర్దుష్టమనియే యెంచుచుండుము. ఒకప్పుడు కొన్ని విషయములు దోషయుక్తములైనను వానిని సంస్కరించుటకుఁ బ్రయత్నింపుము. అది నీకు సాధ్యము కానియెడల వానినోర్పుతో సహించుకొనవలయునే గాని విసుగుకొనరాదు. నీవు విద్య నభ్యసించుటకుఁ బోవుచుండినప్పుడా పాఠశాల నీ కనుకూలింపదని చెప్పుచుంటివి. ఇది తప్పు. దాని మంచి చెడ్డలను నీవు స్వయముగఁ బరిశీలించునంతకును నీ వా పాఠశాలను గూర్చి ఇదమిత్థమని యేమియుఁ జెప్పఁజాలవు. ఇల్లు విడిచిపెట్టుట నీకుఁ గష్టముగాఁ దోఁచవచ్చును. అదియే నీ యీయభిప్రాయమునకుఁ గారణమై యుండును. అట్లుగానిచో నీ కా బడి యనుకూలింపదని తొలుతనే చెప్పుట నీవు దాని నసహ్యించుకొన నిశ్చయించుకొనుటయే యగును. ముందు కీడే కలుగునని యెన్నఁడును దలఁపరాదు. నీకనుకూలింపనివెల్లను నీచములని, అసహ్యము చేఁగాని, కావలెనని కాని, నిజస్థితికి విరుద్ధముగఁ జెప్పరాదు.

ప్రథమమున నీవు నీ సహాధ్యాయులను నిర్లక్ష్యభావముతోడను, విరుద్ధభావముతోడనుఁ జూచినట్లు నాకుఁ దోఁచినది. వారు నీ కపరిచితులగుటయే యిట్టి నీ చేఁతకుఁ గారణమై యుండును. వారినిఁ గూర్చి నీ కెంత తెలియునో నిన్నుఁ గూర్చి వారికి నంతయే తెలియును గదా! నీతోఁ గలసి మెలసి యుండకపోవుటకు నీకు వలెనే వారికి నదియే కారణమై యుండవచ్చును. వారి విముఖత నీ కెంత కష్టముగఁ దోఁచునో నీ విముఖత వారికి నంత కష్టముగ నుండుట కవకాశము కలదు. ఒక వ్యక్తినిఁ గూర్చి నీ కేమియుఁ దెలియక పోవచ్చును. అది కారణముగ వానిని నిరసించుట తప్పు. అది సబబు మాలిన పని యగుటయే గాక యనేకులను నీకు విరుద్ధులుగఁ జేయును. ఇతరులు నీకుఁ బ్రతికూలముగఁ బ్రవర్తించిననే తప్ప నీవు వారియందు ప్రతికూలభావము

చూపవలదు. అప్పుడైనను వారి లోపములను గనిపెట్టి యా లోపములు నీయందు లేకుండునట్లుఁ బ్రవర్తింపుము. అప్పుడు వారికి నీయందు శత్రుభావము పోయి ప్రసన్నత కలుగును. వైరుధ్యమును, అసూయయు, దూషణయు, శత్రుత్వమును మఱింత బలపఱచునుగాని తగ్గింపఁజాలవు.

నీ సహాధ్యాయులలోఁ గొందఱు యువకులు నీ దుస్తులంత బాగులేవని నీవు వారి వెగటాళిచేయుచున్నట్లు నాకుఁ దోఁచినది. ఎవరినిగాని విధివశమైన లోపములను బట్టి యేవగించుకొనకుము. అందు ముఖ్యముగ దారిద్ర్యమువిషయమై యసలే యసహ్యించుకొనకూడదు. పోవరుల యెగతాళికి గుఱికాకుండుటకు మాత్రమే వేషభాషలందు శ్రేష్ఠ మవసరము కాని వానిని బరమార్థముగ నెంతమాత్ర మెంచుకొనకుము. నీవు మూఢవిశ్వాసముల నుండి విముఖుఁడ వగుటయే కాక వానికి గుఱికాకుండఁగూడ నుండవలయునని కోరుచున్నాను. "ఎవరినిగాని విధివశమైన లోపములనుబట్టి యేవగించుకొనకుము" అని నీకుఁ జెప్పియుంటిని. అట్లుగాక "ఎవరినిగాని యెందులకుఁగాని యేవగించుకొనకుము" అని చెప్పవలసియుండెను. ఏలన నితరుల దైన్యము మన యౌన్నత్యముగను, వారిదురదృష్టము మన యదృష్టముగను నెంచుకొనుటయే యేవగింపున కర్థము.

నీ విప్పటికిఁ బోయినప్పటినుండియు నచ్చటి బాలురు నిన్నుఁ జూచి నవ్వుచున్నారనియు, నిన్నలక్ష్యము చేయుచున్నారనియు, నింటివద్దనున్న యాదరణ యచ్చట లేదనియుఁ బలుమాఱు వ్రాయుచున్నావు. వెఱ్ఱివాఁడా! జీవితమందు సాధారణముగ సంభవించు దుఃఖములను, నవాదరణములను నోర్పుతో సహించుకొనుట కలవాటుపడుటకే నిన్నచ్చటికిఁ బంపినది. నీ వెల్లకాలమును నావద్దనుండుటకుఁ గాదు. ఒకప్పుడది సంభవనీయమైనను శ్రేయస్కరము కాదనియే నేను తలఁచెదను. కాని నేను నీ యందుఁ జూపు నాదరభావ మితరులుకూడఁ జూపవలయునని యెంచకుము. ఇంతవఱకు నీ వతిగారాబముగఁ బెరిఁగితివి. ఇంటివద్దను, నీమిత్రుల వద్దను గూడ నీ ముద్దులు నిరాఘాటముగఁ జెల్లుచుండెడివి. నీ సహచరులలోనెల్ల నీవే మొనగాడవుగా నుండఁ గోరుచుండెడివాఁడవు. ఇప్పుడది సాధ్యపడదు. కాని నీవు మంచిస్వభావమును, తెలివితేటలను గలవాఁడవు. ఈ గుణములు తప్పక నిన్ను ముందునకుఁ దెచ్చును. ఇప్పుడు నీవు దార్ఢ్యమునందును, బలమునందును నీకంటె మిన్నలగు బాలురమధ్య నున్నాఁడవు. నిన్నిప్పుడును లాలించుచుండుటకును, పొగడుచుండుటకును వారికిఁ దీరిక యుండదు. ఇది యొక గొప్ప యన్యాయముగను, తిరస్కారసూచకముగను నీకుఁ దోఁచును కాని బాలకప్రపంచమున నీతోపాటు పలువురు గలరని ముఖ్యముగ గమనింపుము.

నీ పాఠశాలలో బాలురనేకులు గలరు. నీ యాటలును, గతులును నీ కెంత ముఖ్యమో వారి యాటలును, గతులును (అవి యేవైనఁగానిమ్ము) వారికి నంతియే ముఖ్యముగదా! కావున నీపనులు నీవు చూచుకొనుచు వారిపనులకు వారి కవకాశ మిచ్చుచుండవలయును. నీవు నీ చిన్నతనపుఁజేష్టలచే గర్వాతిశయముఁ జూపితివా, నిన్నెల్లరు నల్పముగఁ జూచి నిన్నెగతాళి చేయుదురు. సమభావమే నరులకు ముఖ్యధర్మము. అదియే వివేకసూచకము. అనేకులలో నీ వొకఁడవని జ్ఞాపకముంచుకొనినచో సంఘమున నీకుఁగల స్థానమిదియని నీకు నిశ్చయముగఁ దెలియఁగలదు. మనయింటివద్ద నీవేమిచేసినను జెల్లును కాని యిల్లువిడిచిన పిదప లోకములో నీతో సమానులును, నీకంటె నధికులును నెందఱో యుందురు. లక్షలకొలఁది ప్రజలను నిర్మూలించుటకుఁగాని, వారిని నీయాజ్ఞానువర్తులఁ జేయుటకుఁ గాని నీవు రాకొమరుఁడవు గావు. వారితోపాటు నీవును గష్టసుఖములలోఁ బాల్గొనవలసియుండును. జగడములు సంభవించినప్పుడు సహనముతోడను, నిష్కల్మషహృదయముతోడను వానిని మాన్పుకొనవలయును. నీ కీవిషయ మిప్పటికే గోచరించి యుండును. నీ ప్రస్తుతస్థితికి సాధ్యమైనంత త్వరితముగను, సులభముగను నలవాటుపడవలయునని కోరుచున్నాను.

ఇట్లు: నీ ప్రియమైన జనకుఁడు,
విలియం హేజ్లిట్.

[భాగవతుల వెంకటశాస్త్రి, బి.ఏ.యల్.టి.-
అనువాదకుఁడు.]

## లక్నోయందలి ప్రభుత్వభవనమునకు ఒక చిత్రమగు కేంద్రాభరణము

సంయుక్తపరగణాలకు గవర్నరుగనుండిన సర్ విలియమ్ మారిస్‌గారు తమ ఉద్యోగపరిమితకాలము ముగిసినతర్వాత నా ఉద్యోగస్మారకచిహ్నముగ ప్రభుత్వభవనమున కొక అలంకారమును అర్పించెను. ప్రభుత్వభవనమునకు కేంద్రాలంకారముగ నున్న యీ శిల్పసృష్టి జింకితోను, చేవకర్రతోను చేయబడినది. 14 రకముల శిల్పపుచేతిపరిశ్రమలమాదిరులతో కూడియున్న యిది లక్నోయందలి ప్రభుత్వ శిల్ప, చిత్ర కళాశాలాధ్యక్షులచే నూహింపబడి, యతని యుద్యోగీయవర్గమువారి అజమాయిషీక్రింద నా కళాశాలావిద్యార్థులచే చేయబడినది.

ఇందలి యలంకారము సంయుక్తపరగణాలపద్ధతికి లాంఛనముగ నున్నది. ఇందు రూపింపబడిన పర్వతగులును నైనిటాలునుండి చూచిన కనపడునట్టి త్రిశూలము, నందాదేవి, నందకోట అను మూడు ప్రసిద్ధ శిఖరములు. ఇందలి ద్వారబంధముల, కిటికీల నిర్మాణమునందు హిందూ, మహమ్మదీయ, బౌద్ధ, యూరోపీయ శిల్పముల వివిధములగు మాదిరులను కనుపరుపబడినవి. ఈ చివరను, ఆచివరను ఉండు రెండుముఖ్యమగు కిటికీ అద్దపుబిళ్లలపైనను తాజ్‌మహల్ మందిరమును, లక్నో రాజభవనమును చిత్రింపబడియున్నవి. ఒకప్రక్కనుండు అద్దపుబిళ్లల వరుస కాశీని హరిద్వారమును, జాన్పూరునందున్న గొప్ప మసీదును, లామార్టినేర్ కళాశాలను చూపుచున్నవి. మరియొకవైపున ఆరాష్ట్రములోని వివిధపరిశ్రమల చేతిపనుల మాదిరులు చిత్రింపబడినవి. ఇందుండు నాలుగు మనుష్యప్రతిమలును ఒక హైకోర్టుజడ్జీ, ఒక (గార్హ్వాలీ) దేశీయసైనికుడు, ఒకపోలీసు కాన్‌స్టేబిల్, ఒకనీళ్ల కావడివాడును. జంతువులు ఒకఏనుగు, ఒక పెద్దపులి, ఒకజింక, ఒక మొసలియు. ఆరాష్ట్రముతో సంబంధము కల్గియుండిన 12 గురు ప్రసిద్ధపురుషుల పేళ్లు ఒక చెక్కడపుపనితనముతో చేయబడిన పట్టీయందు కలవు. ఈ సంచికయందలి 3 ఛాయాచిత్రములును ఈ వివరములను స్పష్టపరుప గలవు.

[వి. ఆర్. చిత్ర.]

---

## చంద్రవంక—ఎత్తిపోతల

ఇది ఆంధ్రపౌరుషమునకు పేర్గాంచిన పల్నాటిసీమలో మాచర్ల పట్టణంబున కుత్తరంబున ౬ మైళ్ల దూరములో గలదు. ఇచటినుండి చంద్రవంక సమోన్నతముగ భూమట్టముననే ప్రవహించుచువచ్చి యిచట నొకేమారు దాదాపు ౧౦౦ అడుగుల యగాధమున బడి నాలుగుమైళ్లు ప్రవహించి కృష్ణలో కలియును. ఇచ్చట పైనుండిచూచిన కన్నులు తిరిగిపోవును, కొండలలో ప్రతిధ్వనులు గానుపించును.

ఈ ఎత్తిపోతలకు ప్రక్కవైపుననున్న మార్గముగుండా క్రిందికి దిగవచ్చును. ఇచ్చట ప్రకృతి రమణీయముగ నుండును.

ఈ లోయలోనికి మనము ప్రవేశించినంతనే తొలుత నొక విష్ణ్వాలయము గానవచ్చును. ఇది గుహాలయము. ఇచట ప్రక్కవైపున్న కొండలోననే యిది తొలువబడినది. యాత్రికులు బసచేయుటకై యిచటనే యొక సత్రము కలదు. దీని పరిసరమున ఉత్తరపు దిక్కున మఱియొక గుడి కలదు. అది చాలచిన్నది. అందు విగ్రహము లేవియు గానుపింపవు. కాని, రెండు భూగర్భమార్గములు మాత్రము కనుపించును. అందొకటి పడమటివైపునకును, రెండవది యుత్తరపువైపునకును బోవునవిగ నున్నవి.

ఈ సత్రమునుండి బయలుదేరిన కొండపైకెక్కుటకు మెట్లు కలవు. ఆమెట్లనెక్కిన రెండుమార్గములు కానుపించును.

ఒకటి కొండపైభాగమునకు బోవును. రెండవది ప్రక్కగా క్రిందికి బోవును. అచట నొక శివాలయము కలదు. ఆలయమున దక్షిణముగ నొక చిన్నగది కలదు. ఈ గదిలో పశ్చిమముగ బోవు భూగర్భమార్గ మొకటి కానుపించును. ఈ శివాలయములో పట్టపగలైనను దీపములు పెట్టుకొనక తీరదు. కటికచీకటిగ నుండును. ఈ యాలయము కొండలో చెక్కబడినదే! ఆలయముపైన దాదాపు ౧౦౦ అడుగులపైగా కొండ కలదు. చంద్రవంక పాఱుచోటికిని ఇచటికిని దాదాపు ౩౦,౪౦ అడుగులపైగా యెత్తు కలదు. రెండవమార్గమున (కొండ

పైకిలోవుమార్గమున) నొక ఫర్లాంగు ముందునకు ప్రవాహము ననుసరించి పోవుదుమేని యచటినుండి యొక యద్భుతదృశ్యము గోచరించును. ఇరుప్రక్కల కొండలు, నడుమ సందు, ఆసందైనను పదిగజములకన్న నెక్కుడుగ నుండదు. ఆకొండలును గోడలవలెనుండి ముందునకు వచ్చి పైకప్పులేని వాకిలివలె నుండును. ఆద్వారము గుండ చంద్రవంక ప్రవహింపవలయును. ఇచట చాల లోతుగ నుండును. ఇచట సాధారణముగ జనులు సంచరింపరు. నీటిలోనికి దిగ జంకుదురు.

ఆద్వారముగుండ ఉత్తరమునకు జూతుమేని అచటికి నాల్గైదు మైళ్లదూరమున కృష్ణవేణి కానుపించును. ముందునకు దాదా పొక మైలునిడుపు కొండ కలదు.

ఈ ఎత్తిపోతలకు దక్షిణముగ నొక దుర్గమున్నట్లు కొన్ని గుర్తులు కలవు. బురుజామాదిరిగ కొండ యున్నది. ప్రాచీనశీర్ణభవనముల యానవాలు యిచట కానుపించుచున్నది. [వా. గో. కృష్ణయ్య.]

---

## ఒకపురాతన గ్రంథాలయము

ఇప్పటికి వెయ్యేండ్లకుముందే భరతఖండమందు గ్రంథాలయసంస్థ చక్కగ వికసించియుండెననుటకు ప్రబలమైన సాక్ష్యము క్రొత్తగ బయల్పడినది. నిజామురాజ్యమందు మదరాసు బొంబాయి యినుపదారిని హైదరాబాదు రైలుతో సంధించునట్టి 'వాడీ' జంక్షను 'భారతి' చదువరు లెరిగియుందురు. ఈ 'వాడీ'కి సమీపమున 'నాగెయీ' అను చిన్న గ్రామమొకటి యున్నది. దీనిచుట్టుప్రక్కల 1000 సంవత్సరములకు ముందు నగరరాజమొకటి ప్రబలియుండిన ట్లనేకములైన శాసనములును, స్మారకచిహ్నములును గలవు. ఇవి పురాతన చరిత్రనిర్మాణమునకు ముఖ్యమైన సామగ్రిగ నేర్పడవచ్చును. ఆగ్రామమున 'అరవత్తుకంబగుడి' అనుపేరితో పురాతనదేవాలయము నేటికిని నెలకొనియున్నది. ఈ గుడియందు అమర్చిన శిలాశాసనము చదువగ, క్రీ.శ. ౧౦౫౮ వ సంవత్సరము డిశెంబరు ౨౪ వ తేదికి సరియైన తిథివారమందు 'రాయనారాయణ' అనుపేరిటి చాళుక్యవంశపు రాజు రాజ్యమేలుచుండెననియు, ఆయనకు పేరుగన్న మంత్రియును, దళవాయియు నగు మధుసూదన డనువాడు ఘటికాశాల యనుపేరితో ఒక కళాశాలను (ఇప్పటి residential university) కట్టించి అందు రెండు నూర్ల విద్యార్థులకు భోజనవసతితో వేదవేదాంగములే గాక ౫౦ వివిధమైన శాస్త్రములయందు వ్యాసంగము జరుపుట కవకాశ మేర్పఱచి యుండెనని తేలుచున్నది. వేదమున నుపాధ్యాయులు ముగ్గురును, శాస్త్రమునకు ముగ్గురును, అక్కడి గ్రంథాలయముల పరామర్శించుటకు ౬ మందిని నియమించి యుండినట్లును శాసనమున వ్రాసియున్నారు. ౬ మంది గ్రంథాలయాధికారుల నియమించునంతటి స్థితియందు, అక్కడి గ్రంథాలయము లెంతటి విశాలమైనవో, మన మూహించుకొనవచ్చును. ఆశాసనపు క్రిందిశ్లోకముననే మధుసూదనుడు గ్రంథాధికారుల వేతనములను నిర్ణయించియుండుటను జూడ, కళాశాలాంగమున వారియున్నతి యిట్టిదిగ నుండెననియు తెలియనగును. ప్రభాకరదర్శనమును శాస్త్రోపాధ్యాయునికి ౮౫ పద్దుల క్షేత్రమును, భట్టదర్శనమును శాస్త్రమును నేర్పుగురువునకు ౩౫ పద్దులభూమియు, న్యాయశాస్త్రోపాధ్యాయునికి ౩౦ పద్దుల నేలయు, వేదాంగగురువులకు ౨౦ పద్దులును, ఆరుగురు గ్రంథాలయాధికారులకు చెరి ౩౦ పద్దులను ఏర్పఱచినట్లు వ్యక్తమగుచున్నది. దీనినిబట్టిచూడగ, మధుసూదనుడు శాస్త్రోపాధ్యాయులను, గ్రంథాలయాధికారులను సమానులుగా భావించి వారికి మర్యాదలను చూపుచుండినట్లు గ్రహింపనగును. వేదాంగగురువులకు ౨౦ పద్దులను మాత్రమే మిరపఱచి యుండుట చిత్రము. దీనివలన ఆధ్యాత్మికవిద్యకన్న కడుపుపూడుగడింపచేయునట్టి ఆర్థికవిద్యయే ప్రయోజనకారియని అప్పటికే గ్రహింపబడినట్లును తెలియనగును. పాశ్చాత్య గ్రంథాలయములందు గొప్ప విద్వాంసులనే యధికారులుగ నియమించుట అప్పటికే నాడుకరైయుండె ననుటయు గ్రాహ్యము. ఇట్టి ఆధునికవికరణ వెయ్యియేండ్లకుముందే భరతఖండమందు నెలకొనియుండెననుట ఆశ్చర్యకరమైనసంగతి. ఇప్పటి గ్రంథాలయములకు మధుసూదనునివితరణ ఆదర్శప్రాయమగును.

[టి. శివశంకరము.]

---



3. లక్నో ప్రభుత్వభవనమున నున్న కేంద్రశిల్పాలంకారపు ఎడమవైపు



విజయ సింహళవిజయము

అజంతా మండోదక (Fresco) చిత్రము. జయపూరు మ్యూజియమున చిత్రింపబడినది.

[ఆర్టు అండ్ ఇండస్ట్రి జర్నల్ నుండి]




శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య గారు

“చిచ్చులపిడుగు” అను వ్యాసము తమపత్రికలో ప్రకటించినందులకు రాజద్రోహము, జాతివైమనస్యముల పురికొల్పుట అను నేరముల క్రింద ఆగష్టు ౧౬వ తేదిని మొత్తము 2½ సం. కఠినశిక్ష విధింపబడిన దేశభక్తుడు. ‘కాంగ్రెస్’ సంపాదకుడు.

---



శ్రీ సజనీకాంతదాసుగారు



శ్రీ రామానంద ఛటర్జీగారు

‘మాడరన్ రివ్యూ’, ‘ప్రవాసి’, ‘వెల్ఫేర్’, ‘విశాల భారత్’ పత్రికాధిపతులును, సుప్రసిద్ధ వ్యాసకర్తలును, రాజకీయవేత్తలనదగువారు నగువీరికిని, వీరితోపాటు వీరి ముద్రాలయమున పనిచేయుచున్న సజనీకాంతదాసుగారికిని, అమెరికావాస్తవ్యులగు జెబెజ్ థామస్ సండర్లాండు గారు వ్రాసిన ‘India in Bondage’—‘దాస్యమందున్న భారతదేశము’—అను గ్రంథము ముద్రించి ప్రకటించినందులకు రాజద్రోహ మను నేరముపై చెరియేసి రూపాయిల జరిమానాను బెంగాల్ ప్రభుత్వమువారు విధించిరి. జరిమానా చెల్లించి వీరిద్దరును హైకోర్టున అపీలు చేసిరి. ఏమగునో ముందు తెలియవలసియున్న. ‘దాస్యభారతము’ రెండవ ముద్రణము లొంగినది.

---



రాత్రి కాపరి
[వి. ఆర్. చిత్రగారి త్రివర్ణచిత్రమునకు ఛాయాచిత్రము.

---

## డాస్టావిస్కీ మృత్యుభీతి

డాస్టావిస్కీ రష్యనుసాహిత్య నిర్మాతలలో ప్రముఖులు. సకల రష్యక్ విషయముల సమస్యల ప్రతిబింబించు ఉత్తమ నవలారచయిత. భుక్తికిగూడ జరుగ నంతటి పేదరికమున నుండియు, ౧౮౨౧ సం. నుండి తన ౬౧ సం. జీవితమును దేశసేవకును, సాహిత్యవిమర్శకును వినియోగించిన ధీరుడు. అతని నేరము—శిక్ష, మూర్ఖుడు కాని అవమానము—మున్నగునవలలు ఉత్కృష్టగ్రంథము లని పేరుపడసియుండుటయే గాక పెక్కుభాషల లోనికి అనువాదితములు గూడ. కరుణాభీభత్సరసవర్ణనల యందు అద్వితీయుడు.

సమిష్టివాద ప్రచారమునకై రాజవిద్రోహ మగు కుట్రలలో పాల్గొనుచున్నాడను నెపమున మరి నలుబది ముగ్గురితో యితడు గూడ బంధింపబడి, ఉరిశిక్షను పొంది మృత్యువుయొక్క భయంకరాకారమును కని, దాని అసహ్య చీత్కారముల విని, తిరిగి దాని వాత బడకుండ బ్రతికిన అదృష్టశాలి. అప్పటి మరణవేదనను గూర్చి తర్వాత అతడే యీ విధముగ వ్రాసికొనియున్నాడు:—

"మరుసటి సంవత్సరము ఫిబ్రవరి ౨౩ వ తేది నాడు నేను అనుభవింపవలసిన శిక్షనుగూర్చి జైలునందలి నా గదిలో వింటిని. నన్ను కాల్చి చంపవలసినటులగా ఉత్తరు వాయెను.

శిక్షనుగూర్చి చెప్పునపుడు అది యెప్పుడు జరుగగలదో చెప్పలేదు; కాని తర్వాత ఒక ఘంట జరిగి జరుగకమునుపే జైలరు కాన్పించి నా ఉడుపుల ధరింపుమని చెప్పెను. బలమైన కాపలాతో నన్ను నాగదినుండి బయటి విశాలప్రదేశమునకు తీసికొనివచ్చిరి. అచ్చటనే నా సహచరులు పందొమ్మిది మంది కాచుకొనియుండిరి. అప్పుడు ఉదయము ఏడుఘంటలు. నలుగురుఖైదీలను, ఒక్కసోల్జరును ఒక్కొక్క బండియందు ఎక్కించిరి.

'మనము ఎక్కడికి పోవుచున్నాము?' అని మే మడిగితిమి. 'నే నది చెప్పగూడదు' అని సోల్జరు చెప్పెను. బండికిటికీలు మంచుచే కప్పబడియుండుటచే బయట దేనినిగూడ చూడజాలకపోతిమి.

కడపటికి సెంయొనోస్కి మైదానమును చేరితిమి. దానిమధ్య ఒకతూకుమాను అమర్చబడియుండినది. దాని సమీపమునకు మమ్ము తీసికొనిపోయి రెండు బారులుగా నిలుచుండబెట్టిరి. సమీపముననున్న ఖైదీతోగూడ బహు కొద్దిమాటలకన్న విశేషము మాట్లాడకుండునటుల మేము అతి జాగరూకతతో కాపలా కాయబడితిమి.

ఒక షెరీఫ్ ఆ తూకుమానుమీద కాన్పించి నామరణదండనము చదివి వినిపించెను. ఆకార్యము తోడనే జరుపవలసినటుల అందుండెను.

'కాల్చి చంపవలె' నను ఘోరమగు మాటలు ఇరువదితూరులు ఉచ్చరింపబడెను. ఆమాటలు నా స్మృతిఫలకమున ఎంత స్థిరముగ వ్రాయబడినవనగా, కొన్ని వర్షముల తర్వాతగూడ ఒక్కొక్కతూరి హఠాత్తుగా రాత్రులయందు మేల్కాంచి, ఆ మాటల తిరుగ వినుచున్నానా యని భ్రమపడెడివాడను. అప్పటి మరొకవిషయముగూడ నాకు స్పష్టముగ జ్ఞాపకమున్నది. ఆ ఉద్యోగి చదువుట పూర్తిచేసి, కాగితమును మడచి, జేబీలో నుంచుకొని ఆ తూకుమానును దిగివచ్చెను. అప్పుడే దినకరుడు మేఘపంక్తిని విదీర్ణముచేసి కాన్పించెను. 'అశక్యము, మనల వారు చంపజాలరు' అని నేననుకొని, నా

ప్రక్కనసే యున్న ఖైదీతో మెల్లగ పల్కితిని. దాని కతడు జవాబు చెప్పుటకు మారు తూపునూనుకు ప్రక్కనసే పెద్దబట్టచే కప్పబడియున్న శవముల పెట్టెలయిరున వైపు వ్రేలుచూపించెను.

ఒక్కనిముసముులోపల నా ఉద్దేశ్యము, నా ధైర్యమంతయు పంనబంగాళమాయెను. స్వల్పకాలములో కాల్చివేయబడుటకై నిరీక్షించుచుంటిని.

నాకు అపరిమితమగు భయమువేసినది. కాని బయటికి చాల అలక్ష్యముగ నున్నవానివలెనే కనబడుటకు చాల ప్రయత్నించుచు, వివిధవిషయముల గూర్చి నేను నా స్నేహితునితో మాట్లాడుచునే యుంటిని. నేనంతగ విచర్ణుడ కాలేదని గూడ అతడు తర్వాత నాతో చెప్పెను.

హఠాత్తుగా ఒక మతగురువు ఆ మానువీాద కెక్కి మీాలో నెవరైన తప్పుల ఒప్పుకొని, పశ్చాత్తాపపడ కోరుచున్నారా యని యడిగెను. ఆ ఆహ్వానమును ఒకడు మాత్రమే అంగీకరించె కాని ఆ మతగురువు 'సిలువ'ను చాపినపుడు మేమందఱము మాపెదవులతో దానిని అంటుకొంటిమి. ఎక్కువగ దోషులని తలచబడిన పెట్రాస్కెవిస్కీని, మరి యిద్దరిని అప్పటికే క్రలకు బంధించి ఒక విధమగు సంచితో వారి తలకట్టివేసిరి. 'కాల్చుడు' అని చెప్పగనే కాల్చుటకు సిద్ధముగ నుండిరి పోల్జర్లు.

బహుశా నే నింకొక ఐదు నిముసములు బ్రతికియుందు కాబోలునని తలచితిని. ప్రతి రెప్పపాటుగూడ అతి దీర్ఘత్వముగ నుండినది. భాను కిరణజాలముచేత నిగనిగలాడుచుండిన ఒక చర్చిశిఖరమును అదేపనిగ చూడ ప్రారంభించితిని. నేనిక కొద్దికాలములో చేరగల ఆ అనంత విశాలమునుండియే కదా యీ కిరణములు వచ్చుచుండుట యను తలంపు నా మనస్సరోవరమున పైపై తేలియాడుచుండెను.

తర్వాత ఒకకలత అంతట ప్రారంభమాయెను. హ్రస్వదృష్టియగుటచే, నేనేమియు చూడజాలకపోతిని, కాని ఏదో అసాధారణమగు విషయము జరుగుచున్నదని మాత్రము తెలిసికొంటిని. అతివేగముగ స్వారి చేయుచు, ఒక జేబు రుమాలును ఊపుచు మావైపు వచ్చుచుండు ఒక ఉద్యోగిని నేనుచూచితిని. మా నేరములు క్షమింపబడినవని ప్రకటించుటకు అతడు చక్రవర్తిచే పంపబడెను. తర్వాత మాకు విధింపబడిన మరణశిక్ష మమ్ముల భయపెట్టుటకును, ఇక మరచిపోగూడని ఒకపాఠము నేర్పుటకును ఉద్దేశింపబడినదని తెలిసికొంటిమి. ఈ పాఠముచే మాలో కొందఱము అతి ఘోరములగు ఫలితముల ననుభవింప వలసినవార మైతిమి. గ్రిగోరివ్ ఆ క్రమమండి విడువబడిన తర్వాతగూడ, తన ప్రాణమును హరింపనుండిన ఆ తుపాకి దెబ్బకొరకై కాచుకొనియుండినప్పటి భయకంపనముల చేత పిచ్చిమొత్తినవాడాయెను. అతని తుది అవసలోగూడ ఆ ఉన్మాదమునుండి విముక్తుడు కాజాలకపోయెను. మిగిలిన మాలో, ఆపాఠము యొక్క విషాదచ్ఛాయ జ్ఞానేంద్రియముల మీాద పడనివాడు లేడని నా భావన.

ఇదిగాక, మమ్ముల ఆ తూపుమానువద్దకు తీసికొనిపోయినప్పుడు, మా దుస్తుల వారు తీసివైచిరి. కేవలము ఒక జుబ్బాను ధరించి నీళ్లు గడ్డకట్టిపోవు శీతలముకన్న ౨౨ డిగ్రీలు (రోమర్) తక్కువయున్న వాతావరణమున ఇరువది నిముసములకు పైగ గడపవలసివచ్చెను. తిరుగ మేము చెరసాలకు వచ్చునప్పటికి, చాలమందికి చెవులు, వ్రేళ్లు మొద్దుబారిపోయినవి. ఒకనికి ఊపిరితిత్తులు ఉబ్బినవి. అదే క్షయవ్యాధి యొక్క ప్రారంభమాయెను. నేను మాత్రము ఆ చలియొక్క తీవ్రతను అనుభవించినటు లే నాకు జ్ఞప్తిలేదు.

మేము ఎనిమిది సంవత్సరములు సైబీరియాలో కఠినశిక్ష ననుభవింపవలసినటులును, తర్వాత చాల సంవత్సరములు ప్రవాసశిక్ష ననుభవింపవలసినటుల మామరణదండన మార్చబడెను."

బెజవాడ గోపాలరెడ్డి.







లీలాచంద్ర విన్‌స్లో కన్య

చెన్నపురి పెరంబూరునందు వైద్యురాలుగ నుండిన యీమె యిపుడు చెంగల్పట్టుజిల్లా సెంబియంలో గౌరవ మేజస్ట్రేటుగ నియమింపబడెను.




సి. కె. కౌసుకుట్టీ కన్య

ఈమె బి. ఏ. పరీక్షలో చరిత్రయందు ప్రథమముగ నుత్తీర్ణయయ్యెను.




## నూతన పట్టభద్రలు

మదరాసు విశ్వవిద్యాలయమున ఈ సంవత్సరము పట్టప్రదానసభయందు డిగ్రీలు పొందిన యువతులు.




## వైద్యవిద్యార్థినులు

చెన్నపురి వైద్యకళాశాలలోని విద్యార్థినులీచిత్రమందు కలరు. ఈ ఛాయాచిత్రము డా॥ భద్రప్పకన్య యను నామె ఉన్నత విద్యకై ఇంగ్లండునకు వెళ్లనుండుసమయమున కళాశాలవా రామెకు విందొసగి సమ్మానించిన సందర్భమున తీయబడినది. పుష్పమాలాలంకృతయై భద్రప్పకన్యయు, నామెప్రక్కన కర్నల్ హింగ్‌స్టన్‌గారు నిందు కలరు.



ఫెలిస మిస్ ఒఓసహాయిం కన్య

ఈమె చెన్నపురి రాజధానీ కళాశాలలో బి. ఏ. (ఆనర్సు) పరీక్షయం దుత్తీర్ణురాలయి డా॥ టి. యం. నాయరుగారి బంగారుపతకము బహుమతి నందెను.



కె. నాగరత్నం కన్య

గుంటూరుజిల్లా తెనాలి నివాసిని యగు నీమె కలకత్తా విశ్వవిద్యాలయమునుండి బి. యస్ - సి. డిగ్రీని పడసి లాహోరు (పంజాబు) విశ్వవిద్యాలయమునం దుపాధ్యాయినిగ నియమింపబడెను. ఇట్టి యుద్యోగమును పడసి దూరదేశము పోవనున్న యీ విదుషీమణికి గుంటూరు మిత్రమండలివా రీమెకు విం దొసగి సన్మానించిరి.



అన్నా టి మామెను కన్య

వైద్యమునందు ఎం. బి. డిగ్రీనంది గంగాధరం లక్ష్మీనారాయణమ్మగారి బహుమతిని పడసెను.




## మేఘసందేశము

భీమరాజు సత్యనారాయణరావుగారు

పైయుద్దిష్టకావ్యములో నొకశ్లోకంపుఁ బన ప్రయోజనము వ్రాయుటలో శ్రీమద్వేంకటరాయ శాస్త్రిులవారు కవిసమయము నొకానొకటిం బాటింపక పోఁబడిరని ఒకరు హెచ్చరింపఁగా దానిపైఁ గొంత కాలము వాదప్రతివాదములు రేఁగినవి. వానినెల్లం బరికింపఁగా నాకును ఆవిషయముపై నించుక చెప్పవలసినది కలుగుటచే ఈవ్రాఁత నుపక్రమించుచున్నాను.

యక్షుఁడు అలకావాసినిం బ్రేయసికిఁ దన సేమము తెలుప నుద్యోగించినవాఁడై దూత్యము పూనుమని మేఘుని బ్రతిమాలుకొన్నాఁడు; మఱియు నట్లు వేఁడికొనుటలో స్వార్థపరత్వముం దెల్లము సేయక ఆమేఘునకును అలకకుఁ బోవుమార్గమందుఁ బయనము విసిగించునది కాక అపేక్షణీయము, అనుభవనీయమును అయి కరము అలరించునదిగా నుండునని యెచ్చరించినాఁడు. ఈయెచ్చరిక ప్రాయికముగా పూర్వమేఘములో యక్షునివాక్యములందెల్ల వెలసియున్నది. విస్తరభీతిచే దాని నిట వ్రాయ నయితిని. జిజ్ఞాసువులు ఆగ్రంథమునం గన వచ్చును.

ఇఁక ప్రకృతశ్లోకముం జెప్పుటలో యక్షుని భావ మేమి? తక్కిన యక్షగదితశ్లోకములందు ఎట్టిభావమో—అనఁగా మేఘప్రలోభనరూపమైనది—అదే యుండును అవశ్యము కావలయును. ఇదియు యక్షుఁడు మేఘుని జెలిపించిన యొకానొక విధము. ఇందులకు ఇంచుక విస్తరము:—ఆ యక్షుఁడు, దారిపొడుగునను గల సౌఖ్యముల నభివర్ణించి మేఘుని ఉపచ్ఛందితుం గావించుకొని తనకార్యము సాధించుకొనఁ దలంచినవాఁడు, "ఓయి మేఘుఁడా, నీకుఁ గైలాసముదాఁక నుత్తములగు పక్షుల సహవాసము దొరకొనును. మిత్రగోష్ఠిలో నీకుఁ బయనంపు బడలిక తెలియదు. సుఖప్రయాణము సాగును. కాఁబట్టి నాప్రార్థన నెఱవేర్పుము" అని చెప్పినాఁడు; ఇట్లనుటచే మేఘునిపయనము అనపేక్షణీయము, అననుభవనీయమునుం గాక రాజహంసముల వంటి సజ్జనుల సహవాసముచే అతిమాత్రము అలరించునదిగా విలసిల్లఁ గలదు అని యక్షునిచే సూచింపఁ బడినది. కాళిదాసు ఆశ్లోకమును యక్షునిచేఁ బలికించుటలోఁ గల యభిప్రాయ మిది. ఇట్టిది కేకున్న అది అజాగళస్తన కల్పమగును. ఇందుచేఁ గాళిదాసుఁడు హంసమేఘవైరంపుఁ గవిసమయమును లెక్కింప లేదు గదా, మఱి ఆహంసమేఘములకు నెయ్యమునే నెక్కొలిపె నని స్పష్ట పడుచున్నది. ఇట్లు గాక కయ్యమే నిబద్ధ మందురేని, ఆపక్షమున అందు అనర్థముగాక అర్థమేమి పొసఁగును? యక్షుఁడు మేఘునితో "ఓయి మేఘుఁడా, నీవుఁ బ్రోవ పోఁడుగునను ఆజన్మశత్రువులు రాజహంసములు తోడుచచ్చునులే" అని యేల వాకొనును? ఆట్లైన మేఘుఁడు తనకు దారిపొడుగునను ఆజన్మవైరి సాంగత్య మలవడఁగలదని హర్షించి యక్షుని వేఁడుకోలు సలుపునా? మేఘుఁడు శాశ్వతికవైరము కల రాజహంసముల సహాయతకు హర్షింపనేల? లోకములో నెవ

లేని దీర్ఘప్రయాణములో స్వైరి † సయాత్రత్వమును సైఁతురా? శత్రువులు అధికులుకానీ, అల్పులుకానీ! వారిప్రసంగము ఎవ్వరికిని, ఎన్నఁడేకిని ఇంపు నింపదు. యక్షుఁడు అజ్ఞుఁడై సందర్భశుద్ధిమాలి మేఘునకుం బ్రియము పలుకక అప్రియము నగ్గలించి అఘునని దన యభ్యర్థనకుఁ బరాఙ్ముఖుంజేసి తన కార్యమును భంగ పఱుచుకొనఁడు. ఇదంతయుఁ బర్యాలోచించి చూడఁగా శ్రీకాళిదాసమహాకవి ఆకృత్రిమ కవిసమయంపుఁ బిశాచ మునకు ఇట్టి ప్రకృతిపేశలంపు టర్థస్వారస్యమును బలి నైన వొల్లక 'నిరఙ్కుశాః కవయః' అను న్యాయము రూఢికెక్కునట్లు, దానిని ఉల్లంఘించెనని తెల్లమగు చున్నది. ఇదే నా సిద్ధాంతము.

ఈ సిద్ధాంతమునకుఁ బ్రమాణాంతరముం గలదు. ఎట్లన,— మహాకవి, తన కభిమతములైన యుపమానము లను, భావములను పెక్కుడల నొక్కతీరుగానే వాఁడు కొన్నవాఁడు, నిజకావ్యనాటకములలో హంసమేఘ శాత్రవమును ఎటనుం జేర్కొనలేదు. ఆయనకు ఈ కవి సమయమే ఇష్టమేని, వేఱొండుచోనైన స్పష్టముగా వ్రాసికొని యుండఁడా?

మఱొకమాట.—ఇట్లు కవిసమయములం గొన్నిం టిని లెక్కిఁ గొనక వ్రాయుట కాళిదాసునకుం గ్రొత్త కాదు. ఇందుల కొక యుదాహరణమును [ఇది శ్రీ రామ దాసయ్యంగారు, యమ్., ఏ., యల్., టీ. చూపినదే] చెప్పెదను. లోకములోఁ గవులెల్లరు శీతలమారుతమును విరహోద్దీపకముగా వర్ణించి విరహులచే దానిని దెగడిం తురు. ఉదాహరణములు సంస్కృతాంధ్రకావ్యముల యందుఁ గోటానఁగోటులు. వానఁ గనవచ్చును. అట్లుండఁ గాళిదాసు అయోగదుఃఖితుఁడగు నగ్నిమిత్రునిచే (మాళ వికాగ్నిమిత్రమున)

"గొప్పపుట్టుక కలవాఁడసుమా వసంతుఁడు; వయస్యా, చూడుము.—

ఆమని జాలిమైఁ జెవుల
  కామెత యా మదకోకిలస్వనిన్
'గామరుజన్ సహింతువె స
  ఖా' యనివన్నను యుక్తి నల్పుచున్,
మామిడిపూలచేవలచు
  మారుతముల్ నెఱతోఁపఁజల్వతో
నా మెయిదక్షిణంపుఁగయి
  నానిడి తా నిమురున్ బలేయిటన్."

అని వసంతుని యాభిజాత్యమును, మలయవాతంపు సుఖ స్పర్శమును,—

అట్టివాఁడే యగుదుష్యంతునిచే (అభిజ్ఞానశాకుంతలమున)

" తమ్మి నూఁపి యూఁపి యిమ్మాలినీ తరం
గమ్ముఁ జోపి చోపి కమ్మ వలపుఁ
గ్రమ్మ వవను వలపుఁ గుమ్మటం గమ్ములఁ
గుమ్మి కౌఁగిలింప నెమ్మి నాకు."

అని మాలినీతరంగవాత సౌఖ్యమును— ప్రశంసిపించినాఁడు. మహాకవిసార్వభౌముఁడు, లోకాతి శాయిప్రతిభుఁడు వర్ణనవిశేషముకై స్వాతంత్ర్యము కొనఁగా, మఱి మనమా అడ్డపడువారము!

పెద్దలకు వేఱొక విషయమును విన్నవించె దను.—ఈ హంసమేఘద్వేషకవిసమయమును అతిక్ర మించుటలోఁ గాళిదాసునిది పొరఁబాటుకాదని వాద్య

† మూలములోని 'సహాయః' శబ్దార్థమును, వ్యాఖ్యలోని 'సయాత్ర' శబ్దార్థమును ఒక్కటే. 'సహాయ' శబ్దమునకు తద్విపరీతార్థకము 'సయాత్ర' శబ్దమును అర్థముగా వ్యాఖ్యాతృచక్రవర్తి యేల ఉపదేశించును? కనుక, అవి రెండును ఏకార్థబోధకములు, పర్యాయపదములు. వీనిలో తొలిదానిచే హంసమేఘములకు మైత్రి సూచింపఁ బడుచున్నదనుట నిర్వివాదాంశముగదా. ఇక రెండవదానిచే సైతము అదే తెలుపఁబడవలయును; అదే తెలుపఁ బడుచున్నదియు. కాన, మల్లినాథులవారికిఁగూడ హంసమేఘములకు మైత్రియే అభిప్రేతమని తేటపడుచున్నది. ఇందులకు తద్వైరమును వారు వ్యాఖ్యానమునం దిడనమియే గొప్పసాధకము.

మాభిప్రాయము. ఏలన, ఈ మర్యాద కాళిదాసునకుం దర్వాతి సంస్కృతాంధ్ర కవులచేఁ బాటింపఁబడినది. అంతేకాని కాళిదాసుకంటెం బూర్వుల కావ్యములలో నిది యున్నట్లు కాన్పింపదు. ఎందేని యున్నను— [‘జలధర గర్జితభీతసారసీకః’— ‘హంసా నదన్మేఘభయాత్ ద్రవన్తి’ అని రెండు ప్రయోగములు నాకు గోచరించినవి. వానియందు వైరము కంఠోక్తము కామిచే అవి దానికి సాధకములు కావు. వాన మేఘగర్జాభయముచే హంసములు పఱచె నని మాత్ర మున్నది. శత్రువులు కాని వారును ఒండొరుల యఱపులకుఁ దటాలున నులికిపడి ఇంచుక వెఱచి పాఱవచ్చును. కాఁబట్టి వీనిచే హంసమేఘములకు ఏకాంతముగా వైరము సిద్ధింపదు.]— అందు అది కంఠోక్తముగా నిబద్ధము కామినో, కంఠోక్తముగా నిబద్ధ మయ్యును అట్టి ప్రయోగములు విరళవిరళము లగుటనో, ఆ యతివిరళంపుఁ బ్రయోగములను మహాకవి దృక్పథమునం బడకుంటనో, దృక్పథమునం బడినను సర్వస్వతంత్రుఁడు నిరంకుశుఁడు కాళిదాస మహాకవి ఆ కృత్రిమకవిసమయమును బాటించిన మాత్రానఁ గావ్యేందిరకు ఏమి మహాశోభ కలుగును లే అని అనాస్థతో దానిని ఒప్పరికించి యుజ్జగించి యుండనోపును. అట్లు కాక దానియందే గౌరవ ముండి అదే వాఁడుకోఁ దలంపని నిజప్రబంధములలో నొక్కఁడనేని దానియుసు నెత్తఁడేల? ఇఁక కాళిదాసు తనకుం దర్వాతివా రగు సంస్కృతకవులయు, ముఖ్యముగా నాంధ్రకవులయుం బ్రయోగములం జదివికొని, అందున్న చొప్పునఁ గవిసమయమును మహాప్రసాదముని అందికొని కన్నుల నద్దికొని తనదిగా వ్రాసికొనమియు ఆతని దోషమే యగునా? కాకున్న అట్టివారి ప్రయోగముల నొక్కచోఁ జేర్చి కవిసమయమో అని ఘోషపెట్టనేల? ఇది నిజముగా వింతలో వింత!!

తుదకు నాకుం దోఁచిన సిద్ధాంత మిది: కాళిదాసునకు ఆ హంసమేఘ వైరంపుఁగవిసమయము పాటింపఁ దలంపు లేదు. ఉన్నను,— ఇది ఊరక తమాషాకు ఒప్పుకొందును— దానిని ప్రకృతపు మేఘసందేశశ్లోకమునందు, తొలుదొల్త తెలిపిన కారణములచే, దోఁపఁబని లేదు.

ఇవెల్ల సూక్ష్మదృష్టితోఁ బరికించిరే ఆమహాపండితులు రసజ్ఞశేఖరులు కవివతంసులు ఆంధ్రవల్లినాథులు శ్రీ మహామహోపాధ్యాయ కళాప్రపూర్ణ వేదము వేంకటరాయశాస్త్రి పాదులవారు కాళిదాస హృదయానుసారముగ, మల్లినాథసంజీవన్యభిమతముగా కడు మెలఁకువతో ఆ శ్లోకమునకు [illegible]జనాదికమును అస్మాదృశ విద్యార్థి తారకముగా, హృదయంగమముగా వెలయించియున్నారు. అది సర్వము అనవద్యమే, ఉపపన్నమే.

నాకు వక్తవ్యము ఇది. ఎల్లను పెద్దలకు విన్నపము చేసికొంటిని. నిర్ణయాభ్యుపగమమునకు మత్సరగ్రస్తులు కానివారు, రసికులు నగు విద్వజ్జనులే ప్రమాణము.

---




## నెపోలియన్ బోనోపార్టి

ప్రథమభాగము. గ్రంథకర్త: జయంతి వెంకట జగన్నాథరావు గారు, బి. ఏ., యల్. టి., బరంపురము (గంజాం). క్రౌనుసైజు ౯౩ పుటలు.

జగద్విఖ్యాతి గన్న పురుషశ్రేష్ఠులలో నొకడగు నెపోలియను జీవితచరిత్రమును సంగ్రహముగ అభ్యుదయము, రాజకీయము, పతనము అని మూడుభాగములుగ వెలువరుపనెంచి శ్రీ జగన్నాథరావుగారు తొలుత నీ భాగమును ప్రకటించిరి. ఇది ముఖ్యముగ విద్యార్థులకై యుద్దేశింపబడినది. భాష సులభము. కథనమున తగు నడక యున్నది. ప్రయోగదోషములు మెండు. అన్వయము నొక్కొక్కచో దుష్టము. ఒకచో 'మేన్టువా', వేఱొకచో 'మ్యానటువా', మఱొకచో 'మాంటూవా', ఇట్లొకపేరునే (Mantua) వేర్వేఱురీతుల వ్రాయుట విద్యార్థులకు అయోమయము గూర్చును. జ్యాకొబిన్ మున్నగువారలగూర్చి సందర్భానుసారముగ కొంచెము పరిచయ మొసంగినచో విద్యార్థులకు కథనము సుబోధమగును. 'ఈమహానది [నైలునది] ప్రవహించుదేశమందు నీలిమం దధికముగా పండుచుండుటచే నార్యులు దీనికి తొలుదొల్త నీలినది యని నామమిడిరి.' (పుట ౬౮.) ఈ సిద్ధాంతకల్పన మేమో తెలియకున్నది. కథాధోరణిలో నడుమ నడుమ వర్ణనాంతరములు, వ్యాఖ్యానములు నొక్కొక్కచో అనావశ్యకముగు సంతరము గూర్చుచున్నవి. ఇందు ప్రతిపాదితమైన చరిత్రము విలువ గలది. సంగ్రహత్వముచే నిది బాలుర కుపయోగకరము. మంచిభాషాపరిచయముతో విద్యార్థుల నిమిత్తము గ్రంథరచన గావించుట యుక్తము. కొం. జ.

## సత్యసామ్రాజ్యము

కర్త: నవ్వాంతేటి రఘూత్తమాచార్యులుగారు. వెలకు దొరకు స్థలము: శ్రీ రామముద్రాయంత్రశాల, కుప్పం పోష్టు, చిత్తూరుజిల్లా. డెమ్మి 1/16 సైజున 76 పుటలు. వెల ౮ అ.

దీని పేరువలననే సూచితమగుచున్నట్లిది 'ధర్మ' సంబంధమగు నొక చిన్నిపుస్తకము. కొంచెమెక్కువ తొందరపడుచున్నట్లున్నను, యువకుడగు నీ గ్రంథకర్త యుక్తిరచన మేలుకొలుపుచున్నట్లు నిక్కముగ సత్యాన్వేషకుడే. ప్రమాణగ్రంథములు, మతగురువులు, తత్త్వశాస్త్రములు-వీనియొక్క సాయములేకయే సత్యార్థి ధర్మపథమున నడచి తన జీవితమును విశ్వజీవనముతో నైక్యమొనర్చుకొని ధన్యత గాంచగలడనియు-సాధనయే మార్గమనియు నీ జిజ్ఞాసువు తెలుప ప్రయత్నించుచున్నాడు. సత్యమే ఏకమాత్రజీవమనియు, దానినుండియే వివిధజీవులు జీవనము పొందెననియు, సర్వజీవైక్యజ్ఞానమే సత్యబోధయనియు నిందు మూలమున తెలియవగును. సాధనకు విశ్వాసమే మూలాధారమనియు వక్కాణింపబడినది. అద్వైతమును సూత్రప్రాయముగ నిత డిందు సూచించెను.

అక్కడక్కడ వెదచల్లబడినట్లు మంచి మంచి వాక్యములు, సత్యములున్నను మొత్తమున నీరచన సంపూర్ణత గనలేదు. విషయవిభాగమును, వివరణమును, సరియైన పరిసమాప్తియు నిందు లోపించినవి. ఇట్టి విషయములపై గ్రంథముల వ్రాయ మొదలిడుటకుముందు యువకు లింకను యోగసాధనచేసి తమ భావతీక్ష్ణతకు తగు

రచనాపటిమను, వ్యక్తీకరణ సౌష్ఠవ సౌలభ్యముల వల నరచుకొనదగుదురు. జ. బ్ర.

### ఆవేదన

గ్రంథకర్త: శ్రీ శివశంకరశాస్త్రిగారు, తల్లావజ్ఝలవారు, గుంటూరు—తెనాలి. క్రౌను ౧౬ సైజు. ౬౧ పుటలు. వెల ౧ అ.

ఇది కొన్ని కావ్య 'ఖండిక'ల చిన్న సంపుటము.

అన్ని కావ్యాలూ ప్రణయమునంటి ఏదో ఒక్క ప్రవృత్తికి చెందినవి కాక భిన్నప్రకృతికముగా ఉన్నవి. ప్రతికావ్యములోనూ ఒక ఆవేదన కనబడుతుందనే చెప్పవచ్చు. వివిధవిషయాలంబనములైన 'ఆవేదన'ల కూర్పు ఇది.

ఈ కావ్యాలలో కొన్ని పరోక్షికములూ, కొన్ని వివేక్షికములూను. 'స్వవిషయము'లో చెప్పినట్లు, "పద్యాలలో కొన్ని ద్విపాత్రులూ, కొన్ని త్రిపాత్రులూను",—చతుష్పాత్రులే కాక. వీరి నూతనప్రియత్వమూ, సంస్కరణాభిలాష అందముగా వసంతతిలక మొదలైన కొన్ని సంస్కృతవృత్తాలను తెలుగులో ప్రతిష్ఠించినవి. క్రొత్తవృత్తాలలోను, గేయకల్పచ్ఛందస్సులోను వీరి మృదువాణి పెక్కుతావుల అలంకృతమైనది. 'స్వవిషయము'లో కవిగారే తెల్పినట్లు, "రచనలో సాహసము" ఒకవిధమైనది కనబడుతుంది. తమగ్రంథము తామే విమర్శిస్తూ, పైవారివలె, (కవినిగూర్చి) "కొంత వాత్సల్యము, కొంత అభిమానము, కొంత సహనమూ ఉండడముచేత వందపోసముచేసి సహృదయులకు అంజలి ఘటిస్తున్నాను." అని (అర్థలోపము సహృదయులు పూరించుకొందురు) ముగించేవారు,—'శివశంకరశాస్త్రి'గారే. తమ కావ్యముకొలదులు తామే ఉగ్గడించుకోడమూ నూతనత్వమే. (అయితే గ్రంథము పట్ల యథార్థవిమర్శవాక్యాల స్వార్థమే ప్రధానము, అవి రొనెరుచెప్పినవైనాను.) ఇట్టి నూతనత్వమే వీరి సాహసము. గ్రంథములో "నవీన కల్పనలు ఏపాటి అంటే" తిరిగి, 'స్వవిషయము'లో చెప్పినట్లు, "కొద్దిపాటి". ఆ "పాటి" నిరూపించడానికి పాఠకుడు ప్రయత్నిస్తే, "పుష్కరమైన కవితాసామగ్రిలో చేరవకాక్షి" కవి (కావ్యరచనలో) ఉపయోగించడము కనబడుతుంది. ఇట్టివి విడిస్తే, భావసామగ్రిలో గొప్పనూతనత్వమూ, సాహసమూ కవిగారి ప్రతిభకు అత్తలేదు. ప్రతినత్వములో కవి అభిమానమూ, ప్రయత్నమూ కేంద్రీకృతములు కావు.

కవితలో కడిపి పుటాపే ఆవేదన లేదు. స్వప్నసంధాయి అయిన విలాసమూ లేదు, అనుభవశుద్ధి ఉన్నది; కాని భావనలో లోతు, విస్తృతి లేవు. రచనలో సౌకుమార్యము, మాధుర్యము, ప్రసాదము ఉన్నవి; ఓజస్సు, కాంతి తక్కున.జవమూ, ప్రౌఢిమమూ లేక అలసమై సౌమ్యముగా ఉన్నది. శిల్పనైపుణి భావనలోవలెనే రచనలోనూ కవిప్రయత్నానికి పాత్రము కాలేదు. కవిగారు తమఅనుభవమును నిర్మలభావరంగములో స్ఫురింపజేస్తారు: దాని నిగ్గు చూపి పరిపూర్తి కలిగింపలేరు. ఒకఅవస్థ, శైలి అవలంబిస్తారు: ఆ అనుభూతిని రసతన్మయతతో, ఉల్బణభావసామగ్రితో ప్రపంచించి, కరిగి కరిగింపజాలరు. వీరికి భావదర్శనము అల్పము, తత్ప్రదర్శనము అల్పతరము. ఈ కవి ద్రష్ట కాడు.

దీనిలో కొన్ని కావ్యాలలో తెలుచు శోకవాఙ్మయము పోకడలు నిర్విశేషముగాను, ఈషద్విశిష్టముగాను గోచరిస్తవి.

"........రాధానాథపాదద్వయీ
స్మరదుద్దీప్తికి తుల్యవైభవము నె
చ్చోట్ల గానస్థితింగదా."
" నీ సుధామధుర నామకీర్తనము
నిరతము సలిపెడివారల
ఆర్తిహరా, దుఃఖార్ణవ పారగు
లౌ టబ్బురమే దేవా!"—

ఈశ్వరభక్తి ఉత్కృష్టమని పెక్కురితోపాటు వీరూ అనుభవముతో తెలిపేవారు,—ఛందోబద్ధముగా.

ఎన్నో పద్యాలున్న కావ్యములోను ఒకటి రెండు పద్యాలుమాత్రమే కవి ప్రధానభావానుభవమును తెలియజేసేవి. తక్కినదంతా ఆ అనుభవము ఏ పరిస్థితులలో కలిగినదీ అనావశ్యక విశేషాలతో తెలిపే కథాకథనము. కలిగిన అనుభవమైనా సామాన్యము: ఉన్నతానుభూతులు లేవు. ఆ ఒకానొక అనుభూతికి ఒకజీవి అగ్గమాతు

న్నాడనే మనకు తెలిసేది: ఒకకవి అది అనుభవిస్తున్నాడని కాదు.

"నేను రమ్యమైన మార్గాన వెళ్లుతూ కొందఱు వ్యాధబాలకులు ఒకఉడుతను పట్టుపెట్టి ఉల్లసిల్లడము చూచేరను. తర్వాత వెళ్లుతుంటే,—

పోవంజొచ్చితి సాగి, కూసె విహగం
బుల్ శ్రావ్యనాదంబులం
బూవుల్ రాలెను, గాలి వీచె, నయినం
బోరెన్ ముదం బంతయున్."

అని ఒకకావ్యార్థము. నాటి ప్రభాతవేళ తాను "సుధాసమాన మగు కాఫీ గ్రోలి... షికార్ పోవన్" లేవడము మొదలు కావ్యము ఎనిమిది పద్యాలలోనూ కవి నిరూపించిన ప్రధానార్థము ఏమీ ప్రౌఢముకాదు. కావ్యత్వమూ, రసమూ తక్కువ అని కవిగారు సమంజసముగా స్వీకరించేరు—అయినా ఇవి ప్రకటించేరు కాని. వీరు సూక్ష్మార్థపరులు—సూచనామాత్రమే వీరికి ఇష్టము—అంటే, అటువంటి ఆశయానికి అంత పరిసరదర్శనము అసమన్వితమౌతుంది. పదగుంభన తక్కువ; ప్రయోగసార్థకత ఒక్కొక్క చోట సందేహాస్పదము. కథనకవిత, భావకవిత రెండూ అవిరళముగా కలిసి ఉంటవి దీనిలో. కవి మనస్తత్వము ద్వారము చేరుతాడు: ప్రదక్షిణము చెయ్యగలడు; కాని ప్రవేశించి, వెలుగుపెట్టుకొని పరిశీలింపలేడు. అథవా, నిరూపించలేడు. కళాలోకానికి ఈ రచనవల్ల ప్రబోధము, సందేశము శూన్యములు. రమ్యమనదగు శైలిలో నిర్మలసులభములైన భావాలు పొందించినపద్యకావ్యాలు దీనిలో ఉన్నవి. అయితే, భావబంధురత్వమూ, కళావిలాసములో కరిగించి కూర్చేసారస్వత నిర్మాణాలకు ఉత్సుకపడే అభిరుచికి ఇది తనివితీర్పదు.

"అధ్వానమున్ జేరితిన్"—(పుట ౫౯.) "అధ్వాన" మంటే "అమార్గ" మని నిఘంటు. అమార్గానికి ఇక్కడ ప్రయోజనములేదు. మార్గము అనే కవి ఆశయము. వెనుక వెనుక త్రోవ, మార్గము అని ఆ అర్థములోనే కవి ప్రయోగించి ఉన్నాడు. వేఱొకచోట పక్ష్మార్థమందు పక్ష్మలము ప్రయోగించి ఉన్నాడు. (పుట ౫౦.)

శబ్దసౌష్ఠవము పాటిస్తారు వీరు. మంచిధార వీరి కవితకు ఒకలక్షణము. తను పరిమితప్రతిభను వీరు మనశ్శుద్ధిగా, వడిదుడుకులేక, వినియోగపఱచి, కావ్యానికి ఒకశ్రుతి, ఒకసమ్మేళనము సంఘటిస్తారు. ఇంత సాహసమూ, నూతనత్వమూ, రచనాగుణములూ ఉండీ, ఈ 'ఆవేదన' సారస్వతముపట్ల ఉత్తేజనము కాని,—చెప్పనే అక్కఱలేదు,—ప్రోద్బలము కాని చలాయించుకోలేదు.

కొం. జ.

---

# స్వీకారము

## మోహిని

గ్రంథకర్త: కాకులపాటి గురుమూర్తిగారు. ఐదంకముల నాటకము. డెమ్మీ సైజు ౯౬ పుటలు. వెల రు. ౧. వలయువారు:— కాకులపాటి కృష్ణమూర్తిగారు, సెక్రెటరీ, శ్రీ బుద్ధిరాజు సుబ్బమాంబ స్మారకనిధి, విజయనగరము (విశాఖపట్నం జిల్లా)—అని వ్రాయవలెను.

## ఇప్పుడు

గ్రంథకర్త: భమిడిపాటి కామేశ్వరరావు గారు, రాజమండ్రి. 'ప్రదర్శనత్రయం'. క్రౌను ౧౩౬ పుటలు. వెల ౮ అ.

## అభినవాంధ్ర వాసవదత్త

గ్రంథకర్త: ఉప్పల నరసింహ శర్మ గారు, నాయుడుపేట, నెల్లూరు జిల్లా. శ్రీ వట్టిపల్లి నరకంఠీరవ కవికృత సంస్కృతగ్రంథమునకు తెలుగుచేత. క్రౌను సైజు ౫౬ పుటలు. వెల ౮ అ.

## ముకుందమాల

ఆంధ్రీకర్త: మాడభూషి మఠం వేంకటాచార్యులు గారు, తిరుపతి. మూలముతో సహా. క్రౌను ౨౪ పుటలు. వెల ౨ అ.

### కల్యుపాలంభము

పై గ్రంథకర్తదే. పద్యములు. క్రౌను ౧౧ పుటలు. వెల ౨ అణాలు.

### ధన్యమణిహారము

రచయిత: శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారు, బి. ఏ. టీకాతాత్పర్యరచయిత: కూశా విశ్వనాథశాస్త్రి గారు, పచ్చయప్ప కళాశాల తెలుగుపండితులు, చెన్నపురి. వెలలేదు. 1½ అ. తపాలబిళ్ల పంపి, 'యస్. బి. శ. పబ్లిక్ లైబ్రరీ, పాపనాయనిపేట (రేణిగుంట)' అని వ్రాసి ప్రతి పడయవచ్చును.

### బాష్పబిందువు

గ్రంథకర్తలు: వేంకటకాళిదాసకవులు, ఆంధ్ర గీర్వాణ సాహిత్య పరిషత్తు, విజయనగరము. 'పూజా పుష్పములు: ౩'. పద్యకావ్యము. క్రౌను ౫౪ పుటలు. వెల రు ౧.

### భారతీయప్రబోధము

గ్రంథకర్త: సాయం వరదదాసు గారు. ప్రకాశకుడు: గద్దె లింగయ్య చౌదరిగారు, యలమర్రు, కృష్ణా. పద్యాలు, పాటలు. క్రౌను సైజు. ౧౬ పుటలు. వెల ౩ అ.

### Trilochana Pallava, Karikala Chola
### త్రిలోచనపల్లవుడు, కరికాలచోళుడు

గ్రంథకర్త: డాక్టరు యస్. వెంకటరమణయ్య గారు, యం. ఏ., పి-హెచ్. డి. డిమ్మీసైజు ౧౨౦ పుటలు. (వెల తెలియదు.)

ప్రకాశకులు: వావిళ్ల రామస్వామి శాస్త్రులు అండు సన్సు, ఎస్ప్లనేడు నెం. ౨౯౨, చెన్నపురి.

Murugan the Tiller నవల (ఆంగ్లము). గ్రంథకర్త: శ్రీ కే. యస్. వెంకటరమణి గారు. క్రౌను సైజు ౩౩౬ పుటలు. అందమయిన బైండు. వెల ౨ రూ. ప్రకాశకులు: శ్వేతారణ్యాశ్రమము, మైలాపూరు, చెన్నపురి.

### గంగావతరణము

గ్రంథకర్త: సోమరాజు రామానుజరావు గారు. ప్రకాశకులు: కురుకూరి సుబ్బారావు గారు, సరస్వతీ బుక్కుడిపో, బెజవాడ, కృష్ణాజిల్లా. ఏడంకముల నాటకము. డెమ్మీసైజు ౧౧౭ పుటలు. వెల రు. ౧-౭ అ.

### పంచమహాపాతక నిషేధము

గ్రంథకర్త: జీవపనీని సూర్యనారాయణ రాజు గారు, భల్లునగటూరు, పెనుమంత్ర పోష్టు, పశ్చిమగోదావరి. పద్యగ్రంథము. డెమ్మీసైజు ౨౪౦ పుటలు. వెల ౧౫ అ.

### మాయోపాయమారణము

ప్రథమభాగము. బ్రహ్మానంద నాగభూషణం గారు. 'కాసరనేని సుబ్బారావు చౌదరిగారు, బోర్డు బాలికా పాఠశాల హెడ్‌మాష్టరు, క్రాప, కొల్లూరు పోష్టు, గుంటూరు జిల్లా' అను విలాసమున ప్రతులు లభించును. క్రౌను సైజు ౩౫ పుటలు. వెల ౪ అ.

### సీతారాముల పాటలు

గ్రంథకర్త్రి: గుడిపూడి ఇందుమతీదేవి గారు. 'గుడిపూడి రామారావు గారు, గాంధీనగరు, బెజవాడ' అను విలాసమున ప్రతులు లభించును. డెమ్మీ సైజు ౬౨ పుటలు. వెల ౭ అ.

### స్వప్నసందర్శనము

గ్రంథకర్త: శ్రీ రాజా వత్సవాయ వేంకట నీలాద్రిరాజుగారు, తుని. పద్యములు. చిన్నసైజు ౧౬ పుటలు. వెల ౨ అ.

### సంతాన నిరోధము

గ్రంథకర్త: జనుమిల్లి సాంబశివరావుగారు, బి. ఏ., ౩౬, అక్బరుసాహేబు వీధి, ట్రిప్లికేను, మదరాసు. క్రౌనుసైజు ౫౨ పుటలు. వెల ౭ అ. సంతాన నిరోధ వాద ఖండనము.

## బక్సారు యుద్ధము

గ్రంథకర్త: మొసలికంటి సంజీవరావు గారు, విశాఖపట్టణము. క్రౌను సైజు ౭౩ పుటలు. వెల ౧౧ అ. ఇది ఆంధ్రసంజీవినీ గ్రంథమాల ౫-వ కుసుమము. ఇది యొక్క చారిత్రిక గ్రంథము. ఇందు 'ప్లాసీ' యుద్ధము మొదలు 'బక్సారు' యుద్ధమువరకు జరిగినవిషయము లన్నియు సమగ్రముగ వర్ణింపబడియున్నవి. ప్లాసీ యుద్ధము మూలమున ఆంగ్లేయులకు రాజ్యసంపద లభించెను, బక్సారు యుద్ధముమూలమున అది వారికి స్థిరపడెను. అందుచే నిది ఆంగ్లేయులు బంగాళా దేశమును జయించిన కథయొక్క సమగ్రవర్ణనము. ఇందు కర్త సత్యము సేమాత్రము తప్పలేదు. ఆంగ్లరచయితల వాక్యముల నందందు సూచించిరి.

## ఆగ్నేయాశుగములు

11-౬-21, 6-7-21 తేదుల 'యంగ్ ఇండియా' పత్రికలలోని పాల్ రిచర్డుగారి Arrows of Fire, The Barbarians, The Vanquished అను ఇంగ్లీషువాక్యరత్నములకు సూచి నరసింహముగారి తెలుగు పద్యములు. జేబులో నిమడు చిన్నసైజున ౧౩ పుటలు.

యమ్. యస్. శాస్త్రి అండ్ సన్స్, వ్యాసకుటీరము, మేలుపాక (విశాఖపట్నంజిల్లా)కు ౦-౧-౬ తపాలబిళ్లలు పంపినచో ప్రతి లభింపగలదు.

## ఆంధ్రమహాపురుషుల జీవితములు-౧.

### ఉచితము

"వ్యాసకుటీరము," మేలుపాక (విశాఖపట్నం జిల్లా).

నూరుమంది "భారతి" పత్రికాపాఠకమహాశయులకు పైశీర్షికగల ప్రచురణము ఉచితముగ పంపబడును. కుతూహలముగల చదువరులు అక్టోబరుమాసములోగా ఒక అణా పోస్టుబిళ్ల నంపుచు, చిరునామా స్పష్టముగ తెలుపవలెను. ఒకొక్కరికి ఒక ప్రతికంటె నెక్కువ పంపను వీలు లేదు. ఈ ద్వితీయముద్రణప్రతులు (ఒక చిత్రపటములో) కొద్దిగనే మిగిలియుండుటచే నర్థులు త్వరపడవలెను. నిలయమువారు కార్యకర్తపేర వ్రాయవలెను.



# ఆంధ్రాభ్యుదయము

## బిరుద ప్రదానము

ఇటీవల నాంధ్ర దేశమున తఱచు సభలు, పరిషత్తులు, కాకున్న నెవరో కొందరు గలిసిన చిన్న సంఘములు ఎవరికేని, ఏవేని బిరుదముల నిచ్చుట పరిపాటి అయినది. ఈబిరుద ప్రదాతల చేతులకు ఎముకలు లేవనుట సత్య దూరము కాదు. ఇవ్వనిలోభినే పలుపు రాశ్రయించుచుండ ధారాళముగా నిచ్చుటకు నడుముగట్టినవారికి ప్రతిగ్రహీతలు కోట్లకొలదిగ లభింతురు. ఇచ్చువారు పుచ్చుకొనువారికిగల అర్హతలను పరీక్షించి సముచితములగు బిరుదములతో వారిని సన్మానింపవలెను. పుచ్చుకొనువారును తగుదుమని తలయొగ్గక తమ కట్టిబిరుదమును వహింపదగిన సామర్థ్య మున్ననే కాని స్వీకరింపదగదు. ఇట్లు కానిచో బిరుదములు వినోదమాత్రము లగును. దీనిని గుర్తించి బిరుద దానాదానములు జరుగుట లెస్స.

ఈ సంవత్సరమున విజయనగరమున జరిగిన సభలలో బిరుదములను బడసినవారు సుప్రసిద్ధులు. వీరు వడసిన బిరుదములకు వీరు ఎంతయు దగుదురు. ఇచ్చినపరిషత్తులు తగినవి. ఇట్లు సంస్కృష్టములయిన బిరుదములు వాంఛనీయములు; గౌరవాపాదకములును. వీరి చిత్రము లీక్రింద ముద్రితములయినవి.

### పదియవ ఆంధ్రసారస్వతమహాసభ
### విజయనగరము

(౨౮, ౩౦-౫-౧౯౨౮)

అధ్యక్షులు మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిగారు.

ఈ సభయందు బిరుదములను బడసినవారు:



౧. శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారు—విమర్శకాగ్రేసర బిరుదాంచితులు.

ప్రథమాంధ్ర సంగీతపరిషత్తు
(౨౯, ౩౦-౫-౧౯౨౯) విజయనగరము
అధ్యక్షులు సంగీతవిద్వాంసులగు
శ్రీ పారుపల్లి రామకృష్ణయ్య గారు.
ఈ పరిషత్తున బిరుదముల నందినవారు



౨. శ్రీ వడ్డాది సుబ్బారాయడుగారు_కవి శేఖర బిరుదాంచితులు.



౧. శ్రీ ద్వారం వెంకటస్వామినాయడుగారు—
'సంగీత విద్యావిశారద' బిరుదాంచితులు.



శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగారు_మహోపాధ్యాయ బిరుదాంచితులు.



[౪. శ్రీ కవి పరు...స్వామిగారు—]

౩. శ్రీ మలుగు శివానందశాస్త్రిగారు—
వీరిరువురు 'వైణికశిఖామణి' బిరుదాంచితులు.




శంకరశాయన్నవర్మాగారు

వీరు బొంబాయియందు స్థిరపడిన ఆంధ్రప్రముఖులు. బొంబాయినుండి ప్రచురింపబడుచున్న తెలుగు సమాచార్ పత్రికాసంపాదకులు.




శ్రీ గోగినేని వెంకటప్పయ్యచౌదరిగారు

వీరు గుంటూరు మండలమునందలి నిడుబ్రోలు వాసులు. శ్రీ అంకినీడుగారి కుమారులు. చెన్నపురమునందలి లయోలాకాలేజిలో ఇంటరుమీడియేటు చదివి ౧౯౩౬ డిసెంబరులో గ్రేటుబ్రిటనుకు పోయినారు. అచట లండనువిశ్వవిద్యాలయమునకు చేరిన కింగ్సుకాలేజిలో భూతత్వశాస్త్రమున (Geology) బి. యస్‌సి. పరీక్షకును, మైనింగు జియాలజీ పరీక్షకును, బారిష్టరు పరీక్షకును చదువుచున్నారు.

## ఒక సవరణ

వెనుకటి సంచిక ౩౧౩-వ పేజీలోని బొమ్మలక్రింద పేరులు ఒకటి కొకటి పొరపాటుగా పడినవి. మొదటి బొమ్మక్రింద శ్రీ వి. యన్. భూషన్‌గారు, రెండవ బొమ్మక్రింద డాక్టరు, బి. ఆర్. రామలింగ రెడ్డిగారు, యం. ఆర్. సి. యస్., యల్.ఆర్. సి. పి. (లండను) అని చదువుకొనవలెను.

---

# సాభిప్రాయవిశేషములు

ప్రపంచమునం దంతటను పరిస్థితులు మహా పరివర్తనమును బొందుచున్నను భారత దేశపరిస్థితులు మాత్రము మందగమనమును జేయుచున్నవి. గ్రేటుబ్రిటనునందు లేబరుప్రభుత్వము మూడుమాసములందు కన్సర్వేటివు ప్రభుత్వము మూడేండ్లయందు జేయలేని ఘనకార్యములను జేయగలిగినది. లేబరుపక్షము నాక్షేపించిన కన్సర్వేటివుపక్షాభిమానులందరును కన్నులను తెరచి యథార్థమును గ్రహించుచున్నారు. ఆయుధవిసర్జనమునకై రామ్సె మాక్డొనాల్డుగారు చేయుచున్న ప్రయత్నములు సంస్తవనీయముగ నున్నవి. అమెరికా ప్రతినిధియైన జనరల్ డాయిస్‌గారును, మాక్డొనాల్డుగారును చేసిన యోచనలను కార్యరూపమును బొందింప జేయుటకు రాగలమాసమునందు మాక్డొనాల్డుగారు అమెరికా సంయుక్తరాష్ట్రములకు బోవుచున్నారు. జీవయాత్రయందు గల కష్టనిష్ఠురములను స్వయముగ ననుభవించిన రామ్సెమాక్డొనాల్డుగారును, ప్రెసిడెంటు హూవరుగారును ప్రపంచప్రయోజనములను స్వార్థలక్ష్యముతోను, సామ్రాజ్యాభిమానముతోను గాక మానవధర్మలక్ష్యముతోను, శాంతిలక్ష్యముతోను నవలోకింపగలరని వారి ప్రవృత్తులు విశదము చేయుచున్నవి.

ప్రజలన్నాతురులై పరితపించుచున్నను దేశసంపదలను ప్రజాపోషణమునకును, క్షేమమునకును గాక ప్రజానాశనమునకును, ప్రజాకలహములకును వినియోగించుట మహాఘోరముగ నున్నది. ఈ ఘోరమును బాపుటకు రామ్సెమాక్డొనాల్డుగారును, హూవరుగారును జేయనున్న ప్రయత్నములు స్వప్రయోజనపరాయణములు గాక శాంతిపరాయణములై లోకకల్యాణమునకు వినియోగపడుటకు శాంతమూర్తియైన భగవంతుడనుగ్రహించుగాక! అమెరికా సంయుక్తరాష్ట్రములును, గ్రేటుబ్రిటనునుకలిసియుద్ధప్రతిషేధమునకును, శాంతిస్థాపనమునకును దీక్షను బూనినపుడు పరాధీనజాతుల స్వాతంత్ర్యమును, చిన్నిజాతుల స్వాతంత్ర్యమును సుసాధ్యములు గాగలవు. కాని శ్వేతజాత్యభిమానపూరితమైన శ్వేతరాజ్యయుగమునందు మానవధర్మప్రతిపాద్యమైన కృతయుగోదయము దుర్లభముగ గనుపడుచున్నది. మహోదయమునకు సాధనమైన సంధిసమయమునందు ప్రశాంతమూర్తియైన పరమేశ్వరానుగ్రహము విశ్వకల్యాణమునకు శరణ్యముగ నున్నది.

* * * *

లేబరు ప్రభుత్వము

రామ్సెమాక్డొనాల్డుగారు చూపుచున్న విశాలలక్ష్యమును స్నోడనుగారును, హెండర్స

ను గారును చూపుట ప్రపంచశాంతికి సాధనభూతముగ నున్నది. హెండర్సను స్నోడనుగారల నాక్షేపించిన చర్చిలుగారు వారి రాజ్యనీతి నభినందించుట కార్మికపక్ష విజయమును చాటుచున్నది. హెండర్సనుగారు ఈజిప్టు దేశమునకు స్వాతంత్ర్యము నంగీకరించి ప్రపంచశాంతికిని, మానవస్వాతంత్ర్యమునకును దోహదము నొసంగిరి. హెండర్సనుగారు జర్మనీ నుండి బ్రిటీషుసైన్యముల నిర్గమనము నంగీకరించి జర్మను దేశమునందును, యూరపు రాజ్యములందును శాంతిస్థాపనమును సాధ్యము చేసెను. మాటలకును, చేతలకును గల సంయోగమునందు ధర్మస్వరూపము ప్రత్యక్షమగుచున్నది. మాటలత్రోవను మాటలు, చేతల త్రోవను చేతలు పోవునపుడు ధర్మస్వరూపము దురారాధ్య మగుచున్నది. స్నోడనుగారు సంగ్రామనష్టపరిహారములవిషయమై పట్టినపట్టు పొందిన విజయము స్నోడనుగారి ప్రతిభను, కార్మికపక్షప్రతిష్ఠను, బ్రిటీషు రాజ్యగౌరవమును, హేగుసమావేశపు ప్రతిపత్తిని విశేషముగ వృద్ధిచేసినవి. ధర్మలక్ష్యము లేని ప్రయత్నము లారంభమునందు లాభదాయకములుగ గనుపడినను విశ్వకల్యాణమునకును నిత్యలాభమునకును నిరర్థకము లగుచున్నవి. స్వప్రయోజనపరాయణత్వము ధర్మగ్లానికిని పరప్రయోజన పరాయణత్వము ధర్మాభ్యుదయమునకును సాధనముగాగల విధమును స్నోడనుగారి విజయము ప్రతిపక్షుల పొగడ్తలును విశదము చేయుచున్నవి. యూరపు నందును, సామ్రాజ్యాంతర్భాగములందును, ఇతర రాజ్యములందును గతకాలమునందు కన్సర్వేటివుపక్షమవలంబించిన రాజ్యనీతి బ్రిటీషు ప్రతిష్ఠను భగ్నము చేసినది. సకలరాజ్యములకును బ్రిటీషు బలమునందును, బ్రిటీషు ధర్మమునందును విశ్వాసము పోయినది. క్షీణించుచున్న బ్రిటీషుగౌరవప్రతిష్ఠలకు లేబరుప్రభుత్వము పుష్టి నొసంగినది.

సామ్రాజ్యాభిమానమును రక్షించుటకు మాయోపాయముల నామోదించవలసిన కన్సర్వేటివు ప్రభుత్వము సామ్రాజ్యాభిమానుల దుస్తంత్రమున కభయము నొసంగవలసిన గతియేర్పడినది. సామ్రాజ్యాభిమానతంత్ర మితర రాజ్యములతంత్రములను హర్షించుటకు వినియోగపడినది. బ్రిటీషుప్రజలు పనిపాటులు లేక కృశించుచున్నపుడు దేశాదాయము సంగ్రామసన్నాహములకు వ్యయము చేయుటయు, పరరాజ్యములపాలు చేయుటయు పరమాన్యాయము. గ్రేట్బ్రిటను యూరపురాజ్యములకు కామధేనువు గాజాలదని స్నోడనుగారు చెప్పుట యుక్తముగ నున్నది. కాని గ్రేట్బ్రిట నీకార్యమును సైతము స్వార్థచింతతో జేయుచున్నది గాని పరమార్థచింతతో జేయుట లేదు. స్నోడనుగారి అధికారము ప్రాన్సున కాశాభంగమును గలుగజేసినను చిన్నిరాజ్యములకును, జర్మను రాజ్యమునకును సంతృప్తిని గలుగజేసినది. హేగుసమావేశమందు లేబరుపక్షమవలంబించిన రాజ్యనీతి బ్రిటీషుప్రతిష్ఠను, యూరపు శాంతిని వృద్ధిచేయుటకు వినియోగపడినది.

* * * *

### నానాజాతి సమితి

నానాజాతి సమితియందు రామ్సె మెక్డొనాల్డుగారు చేసిన ప్రసంగము, బ్రిటీషు ప్రభుత్వ నిర్ణయములు ప్రశంసనీయములుగ నున్నవి. గ్రేటుబ్రిటను తాత్కాలికముగ సంధి నియమము నంగీకరించుటవలన సమితి ప్రతిష్ఠయును బ్రిటీషు గౌరవమును వృద్ధిపొందినవి. వలస రాజ్యములు నీ మార్గము నవలంబించుట కంగీకరించినవి. నానాజాతిసమితి యందు పేరున్నను ప్రతిష్ఠ లేని భరతవర్ష విషయమై యోచింపవలసిన యవసరము లేక. స్వదేశమునందు స్వాతంత్ర్యములేని భరత ఖండమునకు విదేశములందు గౌరవము గలుగదు. భరతవర్షమునకు సమితియందు ప్రతిష్ఠ లేకపోయినను ఆ యుధ నియమము విషయమై లేబరు ప్రభుత్వము చేయుచున్న ప్రయత్నములు సకలజనామోదము బడయగలవు. అమెరికాకును గ్రేటుబ్రిటనుకును యుద్ధనావల విషయమై నిర్ణయములు సాధ్యమైనవెంటనే యూరపురాజ్యములకును నిది సాధ్యముగాగలదు. సంగ్రామపరంపరకు నిలయమైన ఫ్రాన్సు భయభ్రాంతులకును, క్రోధావేశములకును పాలగుట సహజమైనను యుద్ధనివారణోపాయములను నిర్ణయించుటయందు ఫ్రాన్సునకు గల యవసరము యూరపురాజ్యములందే యితర రాజ్యములకును లేదు.

గ్రేటుబ్రిటను ఫ్రాన్సుతో మిత్రత్వమును వహించియును, శత్రుత్వమును బూనియును ఫ్రాన్సురణరంగములను ననేకశతాబ్దములు రక్తభూయిష్ఠము చేసినయుదంతములు సంగ్రామేతిహాసములందు పరమవిషాదమును గలుగజేయుచున్నవి. ఫ్రాన్సు వార్ధక్యదశయందైనను శాంతిని బూని ఆత్మోద్ధరణమునకు పాటుపడుట శ్రేయోదాయకము. గ్రేటుబ్రిటను అమెరికారాజ్యముల సంయోగము యూరపు రాజ్యనీతియందు నూతన శకోదయమునకు మూలాధారము గాగలదు. యూరపురాజ్యములం దంతర్విభేదము లెటులు పరిణమించినను పారతంత్ర్యమునందు కృశించుచున్న ఆసియా రాజ్యములును, ఆఫ్రికా రాజ్యములును సంగ్రామప్రతిషేధము నామోదించుట సాధ్యముగాదు. రామ్సెమాక్డొనాల్డుగారు ఈజిప్టుస్వాతంత్ర్యము విషయమై తెలిపిన భావము లీవిషయమునకు వ్యాఖ్యానములుగ నున్నవి.

"యూరపు రాజ్యములందు శాంతి గలిగినంతమాత్రాన ప్రపంచమునందు శాంతి గలుగజాలదు. మతమునందు, విజ్ఞానమునందు, తత్త్వాన్వేషణము నందు, నాగరకతయందు పురాతనమైన ప్రాచ్యభాగము గలదు. ప్రాచ్యదేశములు పాశ్చాత్యరాజ్యములకు లబ్ధమైనభౌతికశక్తులం దింతవరకును ఉపేక్షించి యున్నవి. ఆదేశము లిపుడు పీల్కొని జాతీయాత్మగౌరవమును గ్రహించుట కుపక్రమించినవి. ఆదేశము లిపుడు మనభావములను మనకు జూపుచు మన మనేక తరములనుండియును పోషించుచు ననుభవించుచున్న స్వాతంత్ర్యము నీయవలయునని కోరుచున్నవి."

రామ్సెమాక్డొనాల్డు గారు ఈజిప్టును నిర్దేశించి తెలిపినభావములు నూరురెట్లధికముగ హిందూదేశమున కన్వయించు

చున్నవి. ప్రాచీనవిజ్ఞానసంపన్నులైన ముప్పది మూడుకోట్ల ప్రజలు పారతంత్ర్య దుఃఖము ననుభవించుచు స్వాతంత్ర్యమునకై విశ్వప్రయత్నములను జేయుచున్నపుడు ప్రపంచశాంతికి భారతీయపారతంత్ర్యము ప్రతిబంధకమనియును, భారతీయస్వాతంత్ర్యము పరమప్రయోజనకరమనియు బ్రిటీషు రాజ్యనీతిజ్ఞులు గ్రహించుట యవసరము. బ్రిటీషురాజ్యనీతిజ్ఞులకు సంకుచితములైన సామ్రాజ్యప్రయోజనములు, శ్వేతజాతులప్రయోజనములు, స్వప్రయోజనములు గోచరంబైనటులు ప్రపంచశాంతియును, మానవధర్మమును, భారతీయస్వాతంత్ర్యమును గ్రాహ్యములు గాకుండుట ప్రపంచము నావరించిన దురదృష్టప్రభావమై యున్నది. మాక్డొనాల్డుగారు ఈకష్టవిషయమై ప్రతిపాదించిన సిద్ధాంతములను భారతీయ రాజ్యాంగములకు పైతము సమన్వయము చేయుటకు భగవంతుడు బ్రిటీషుప్రభుత్వమునకును, బ్రిటీషుప్రజలకును జ్ఞానోదయమును ప్రసాదించుగాక!

* * * *

భారత రాజ్యాంగములు

భారతరాజ్యాంగస్థితి సకలవిధముల నధోమయముగ నున్నది. నాయకుల విభేదములు, ప్రజల యలసత్వము, ప్రభుత్వనిర్బంధములు భారతజాతీయసత్త్వమును నిర్వీర్యము చేసినవి. ప్రజాహృదయమునం దాత్మవిశ్వాసము స్తంభించినది. ప్రభుత్వహృదయమునందు సంశయభావము వ్యాపించినది. గాంధిమహాత్ముడు మొదలు సామాన్యమానవుని వరకును ఆత్మశక్తియందు విశ్వాసము పోయి పరావలంబనమునందు విశ్వాసము ప్రబలినది. గాంధిమహాత్ముడు లాహోరు కాంగ్రెసున కగ్రాసనాధిపత్యమును స్వీకరించుటకు నిరాకరించుచున్నాడు. చిరకాలసంవర్ధితమైన మిథ్యావైరాగ్యమును నిర్మూలముచేసి కర్మయోగమును వృద్ధిచేయుట గాంధిమహాత్మునకును, నాయకులకును ధర్మమై యున్నది. ప్రజాహృదయమునం దేర్పడిన యలసత్వమును నిర్మూలము చేయుటకు గాంధిమహాత్ముని నాయకత్వమునకు ప్రయోజనకరముగాని గాంధిమహాత్ముని నిరాదరణభావము ప్రయోజనకరము గాదు. నిస్సహాయస్థితియందున్న ప్రజలను కార్యపరతంత్రులను జేయుటకు గాంధిమహాత్ముని నాయకత్వ మవసరముగ నున్నది. భారతీయ నాయకులందరును గాంధిమహాత్ముడు సభాధిపత్యమును వహింపవలయునని కోరుచున్నారు. ఎవ రేమి చెప్పినను గాంధిమహాత్ముడు సభాధిపత్యమును వహించుటకు నిరాకరించుచున్నాడు. ప్రతికూలపరిస్థితులందు నాయకత్వము వహించి కార్యభారమును నిర్వహించుట నాయకుల ధర్మము. గాంధిమహాత్ముడును దేశపరిస్థితులను, ప్రజాప్రార్థనలను నాలకించి కాంగ్రెసు సభాధిపత్యమును స్వీకరించుట సకలవిధములను స్వధర్మనిర్వాహణమున కనుకూలముగ నున్నది.

ఇతర నాయకులును భేదాభిప్రాయములను బూని భారతజాతీయ శక్తిని నిరర్థకము చేయుట సంతాపకరముగ నున్నది. చెన్నపురి

రాష్ట్రమునందు పక్షములందును, నాయకు
లందును గలుగుచున్న భేదములు ప్రజాహిత
జీవనమును దుర్లభము చేయుచున్నవి. శ్రీని
వాసయ్యంగారు వరదరాజులు నాయుడుగారు
ప్రకటించుచున్న భేదాభిప్రాయములు, బ్రాహ్మ
ణులు, బ్రాహ్మణేతరులు ప్రకటించుచున్న భేదా
భిప్రాయములు, కాంగ్రెసు ప్రచారకులందును
అభ్యర్థులందును వ్యక్తమగుచున్న భేదాభిప్రా
యములు దక్షిణదేశావృతమైన విషమస్థితిని
విశదము చేయుచున్నవి. ఇటీవల చెన్నపురికి
దయచేసిన సర్దారు వల్లభభాయి పటేలుగా
రీ విషమస్థితిని బాగుగ గ్రహింప గలిగిరి.
రాజ్యాంగ జీవనమునందు దేశలక్ష్యము, ధర్మ
లక్ష్యము సంకుచితమై సాంఘిక లక్ష్యము,
స్వప్రయోజనలక్ష్యము ప్రబలినపుడు రాజ్యాం
గజీవనము పరమానర్థములకు మూలమగు
చున్నది. వల్లభభాయిపటేలుగారు చేసినహితో
పదేశము నైనను చెన్నరాష్ట్ర ప్రజలు
గ్రహించి స్వధర్మ నిర్వహణమును జేయుట
శ్రేయస్కరము. సకల వ్యవహారములందును
బ్రాహ్మణబ్రాహ్మణేతర విభేదములను శంకిం
చుట పరమానర్థములకు మూలముగ నున్నది.
ప్రజానాయకు లీ రహస్యమును గ్రహించి
పరస్పర విశ్వాసమును గలిగి దేశోద్ధరణము
నకు పాటుపడుచు స్వరాజ్యానుభవమును బడ
యుదురుగాత!

ప్రభుత్వ మవలంబించుచున్న నిర్బంధ
విధానము సర్వత్ర పరమాసహ్యమును, సంతా
పమును గలిగించుచున్నది. రాజకీయ నిర్బంధితు
లవలంబించిన నిరశన దీక్ష ప్రభుత్వహృదయము
నందు సంచలనమును గలుగజేసినది. రాజకీయ
నిర్బంధితులకు భోజన సౌకర్యములను సమ
కూర్చుటకు కమిటీ నిర్ణయించినది. నిర్బంధితులు
నిరశనవ్రతమును విడిచి భోజనమును జేయుట
కుపక్రమించిరి. జతీంద్రనాథదాసుగారు నిరశన
వ్రతమువలన నపాయస్థితియం దున్నటులు
తెలియుచున్నది. మరణావస్థయం దున్న
వానిని విడుదల చేయకపోవుట న్యాయవిరు
ద్ధమని సకల జనులును సంగీకరింప గలరు.
త్యాగమువలన గలిగెడిఫలమును నిర్బంధితు
లవలంబించిన నిరశన వ్రత ఫలము విశదము
చేయుచున్నది. నిరంకుశాధికారులు భారతీ
యులకు స్వప్రయోజనములను సమకూర్చి
నను విశాలప్రయోజనములను సమకూర్పరని
రాజ్యాంగముల చరిత్రము విశదము చేయు
చున్నది.

వంగరాష్ట్రమునందు ప్రభుత్వ మవలం
బించుచున్న నిర్బంధప్రస్థానము ప్రభుత్వహృద
యమును విస్పష్టము చేయుచున్నది. కలకత్తా
యందు ఊరేగింపును జరిపినందులకు కిరణశం
కరరాయి, సుభాష్ చంద్రబోసుగారులు మొద
లగు నాయకులు నిర్బంధములపాలు చేయ
బడిరి. ప్రభుత్వ మవలంబించుచున్న నిర్బంధ
విధానముల కాద్యంతములు లేకపోయినను
ప్రజల నిస్సహాయస్థితి శోచనీయము. సక
రంగములందును వివిధసందర్భములందును నీ
దుర్భరస్థితియె ప్రత్యక్షమగుచున్నది. సుప్రతిష్ఠి
తమైన ప్రభుత్వాధికారమును భారతీయులు

ప్రతిఘటించి విజయమును బడయుటకు సుప్రతిష్ఠితమైన ప్రజాబలము గావలసియున్నది. ప్రజానాయకులు సుప్రయుక్తమైన ప్రజాబలమును సమకూర్చజాలనంతవరకును ప్రభుత్వమును ప్రతిఘటించుటయును, విజయమును బడయుటయును దుర్లభము లని నిత్యానుభవము విశదము చేయుచున్నది. 1930 జనవరి మొదటి తేది సమీపించుచున్నను గాంధిమహాత్ముడు ఖద్దరు ధ్యానము చేయుచు సత్యాగ్రహప్రస్థానమును తలపెట్టక కాలయాపన చేయుచున్నాడని ఆక్షేపించుట సులభము. కాని గాంధీమహాత్ముడు వ్రాసినటులు ప్రజలు, బార్డోలిప్రజలుకూడ, సత్యాగ్రహప్రస్థానమును చేయుటకు దగిన శిక్షణమును నిగ్రహమును పొంది యుండలేదని లేఖకుడు గ్రహించుట ధర్మము. విద్యావంతులకు వాగ్వివాదములందు గల యాశక్తి కార్యవిధానము నందు గనుపడదు. శాసనసభలయందు గల వ్యామోహ మిందులకు నిదర్శనము. పారతంత్ర్యస్థితి కిది సహజావస్థ.

* * * *

ఆగస్టుమాసము ముగిసినది. వివిధరాష్ట్రములందును నిర్ణయించిన కాంగ్రెసు సభ్యులు సమకూడలేదు. ఆంధ్రరాష్ట్రమునందు 46,000 సభ్యులు చేరవలసి యున్నను నింతవరకును 26,000 మాత్రమే చేరుట ప్రజల యాలసత్వమునకు నిదర్శనముగ నున్నది. కర్మయోగియైన గాంధిమహాత్మునకీయాలసత్వముహృదయవేదనను గలుగజేయుటయునుఆయన "ముండ్ల కిరీటమును" ధరించుటకు నిరాకరించుటయును సహజము. కాంగ్రెసు సభాధిపత్యమును నిర్ణయించుటకు సెప్టెంబరు మాసమునందు అఖిలభారతకాంగ్రెసుకమిటీ కూడనున్నది. ఈ లోపుగ ప్రజానాయకులు కాంగ్రెసుసంస్థలను బలపరచి మహాత్ముడు తన నిర్ణయమును మార్చుకొనునటులు చేయుట సమంజసము. గాంధిమహాత్ముడు 1920 వ సంవత్సరమునందువలెనే విషమావస్థపాలగుట సహజము. ఆ సమయమునందువలెనే దేశమును గమ్యస్థానమునకు ధర్మమార్గమున జేర్చుటకు లాహోరుకాంగ్రెసు సభాధిపత్యమును మహాత్ముడు స్వీకరించుటయును నవసరము. ధర్మజ్ఞుడును, కర్మజ్ఞుడును నైన గాంధిమహాత్ముడు స్వధర్మ నిర్వహణము జేసిస్వరాజ్యప్రస్థానమును జేయుటకు పరమేశ్వరానుగ్రహము గలుగుగాత!

* * * *

**శాసనసభలు**

శాసనసభల ప్రయోజనము భారత రాజ్యాంగ పరిస్థితులం దతిస్వల్పమని నిత్యవ్యవహారములు విశదము చేయుచున్నవి. శాసనసభలయందుసభాధిపతికిగాని,శాసనసభకుగాని రాజ్యాంగములను శాసించుట కవసరమైన యధికారము లేనపుడు శాసనసభలు చర్చాసభ లగును గాని శాసనసభలు గాజాలవు. శాసనసభలకు గల శాసనాధికారము రాజప్రతినిధి దయాదాక్షిణ్యములపై నాధారపడి యున్నవిధమును రాజ్యాంగచరిత్రము సంస్మరింపజేయుచున్నది. దేశక్షేమ సంరక్షణ శాసనముయొక్క యుదంత మీ విషయమును విస్పష్టము చేయుచున్నది. సభాధిపతి విఠ్ఠలుభాయి పటేలుగారు దేశక్షేమ సంరక్షణశాసనమును వర్తమాన పరిస్థితులందు

శాసనసభయందు చర్చించుట యనుచితమని నిర్ణయించిరి. ఆనిర్ణయమును నిరర్థకము చేయుటకై ప్రభుత్వ మవలంబించుచున్న వామమార్గము శాసనసభల నిష్ప్రయోజనమును విశదము చేయుచున్నది. శాసనసభాధికారము శాసనసభాధీనమునందు గలదు. దానినిరక్షించవలసిన భారము సభాధిపతిమీద గలదు. ఈ యధికారము వలనయు నిరంకుశవర్గము స్వాధీనము చేసికొనగోరుట యనుచితమని రాజ్యాంగ సిద్ధాంతములు వ్యక్తము చేయుచున్నవి. అట్టినను నిట్టిసామాన్యసిద్ధాంతము నే భగ్నము చేయుటకు బూనుకొనుట భారత రాజ్యాంగముల దుర్దశకు నిదర్శనముగ నున్నది. ఇర్విన్ ప్రభువుగారు పటేలుగారి నిర్ణయములను తియ్యనిమాటలతో ప్రశంసించుచు తీవ్రమైన నిబంధనలతో ప్రతిరోధింపబూనుకొనుట యన్యాయముగ నున్నది. శాసనసభలయం దీ యన్యాయముసైతము ప్రతిఘటించుటకు శాసనసభ్యులకును, సభాధిపతికిని నధికారము లేకుండ జేయుట శోచనీయముగనున్నది. స్వరాజ్యసంపాదనమునం దిట్టి యన్యాయము లెన్నిటినో ప్రజానాయకులు అనుభవింపవలసి యుండును. శాసనసభలవలన దేశమునకు స్వరాజ్యసంపాదనమునకు ప్రయోజనము గలుగదని [illegible] కార తంత్రములు విశదము చేయుచున్నవి. విద్యాసంస్థలకు శాసనసభల వ్యామోహము వదలకున్నది..

రాజ్యాంగరంగమునందు శాసనాధికారమునకు నిరంకుశాధికారవర్గము ప్రతిఘటించునటులు సాంఘిక విషయములందు పూర్వాచారపరాయణులు ప్రతిఘటించుట దేశము నావరించిన దౌర్భాగ్యస్థితికి నిదర్శనముగ నున్నది. శారదావివాహశాసనము సనాతన ధర్మపరాయణులందు గలుగజేయుచున్న కలవర మీవిషయమును విస్పష్టము చేయుచున్నది. సనాతన ధర్మపరాయణులు శాసనసభ మతమునందు జోక్యమును గలుగజేసికొన్నదని ఘోషపెట్టుట యనుచితముగ నున్నది. మతమునకును సాంఘికాచారములకును సంబంధము గల్పించుటయు, మతఘోష పెట్టుటయు వర్తమాన యుగమునందు నిరుపయోగమని ప్రాజ్ఞులు గ్రహింపగలరు. సర్. జేమ్సుక్రేరారుగారు ప్రభుత్వపక్షమున శారదావివాహశాసనమున కభయము నొసంగుట ప్రశంసనీయముగ నున్నది. ఇంతవరకును తటస్థభావమును వహించుచుండిన ప్రభుత్వమిప్పుడు వారి లక్ష్యమును మార్చుకొనుటయు కొంతవరకు శుభావహముగ నున్నది. రాజ్యాంగసందర్భములందు నిరంకుశవర్గమును, సాంఘికవిషయములందు పూర్వాచారప్రియులును ప్రతిఘటనమును జూపుచున్న శాసనసభలు దేశక్షేమమునకు విశేషము ప్రయోజనకరములు గావని నిత్యానుభవము విశదము చేయుచున్నది. ప్రజానాయకులు వివిధరంగము లందును కర్మయోగ పరాయణులై కార్యాచరణమునకు బూనుకొనుట ప్రజాభీష్టసిద్ధికి పరమ సాధనముగ నున్నది. ప్రజానాయకులు సకలరంగము లందును కర్మయోగ పరాయణులై శాంతిసౌఖ్యములను బడయుదురు గాక!

---

Printed and Published by K Nageswara Rao, at the Andhra Patrika Press, No.7, ThambuChetty St, Madras